# విషవృక్షము



శ్రీ బాలాంత్రపు నీలాచలముచే
నాంధ్రీకరింపబడినది












పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు,
్యనారాయణ బుక్ డిపో,
రాజమండ్రి.



2-0-0
వెల

# విషవృక్షము

శ్రీ బంకించంద్ర చట్టోపాధ్యాయులవారి బంగాళాభాషకు
గావింపబడిన కన్నడపరివర్తనము ననుసరించి
బాలాంత్రపు నీలాచలము గారిచే
నాంధ్రీకరింపబడినది.







పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు,
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి.
1950

2-0-0

[ వెల 

శ్రీరామచంద్ర.

# విషవృక్షము.

## మొదటి ప్రకరణము

నగేంద్రనాథదత్తు గంగానదియందుఁ బడవపైఁ బ్రయాణము చేయుచుండెను. అది జ్యేష్ఠమాసము ఆమాసమునఝంఝామారుతము లతితీవ్రముగ వీచుచుండును. అందువలన నతఁడు ప్రయాణమును సాగించుటకుఁబూర్వమే యాతనిపత్నియగుసూర్యముఖి తనకాంతునితో "చాలజాగరూకులై యుండవలయును. పెనుగాలి వీచినపుడు పడవలో నుండక తీరమునకు వచ్చి యాపడవను నొకగూటమునకుఁ గట్టింపవలయును." అని యనేకవిధములఁ దనపై నొట్టుపెట్టుకొని యతివినయముతోఁ జెప్పికొనెను.

నగేంద్రనాథుఁ డట్లేచేసెదనని యొప్పుకొని బయలుదేరెను. నగేంద్రనాదుఁడందులకియ్యకొననియెడలసూర్యముఖియునాతనిప్రయాణమునకు సమ్మతించియుండదు. నగేంద్రుడు కలకత్తానగరమునకుబోవుటకును సాధ్యపడదు. అతని కక్కడఁ జాలఁదొందరపనులు కలవు.

నగేంద్రనాథదత్తుఁ డతుల్యైశ్వర్యసంపన్నుఁడగు నొకజమీను దారుడు అతనివాసస్థానము గోవిందపురము. ఆగ్రామ మేమండలమునకుఁ జేరియుండెనో యది ప్రకృతమునఁ జెప్పవలసినయవసరములేకపోయినను, హరిపురమని చెప్పి వర్ణించెదము. నగేంద్రుఁడు వయసునందు ముప్పదివత్సరములకు మించనియావనపురుషుఁడు. ఆతఁడు తనస్వంత నౌకపై బ్రయాణమును జేయుచుండెను. మొదటిరెండుదినములు నాతనిప్రయాణమును నిర్విఘ్నముగా సాగెను. ఆనదీజలప్రవాహ మనిరళ

ముగా జాఱుచు, నిమ్నోన్నతప్రదేశములందు ఫేనమైపడుచు గాలిచే నాట్యమాడుచు, భాస్కరకిరణప్రసారముచే మందస్మితయగుచు, నం దందు జలావర్తముల నేర్పరించుచు, గంభీరముగ గర్జించుచుఁ బ్రవహించుచుండెను. అట్టిగంగాప్రవాహమున నగేంద్రుఁడు పడవపైఁ బ్రయాణమును జేయుచుండెను. ఆజలరాశియు నశ్రాంతమై, యనంతమై, క్రీడామయమై, యత్యంతవిస్మయానందజనకమై యుండెను. ఆనదీతీరమున నున్నపొలములలోఁ బశులకాపరులు తమపశువులను మేపుకొనుచుండిరి. వారిలో నొకఁడు పొగాకును నోటిలో నుంచుకొని తుప్పున నుమియుచుండెను. మఱియొకఁడు పొగచుట్టను బీల్చుచు సారెసారెకుఁ దలనెత్తి యర్ధసంకుచితమైననోటినుండి మేఘాకారముగా వ్యాపించుచున్న చుట్టపొగ నాకాశమార్గమున కూడుచు దానివికృతిప్రకృతులను జూచుచు నానందభరితుఁడగుచుండెను. అక్కడక్కడఁ గొందఱువృద్ధులగుతలిదండ్రులు, నక్కచెల్లెండ్రు, భార్య మొదలగువారిపేర్లనుజెప్పి పరస్పరముఁదిట్టుకొనుచుఁ గలహించుచుండిరి. మఱికొందఱు నదియొడ్డునఁ దమకూటిముంతలను విప్పికొని గంగాజలసేచనముగావించి గుక్కెడుగుక్కెడువంతున సావకాశముగా భుజించుచుండిరి. అందందు రైతులు పొలములను దున్నుకొనుచుండిరి. కొన్నిచోట్ల వృషభములదుగులో నడుగువేయుచు భూమిని చీల్చుకొనివచ్చుచున్న భారమైననాగలిని లాగలేక విశ్రాంతికై నిలువఁగా హాలికుఁడు వానిని గాచెడువారిభార్యలపేళ్ళనెత్తి తిట్టుచుండెను. ఎద్దులను బేరుల వరుసను బిలుచుచుఁ గఱ్ఱతోఁ గొట్టి తోలుచుండెను. ఆనదీఘట్టముల నందందు హాలికులయువతీమణులుకొందఱు మృణ్మయపాత్రలను శిరసులపై నుంచుకొనియు, గొందఱు కంబళి, దుప్పటి లోనగునవి సందిట నిరికించుకొనియు, బంగారుముక్కెర, రజతబాహువలయము, చర్మాంగుళీయము మున్నగువానిచే నలంకృతలై యొకమాసమునకుబూర్వ

ముదికిన జీరెలను దాల్చి, మసినిరసించెడు దేహకాంతిచే నలరారుచు బూతికేశలై గుంపులుగుంపులుగాఁ గూడియుండిరి. వారిలోసుందరియొకతె గంగా మృత్తికను తలకురాచికొని రుద్దుకొనుచుండెను. మఱియొకతె బిడ్డను కొట్టుచుండెను. ఇంకొకతె తనపొరుగింటియామెతో నొకపురుషునిగూర్చి హీనముగాఁ దిట్టుచు మాటాడుచుండెను. సఱియొకతె యొకఫలకముపై వస్త్రముల నుదుకుచుండెను. కొన్ని గొప్పగొప్ప జనపదములందు కులకాంతలు నదీసోపానపంక్తుల నలంకరించియుండిరి. వారిలో వృద్ధకామినులుపన్యాసముల నిచ్చుచుండిరి. శ్రోతలు వారివక్తృత్వమునకు నిశ్చేష్టితులగుచుండిరి. మధ్యవయస్కలు తమయిష్టదేవతను బూజించుచుండిరి. యువతులు తమ మేలిముసుంగుల నెడలింపకయె నదీజలముల స్నానమాచరించుచుండిరి. పిల్లలఱచుచు నిసుకతిన్నెలపైనాడుచు నొండొరులపై నదీజలంబులఁ జల్లుకొనుచు స్త్రీజనంబు లిష్టదేవతారాధనమునం దవిలి ముదితనయనలై యుండ వారికెట్టెదుట నున్న ఫలములు మున్నగుపూజాద్రవ్యములను గికురించుకొని పాఱిపోవుచుండిరి. బ్రాహ్మణమహాజనులు నిరీహాసత్స్వరూపులవలె గంగాస్తవమును నోటితోఁ బఠించుచు హస్తముతోఁ బూజసల్పుచు నదియందాగ్రీవనిమజ్జితులై యున్న యువతులను బరులకుఁ గనఁబడకుండ నొక్కొకసారి క్రేగంటి ప్రసారమున కుతూహలవిశిష్టులై విలోకించుచుండిరి. ఆకాశమున సామాన్యమైన వెలిమబ్బు గ్రమ్మి సూర్యకాంతికష్టగాఁ దిరుగాడుచుండెను. దానికిఁ గొంచెము క్రిందుగా నల్లనిచుక్కవలె నొకపక్షి యెగురుచుండెను. నారికేళవృక్షంబుపై గరుత్మంతుఁ డధివసించి వృద్ధరాజమంత్రులవలెనె నాలుగుదిక్కులను బరికించిచూచుచు దేనిపైఁబడి యుపహరించుకొనిపోవుదునా యని యోచించుచుండెను. బకము శల్యావశిష్టుఁడగుబక్కమాసినవానివలె తీరమునందున్న యడుసులో నీఁగుకొ

నుచు నందందుఁ దిరుగాడుచుండెను. లావుకపక్షి రసికులవలె నీ
మునుఁగుచుం దేలుచు జలకేళి సలుపుచుండెను. తక్కుంగలద్విజ
జాయము సామాన్యజనులవలె నందఁదు నెగురుచుండెను. వ[illegible]
దోనెలు స్వప్రయోజనార్థమై యేగుచుంటచే శీఘ్రముగాఁ బోవు
డెను. అద్దెకుఁ దీయబడిననావ లన్యుల ప్రయోజనార్థమై యేగు
డుటచే గజేంద్రగమనమునఁ బోవుచుండెను. స్వంతనౌకలు సా
కార్యార్థమై యేగుచుంటచే సరిగా బోవుటలేదు.

వానినన్నిటిని జూచుచు నగేంద్రుఁడు మొదటిరెండుదినముల
ప్రయాణముచేసెను. మూఁడవదినమున నాకాశమునందు మేఘము
క్రమ్మనారంభించి క్రమక్రమముగా నంతయు మూసికొనిపోయె.
నదీజలరాశియు నీలాకారమును దాల్చెను. తరుపత్రములు వాడిన
మున నానతములై నిశ్చలములుగా నుండెను. పక్షులు గగనవీథిని
ఘుమండలమునకు నెగిరిపోయెను. నదియునిష్పందమై యుండెఁ
నగేంద్రుఁడు పడవనడపునాతనికి ''పడవను తీరమునకుఁజేర్చి కట్టి
యుము'' అని యాజ్ఞాపించెను. నావను నడపుచున్నరహామతమొ
యనునాతఁ డప్పుడు ''నమాజు'' ను జేయుచున్న కారణమునన
ద్రుఁనియాజ్ఞకుఁ బ్రతివచనము జెప్పలేదు. రహామతుఁ డెన్నడుఁ
మాలిమిపనిని జేసియుండినవాఁడు కాఁడు. ఆతనిమాతామహుని
దరి యొకమాలిమిగానికూఁతురు. ఆగర్వముచే నాతఁడు మాలిమి
తనమునకు విద్యార్థియై యదృష్టబలముచే సిద్ధకాముఁ డయ్యెను
అయినను పడవ నడపుట యాతని.కంతగా ననుభవము లేదు
'నమాజు' ముగిసినపిమ్మట నాతఁడు యజమానివైపునకుఁ దిరి
'స్వామీ ! భయమెందులకు ? మీరు నిశ్చింతగా నుండవచ్చును'
అనియెను. తీరమొకటిరెండడుగుల దూరమున నుండుటచే రహా
మతున కట్టి ధైర్యముండెను, తుదకాతఁ డెట్లో శ్రమపడి పడవను
దీరమునకుఁ జేర్చెను.

రహమతునకును వరుణవాయుదేవులకును స్వల్పముగా మన స్తాపమున్నటుల తోఁచెడిని. మొదట ఝంఝూమారుతము వీవ నారంభించి క్రమముగా విజృంభించి తరులతో మల్లయుద్ధమును జరపి పిమ్మట సోదరుఁడగు వరుణునితోఁ గలిసి యనేకావాంతరము లాతనికిఁ గలిగింపఁజొచ్చెను. వరుణదేవుఁడు వాయుదేవుని నతిశయించి వృక్షములను వంగఁజేసియు, కొమ్మల విఱిచియు, లతలను జీకాకు బఱచియు, కుసుమములరాల్చియు, నదీజలముల నల్లకల్లోలముగాఁ గలంచియు ననేకములగు నుత్పాతములను గలిగించెను. ఒకఁడు రహమతుని శిరోవేష్టము నపహరించుకొనిపోయెను. మఱియొకఁడాత నిగడ్డమునుండి జలప్రవాహమును బ్రవహింపఁజేసెను. నావికులు నోడ తెఱచాపను గంపి కూర్చుండిరి. నగేంద్రుఁడు పడవ కిటికీలను మూసికొనెను. సేవకులు సామానులన్నిటిని దాచివైచిరి.

నగేంద్రునకు విషమసంకటము సంప్రాప్తమయ్యెను. ఝంఝూ మారుతమునకు భీతిఁజెంది యోడనుండి దిగిపోయినచో నావికులు నవ్వి యాతని పిఱికివాఁడని యనుకొందురు. దిగకున్న యెడల సూర్య ముఖియెడల మిథ్యావాది యగును. మిథ్యావాదియైనయెడల బాధక మేమియని పాఠకులలో ననేకులు చర్చింపవచ్చును. దానివలన బాధక మేమో మాకుఁ దెలియదు. దానివలన బాధకమేయని నగేంద్రుఁడు గ్రహియించెను. ఆసమయమున రహమతుఁడు నగేంద్రునితో 'స్వామీ! పగ్గము చిరకాలమునాఁటిది. ఏమగునో చెప్పఁజాలము. గాలియు ప్రబలమగుచుండెను. పడవనుండి దిగిపోవుటయె మంచిదిగాఁ గనఁబడుచున్నది' అనియెను. అప్పుడు నగేంద్రుఁడు పడవనుండిదిగి యొడ్డునకుఁ బోయెను. నిరాశ్రయమైన యానదీతీరమున నిలిచి యుండుట కెవరికిని సాధ్యముకాదు. అప్పుడె యస్తమయమగు చుండెను. వర్షము వెలియుని కారణమున నగేంద్రుఁడు నిలుచుటకుఁ

దగినస్థలమును వెదకికొనుట కర్తవ్యమని యోచించుకొని గ్రామాభిముఖుఁడై చనుచుండెను. నదికి గ్రామము కొలఁది దూరములోనే యుండెను. నగేంద్రుఁడు పాదచారియై వెడలెను. ఆమార్గమంతయు నడుసుతోను వర్షజలముతోను నిండియుండెను. గాలియుఁ గొంచెము తగ్గి వీచుచుండెను.

అయిన నాకాశము మేఘపరిపూర్ణమై యుండుటవలన వర్షము మరల కురియవచ్చునని గ్రహించి నగేంద్రుఁడు తత్పూర్వమే గ్రామాభిముఖుఁడై పోయెను. వెనుకకుఁ దిరుగలేదు.

ఆకాశమునఁ గాఱుమబ్బు లతిశయించి ప్రదోషకాలముననే గగనమంతయుఁ గప్పివేసెను. ఇది గ్రామ, మిది యిల్లిదిదారి, యిది నదియనునది యేమియుఁ గనఁబడుటలేదు, వనతరులు మాలాకారములై మెఱుగుడుబురువులచే నలంకృతములై వజ్రఖచితకృత్రిమ తరులవలె మిగుల శోభాయమానములై ప్రకాశించుచుండెను.

గర్జనహీనమై శ్వేతకృష్ణకాంతులచే నలరారు మేఘమాలిక నడుమనుండి హ్రస్వదీప్తమైనవిద్యుత్ప్రకాశ మొక్కసారిగా హ్రాసము నొందని ముగుదలకోపమునవలెనే క్షణక్షణమున మెఱయుచుండెను. మండూకములు నవవారిసమాగమముచేఁ బ్రఫుల్లచిత్తములై యస్పష్టముగాఁ గూయుచుండెను. అప్పుడు వినవచ్చుచున్న కీచురాలధ్వని రావణుని చితివలె నశ్రాంతమై 'జీయ-జీయ'ను ఝుంకారధ్వనివలె నుండెను. ఆధ్వనిని లక్ష్యముగా వినినచో నది చెవికి విన బడదు. ఆశబ్దములనడుమ—వృక్షాగ్రములనుండి పత్రములపై బడు వర్షపునీటి తొటతొటశబ్దము—తరుమూలముల నిలిచిన నీటిలోఁ బత్రములనుండి జాఱెడునీటిబిందువులు పడుటచేఁ గలుగు శబ్దము—మార్గమందు నిలిచిన నీటియందు బాటసారుల పదసంచారముచేఁ గలిగెడుశబ్దము-అందందొక్కొకసారి చెట్లపైనున్నపక్షులు తడిసినతమఱెక్కల నున్న

నీటిని విదల్చుకొనుచున్న పక్షివిక్షేపశబ్దము—అప్పుడప్పుడు నిలిచినిలిచి వీచుచున్న క్షణికమైనమారుతశబ్దము—దానిచేఁ గదలింపఁబడి తరుపత్రములనుండి యేక కాలమున జారిపడెడు నీటిబిందువులజొటజొటశబ్దము ఈశబ్దములను వినుచు నగేంద్రుఁడు తరులనుండి జారిపడెడు నీటిబిందువులలో దోఁగుచు వర్షపునీటిచే ముంచివేయఁబడిన మార్గమునఁబడి జారిపడుచు లేచుచుఁ బోవుచుండ దూరమున నొక వెలుఁగు కనఁబడెను ఆకాంతిని జూచి దానికెదురుగాఁ బోయెను. స్వల్పకాలము శ్రమపడి యచ్చటికిఁబోయి చూడగా నావెలుఁగు చుట్టునిటుకలచే గట్టఁబడిన యొకపాడుగృహము నుండి ప్రసరించుచుండెను. ఆగృహద్వారములు తెఱవఁబడియుండెను. నగేంద్రుఁడు తనసేవకుని గృహద్వారమున నిలిపితాను లోపలకుఁ బోయెను. అతఁడు లోపలకుఁబోయి చూచి నప్పు డాగృహస్థితియంతయును మిగుల భయంకరముగా నుండెను.

## రెండవ ప్రకరణము

### దీపనిర్వాణము

ఆగృహము కేవలము సామాన్యమైనదిగాఁ గనఁబడుట లేదు. కాని ప్రకృతమున దానియం దైశ్వర్యలక్షణము లేవియు లేవు. ఆగృహములోని గదులన్నియు శిథిలములై మాలిన్యముతోఁ గూడుకొని యుండెను. వానియందు మనుష్యసమాగమచిహ్నము లేవియుఁ గనఁబడుట లేదు. అది యెలుకలతోను బురుగులతోను నిండియుండెను. ఒక గదియందుమాత్రము దీపము వెలుఁగుచుండెను. నగేంద్రుఁ డందుఁ బ్రవేశించెను. సంసారమున నుపయోగించెడు నొకటిరెండు తపెలలు, శిథిలమైన ప్రొయ్యి, మూడునాలుగు హరివాణములు—ఇవిమాత్ర మాగది

నలంకరించియుండెను. గోడలన్నియు మసివారి నల్లగా నుండెను. గోడమూలలందు సాలెగూడులు వ్రేలాడుచుండెను. నాలుగువైపులను సాలెపురుగులు, బల్లులు, ఎలుకలు, మొదలగునవి సంచరించుచుండెను. అంతోకజీర్ణశయ్యపై నొకవృద్ధుఁడు పరుండియుండెను. ఆతనిప్రకృతి స్థితిని జూడ నాతని కవసానకాల మాసన్నమైనట్టుల కనబడుచుండెను. నయనములు ముకుళీభావమునొంది నిశ్వాసము దీర్ఘమై యోష్ఠము కంపించుచుండెను. ఒకవైపున గోడనుండి జారిపడినయిటుకము క్రిపై నున్నమంటిప్రమిదయందు దీపము వెలుఁగుచుండెను. అదితై లాభావము నొందియుండెను. శయ్యాగతుఁడైయున్న యీ నరుని దేహమునకు నట్టి యవస్థయేసంప్రాప్తమైయుండెను. ఆశయ్యాపార్శ్వమున మఱియొక ప్రదీపము ప్రకాశించుచుండెను. అనిందితగౌరకాంతి మయమై, సుస్నిగ్ధమై, జ్యోతిర్మయమైన రూపముతో నొక బాలిక కూర్చుండి యుండెను.

తైలవిహీనమైనయాదీపపుఁగాంతి క్షీణించియుండుటవలననో లేక యాగృహమున వసించుచున్న యాజనులిద్దఱికిని సన్నిహితముగానున్న చిరతరవియోగసంతాపమున వారిస్వాంతములు సంతప్తములై యుండుటవలననో, వారెవ్వరు నందలినగేంద్రునిరాకను గనిపెట్టనందున నతఁడు గదిగుమ్మమునొద్దనిలువఁబడి మరణావస్థయందున్న యా వృద్ధునిముఖమునుండి వెడలెడు దుఃఖపూరితములగు నస్ఫుటవాక్యలను వినుచుండెను. ఆప్రాచీనుఁడు నానవీనయుబహుజనసంకీర్ణమయిన యీలోకాలయమున నిస్సహాయకులై యుండిరి. పూర్వము వారైశ్వర్యవంతులై యుండిరి. బంధుబలమును, దాసదాసీలునుగూడ నుండిరి. అప్పుడు వారికి సమస్తసహాయసౌష్ఠవములు నుండెను. కాని చంచలస్వరూపిణియైన లక్ష్మి తొలఁగినందనె సమస్తము నదృశ్యమై పోయెను. ఆవెంటనేయావేశించిన దారిద్ర్యపీడచేపుత్రికాపుత్రులముఖమండలము

లు హిమవారిసంస్పర్శచే ముకుళీకృతములగు తామరలవలె దినదినము వాడుచుండుటను జూచి సహింపఁజాలక యాగృహయజమానురాలు పూర్వమే యీలోకమును విడిచిపోయెను తల్లికి నేత్రానందకరుండును, జనకునివార్ధక్యమున కూతకోలయు వంశోద్ధారకుఁడు నగుపుత్రుఁడు తండ్రికన్నులయెదుటనే పరలోకమున కేగెను. ఎవ్వరును మిగిలియుండ లేదు. కేవలమావృద్ధజనకుఁడును లోకమనోమోహినియగు నాబాలి కయు నీయిరువురుమాత్ర మావిజనమైన యావనమధ్యముదంలి యా భగ్నాలయమున వాసము చేయుచుండిరి. తండ్రికికూఁతురును, కూఁతు నకుఁ దండ్రియు, పరస్పరసాహాయ్యమొనర్చుకొనుచుఁ గాలము గడపు చుండిరి. కుందనందినికి పెండ్లియీడు దాటినది. అయినను కుంద జనకుని యంధత్వమున కూతకోలవలెను, నాతనియిహసంసారబంధనమున కేక మాత్రగ్రంథిస్వరూపవలెనుండెను. ఆవృద్ధుఁ డట్టిబాలిక నెట్లుపరుల హస్తముల కర్పింపఁగలఁడు? ఆమెవివాహవిషయము మనమునకుఁ దోఁ చినపుడెల్ల నాతఁడు "మఱికొన్నిదినములు గడచిపోనిమ్ము. కుందనత్త వారింటి కంపి నేనెచ్చటనుందును? ఎట్లుజీవింపఁగలను?" అనియోచిం చుకొనుటయేకాని తనకవసానకాలము సమీపించునపుడు కుంద నెందు విడిచిపోవలయునో దానిని విచారించువాఁడుకాఁడు. ఆకస్మికముగా నిపుడు యమదూతలువిచ్చేసి యాతనిపార్శ్వమున నిలువఁబడియుం డిరి. ఆతఁ డిహలోకమును విడిచిపోవుచుండెను. కుందనందిని దేపెక్క డనుండవలయును ?

అనివార్యసంకటకర మగు నాగభీరమైనచింత, క్షణక్షమునకు వెడలుచుండెడు నిశ్వాసమూలమున వ్యక్తమగుచుండెను. ముదితో న్ముఖములగు నాతనినేత్రములనుండి యశ్రుధార లవిరళముగా ప్రవ హించుచుండెను. ఆతనిశిరోభాగమున ప్రస్తరనిర్మితమైనమూర్తివలె పదుమూడువత్సరములయీడుగల యాబాలిక స్థిరదృష్టితో మృత్యు

మేఘావృతమగు తనజనకునిముఖమును జూచుచుండెను. తన్ను దాను మఱచి రేపు తా నెచ్చటనుండవలయునో యనువిచారమే లేక గమనో న్ముఖుఁడగు తన తండ్రిముఖమునే చూచుచుండెను. క్రమక్రమముగా నావృద్ధునకు మాటలేకపోవుటగూడ తటస్థమగుచుండెను. శ్వాసము కంఠగతమయ్యెను. నేత్రవికాసము మాసిపోయెను. యమయాతన నొందుచున్న ప్రాణముల కాయాతనయు నిలిచిపోయెను. విజనమయిన యాగదియందస్తమితమగుచుండు నాదీపపువెలుగున కుంద యసహా యమై తండ్రిశవమును దనయూరువులపై నుంచుకొని కూర్చుండెను. ఆరాత్రి గాఢాంధకారమైయుండెను. ఆవల వానచినుకులు వృక్షపత్ర ములపైఁ బడుశబ్దమగుచుండెను. గాలియు నిలిచినిలిచి రివ్వురివ్వున వీచుచుండుటవలన పాడువడిన యాయింటితలుపులు కొట్టుకొనుశబ్దము వినఁబడుచుండెను. నిర్వాణోన్ముఖమై చంచలమై క్షీణించుచున్న యాగృహమునందలి దీపపుఁగాంతి క్షణక్షణ మాశవముఖముపైఁ బ్రసరించుచుఁ గ్రమక్రమముగా దాని నంధకారమున ముంచివేయు చుండెను. ఆదీపము తైలాభావమునొందియుండుటచే నాసమయమునకు సరిగా భగ్గునమండి రెండుమూఁడుతడవ లుజ్వలతరముగాలేచి యారి పోయెను.

పిమ్మట నగేంద్రుఁడు సడికాకుండ మెల్లగా గదిగుమ్మము నుండి వెడలిపోయెను.

---

## మూఁడవ ప్రకరణము

## "ఛాయాఅగ్రగామీ!"

ఆయర్ధరాత్రిసమయమున నాపాడుగృహమున కుందనందినియు నామెతండ్రిశవమును దక్క మఱెవ్వరును లేరు. కుంద "అప్పా"

యని పిలిచెను. ప్రత్యుత్తరము రాలేదు. ఆమె తనతండ్రి నిద్రాపర వశుఁడై యుండెనని యామె యనుకొనియెను. అంతలోనె మరల నాతఁడు మృతిఁజెందియుండెనేమోయని గూడ ననుకొనెను. కాని యామె యట్టికష్టపుమాటను తననోటితోఁ బలుకఁజాలదు. ఆయంధ కారమున నీవనను హస్తమునఁ బట్టుకొని స్వల్పకాలమునకుఁబూర్వము సజీవుఁడై శయనించియుండి ప్రకృతమున నిర్జీవుఁడై పడియున్న తనతం డ్రికి విసరుచుఁ గూర్చుండి, యాతఁడు నిద్రపోవుచున్నటులే భావించు కొనెను. ఆతఁడు మరణించినయెడల నామెగతి యేమికావలసినది? రాత్రింబవళులు జాగరణలుసలిపి శ్రమఁజెందినదగుటచే నాబాలికకుఁ గొంచెము నిద్రవచ్చెను. పగలును రాత్రియు నతిజాగరూకతతోఁ దన తండ్రికి సేవఁజేయుటలో నామె మిగుల నప్రమత్తయై మెలఁగెను. కాని కంటికిఁ గూర్కు వచ్చినంతనె చేతిలోఁదాళవృంతము చేతిలోనుం డఁగనే యాకటికినేలపై మేనుచేర్చి మృణాళము నపహసించెడు తన ముంజేతిపై శిరమునుంచుకొని పరుండెను.

అపు డాకుందనందిని యొక కలనుగనెను. ఆమెస్వప్నమున 'రాత్రి వెన్నెల జక్కగాఁ గాయుచున్నట్లును, ఆకాశము తేజోమయమై నీలవర్ణముతోఁ బ్రకాశించుచున్నట్లును, ప్రభామయమగు నానీలాకాశ మధ్యమున నిదివఱకెప్పుడుఁ జూడని యొక గొప్పచంద్రమండలమును జూచినట్లును, దానికాంతి యుజ్వలతరమై యొప్పుచున్నట్లును, రమణీ యమైన యాగురుతరచంద్రమండలమధ్యమునఁ జంద్రుఁడు లేనట్లును, చంద్రునికిమాఱుగ నామండలమునడుమ నపూర్వ జ్యోతిర్మయమైన యొక దేవీస్వరూపమును గాంచినట్లును, ఆదేవీస్వరూపముగలయాచం ద్రమండలము గగనమండలమును విడిచి క్రమముగా మెల్లమెల్లగాఁ గ్రిందికిదిగివచ్చుచున్నట్లును, అట్లువచ్చిసహస్రాధిక శీతలకిరణములతో బ్రకాశించుచుఁ దనశిరోభాగమున నిలిచినట్లును. ఆమండలమధ్య

మున ప్రకాశించుచున్నమూర్తి యొకసుందరీరూపమున నొప్పుచు జ్యోతిర్మయమైన కిరీటకుండలాదినానావిధాలంకారశోభితమై యున్నట్టును, ఆసుందరిముఖమండలము రమణీయమై, కారుణ్యరసాస్పదమై, స్నేహపరిపూర్ణమై లేనగవుచే నధరము విస్ఫారితమై యున్నట్టును, కరుణామయియగు నానారీరత్నము చిరకాలమునకుఁ బూర్వమె గతించిన తనమాతృస్వరూపమువలెనున్నట్టును, భయముతోడను, ఆనందముతోడను జూచి యామె తనతల్లియని గ్రహించినట్టును, జ్యోతిర్మయియగు నామె తన్ను స్నేహపురస్సరముగా నెత్తికొనియొడిలో గూర్చుండఁబెట్టికొన్నట్టును, మాతృహీనయగు తాను బహుకాలమునకు మరల "అమ్మా!" యని ప్రియమూర నోటితోఁ బిలిచి చరితార్థురాలైనట్టును, జ్యోతిర్మండలాంతర్గతమైయున్నయామె తన్ను ముద్దాడి "బిడ్డా! నీవపారమైనదుఃఖమునకు లోనైతివి. ఇంకను లోనుగా నుంటివి. నీవిప్పటికిని బాలికవు. నీశరీరమో కుసుమకోమలసదృశము. అట్టిసుకుమారశరీరముగలనీవు—అంతటిదుఃఖము ననుభవించుచు నీలోకమున నుండవలదు. ఈప్రపంచమును త్యజించి నా వెంటరమ్ము" అని పలుకగా విని తాను "ఎక్కడకురావలయును?" అని యడుగ నాతల్లి తేజోమయమై విరాజిల్లుచున్న నక్షత్రలోకమును దన వ్రేలితోఁ జూపి "అచ్చటికిఁబోవుదము" అని చెప్పినట్లును, అపుడు తాను, నిస్తరంగితానంతసముద్రోపరిభాగంబువలెఁ గడుదవ్వగఁ గానవచ్చిన యపరిచితంబగు నానక్షత్రలోకమును గని "నేనంతదూరము రాలేను. నాకు శక్తిచాలదు" అని చెప్పినట్టును, దయారసముచేఁ బ్రఫుల్లమై గంభీరమై యొప్పు నాయమ్మవదనమండలమునుండి యొక నిట్టూర్పు వెలువడినట్టు లామెభ్రూభంగమువలన దెలియవచ్చినట్టును, పిమ్మట నాయమ్మ "బిడ్డా! నీయిచ్చవచ్చినరీతిని జేయుము. కాని, నాతోడ వచ్చినయెడలఁ జాలమంచిది. పిమ్మట

నాతో రాలేదని పరితాపపడుదువు. తుదకు నీయంతటనీవే యానక్షత్రలోకమునకుఁ బోవలయునని యాశపడుదువు. నేను మరియొకసారి నిన్ను జూడఁగలను. నీవపుడనంతమైన దుఃఖముచేఁ బీడింపఁబడుచు ధూళిధూసరితవై నన్ను జ్ఞప్తికిఁ దెచ్చుకొని నావెంట వచ్చుటకు పరిపరివిధముల రోదనముఁ జేసెదవు! నేనిపుడు జూపినదెస నాకాశమును గనుఁగొనుము. అందుఁ గనఁబడుచున్న యాయిరువురు నీశుభాశుభములకుఁ గారకులగుదురు. నీవు వారిని విషధరసర్పములవలెఁ ద్యజింపవలయును. వారివెనువెంటఁ జనరాదు'' అని యేమేమో చెప్పుచుఁ దనవ్రేలితో నిర్దేశించుచు గగనభాగమును జూపించినట్టును, తానామెచూపినదెసకుఁ జూడంగా నాగగనభాగమున రూపవిజితదివ్యమూర్తియగు నొకపురుషాకారము కనఁబడినట్టును, ఆపురుషమూర్తి ఫాలభాగ మున్నతమై ప్రశస్తంబై ప్రశాంతభావమును వెదజల్లుచుట్టును, ఆతనికటాక్షము లతిసరళములై కరుణారసమును జిమ్ముచున్నట్టును, కంఠదేశము మరాళమువలె దీర్ఘమై కొంచెమువంగి యున్నట్టును, ఆతని యితరమహాపురుషలక్షణములను జూచినచో నాపురుషుని వలన ననిష్టము గలుగునని యెవ్వరునూహింపరానివై యున్నట్టును, స్వల్పకాలములో నామూర్తియు జలబుద్బుదమువలె నాగగనపటమున విలీనమై పోయినట్టును, తనతల్లి తనతో ''దేవసదృశుఁడగునాతని శాంతిస్వరూపమునుగని మైమఱవవలదనియు, నాతఁడు మహాశయునివలెఁ గనఁబడినను, నీయమంగళముల కతఁడు మూలకారణంబగుటచే నాతని విషధరసర్పమువలెఁ జూచి యాతనికి దూరముగాఁ దొలఁగిపోవలయుననియుఁ జెప్పినట్టును, మరల నాయమ్మ గగనమున మఱియొక దెస తనకుఁ జూపింప నావైపునకుఁ దాను చూచినంతనె యానీలాకాశమందు మఱియొకమూర్తి యతిచిత్రముగాఁ గనఁబడినట్టును, అది యుజ్వలశ్యామాంగియు, పద్మపలాశలోచ

నయు నగు నొక యువతీస్వరూపమైనట్లును, అపుడు తనతల్లి "ఆ శ్యామాంగి నారీవేషము ధరించిన యొకరాక్షసి ఆమెను జూచి దూరముగాఁ బారిపోవలయు" నని చెప్పినట్లును, అట్లు చెప్పుచుండ గనే యాకాశ మంధకారమైపోయినట్లును, గొప్పదయిన యా చంద్రమండల మంతర్హితమైనట్లును దానితోఁగూడ దానినడుమ నున్న తేజోమూర్తియు మాయమైపోయినట్లును చూచెను. పిమ్మట నిద్రాభంగమయ్యెను.

---

## నాల్గవ ప్రకరణము

### అతఁడే యితఁడు

నగేంద్రుఁడు గ్రామమునఁ బ్రవేశించి తగు సాహాయ్యమునకై ప్రయత్నించెను. ఆగ్రామముపేరు ఝుమఝుమపురము. నగేంద్రుఁడు తాను చూచిన యావద్వృత్తాంతమును జెప్పి వారికిఁ గావలసిన ధనము నిచ్చినపిదప గ్రామస్థులగు కొందఱువచ్చి యా మృతునకు దహనసంస్కారము లొనర్చుట కుపక్రమించిరి. ఇరుగుపొరుగు నామె యగు నొక స్త్రీ కుందనందినికి సహాయముగా నుండుటకు వచ్చి యుండెను. కుందనందిని తనతండ్రిని సంస్కారమునకుఁ దీసికొని పోయినపిమ్మట నతఁడు నిజముగా మృతినొందెనని తెలిసికొని గోలు గోలున నేడువసాగెను.

ప్రభాతమైన వెనుక నిరుగుపొరుగామె తన గృహకృత్యము లను నెఱవేర్చుకొనుటకై వెడలిపోయి, కుందనందినికి దోడుగా నుండుటకై తన పుత్రికయగు చంపకను బంపించెను. ఆచంపక కుందనందినికి సమవయస్కయు, సంగాతియునై యుండెను. చంపకయు,

కుందకడకువచ్చి యామెకు లోక సాదృశ్యము లనేకములను జెప్పుచు దుఃఖోపశమనముఁ జేయఁదొడఁగెను. కాని యామె దేనివలనను శాంతిని జెందక రోదనముఁ జేయుచుఁ బ్రత్యాశాపన్నవలె మాటి మాటికిఁ దల పైకెత్తి యాకాశమువంకఁ జూచుచుండెను. చంపక కౌతూహలముతో 'నిమిషమున కొకసారి యాకాశమువంకఁ జూచు చుంటి వెందులకు?' అని యడిగెను.

కుంద—నిన్న రాత్రి గగనమునుండి మాయమ్మ దిగివచ్చి నన్ను తనవెంట రమ్మని పిలిచెను. నేను బుద్ధిమాంద్యముచే భయపడి యామెతోఁ బోలేదు. అందులకై యిప్పుడు విచారించుచుంటిని. ఆమె యిపుడు మరల వచ్చినచో నామెతోఁ బోవలెనని యుంటిని. దానికొఱ కాకాశమును జూచుచుంటిని.

చంపక—చచ్చిపోయినవారు మరల వత్తురా?

అపుడు కుంద తాను కలలోఁ గనినదంతయు నామెకుఁ జెప్పివేసెను. అదివిని చంపక విస్మయముఁజెంది 'యాకాశ పటమునం జూచిన పురుషుని, సుందరిని నీవెఱుఁగుదువా?' యని యడిగెను.

కుంద—నేనెఱుఁగను. వారిని నేనెన్నఁడిదివఱకుఁ జూచినదానను గాను. అంతటి సుందరపురుషుఁ డెందును నుండఁబోఁడు. అంతటి సురూపశాలిని నేనెచ్చటను గనుఁగొనియుండలేదు.

ఇట్లుండ నగేంద్రుఁడు ప్రభాతమైనవెనుక నా జానపదుల రావించి 'మృతిచెందిన నాతనికొమరితగతి యేమికావలసినది? ఆమె యెక్కడనుండును? ఆమె కెవరున్నారు?' అని యడుగ వారామె కెవ్వరును లేరని చెప్పిరి.

నగేం—మీరెవరయిన నా బాలికను గృహమునందుంచికొని యొక వరునకిచ్చి వివాహమును గావింపుఁడు. అందునకయ్యెడు వ్యయమును నేనే యిచ్చెదను. వివాహమగువఱకు నామె మీయింటి

యొద్ద నున్నదివసములకు మాసమున కెంత వెచ్చమగునో యదియుఁ గూడ నే నిచ్చెదను.

నగేంద్రుఁడు ముందుగనే రొక్కముగా ధనమిచ్చినయెడలననే కులాతనిమాటకు సమ్మతించుటయేగాక, ధనమును బుచ్చుకొని నగేంద్రుఁ డావలకుఁ బోయినపిదపఁ గుందను గృహామునుండి వెడలగొట్టుటయో, లేక యామెచేఁ గూలిపనులఁ జేయించుటయో, జరిగించియుండురు. కాని నగేంద్రుఁ డట్టియవివేక కార్యమును జేయలేదు. అఁతడు ముందుగా రొక్కమీయనందున నాతనియేర్పాటున కెవ్వరును సమ్మతింపలేదు. ఆతనిపలుకు లెవ్వరును విశ్వసింపనులేదు.

నగేంద్రుఁ డేమిఁ జేయుటకును దోఁచక విచారించుచు నుండ నంతలో గ్రామస్థులలో నొకఁడు "శ్యామాబజారునం దాచిన్నదాని మేనత్తగారిగృహముకలదు. వినోదఘోషుఁ డామెమేనత్తపెనిమిటి. మీరు కలకత్తానగరమునకుఁ బోవనుంటిరి. మీతోఁగూడ నామెను దీసికొనిపోయి వారికొప్పగించినయెడల నాకాయస్థబాలికకు దిక్కుఁ జూపినవారగుటయేగాక మీరు మీస్వజాతీయసుందరి కొకతె కుపకారమొనర్చినవారుగూడ నగుదురు." అని చెప్పెను.

అంతకంటె నుపాయాంతరము కనఁబడనందున నగేంద్రుఁ డట్లే చేసెదనని చెప్పి కుందనందిని కానూట నెఱింగించుటకై యామెను బిలిపించెను. చంపకయు నామెను దీసికొనివచ్చెను.

అట్లు వచ్చుచు దూరమునుండి నగేంద్రునిజూచి కుంద నివ్వెఱగంది నిశ్చేష్టురాలై నిలువఁబడెను. ముందున కొకయడుగైన వేయలేక యత్యాశ్చర్యముతో విస్ఫారితనయనయై నగేంద్రుని పిచ్చిదానివలెఁ జూచుచు నిలువఁబడెను.

చంపక—అదేమే నిలువఁబడిపోయితివి ?

కుంద—(వ్రేలితోఁ జూపుచు) అతఁడే యితఁడు." అనియెను.

చంప—ఆతఁడనగా నెవరు

కుంద—మాయమ్మ నిన్నరాత్రి యాకాశపటమున నెవరిని జూపెనో యతఁడే యితఁడు.

చంపకయు నాశ్చర్యముతో

చెను. ఆబాలిక లిద్దఱును ముందునకుఁ బోవుటకుఁ సందేహించుచుండఁ జూచి నగేంద్రుఁడు స్వయముగా వారిచెంతకుఁబోయి కుందనందిని కావృత్తాంతమంతయు నెఱింగించెను. కుంద యేమియుఁ బలుకఁజాలక విస్మయోత్ఫుల్లలోచనయై నగేంద్రునిపై దృష్టినిలిపి చూచుచునిలువఁ బడియుండెను.

---

## అయిదవ ప్రకరణము.

నగేంద్రనాథుఁడుఁ డుపాయాంతర మేమియు దోఁచనందునఁగుంద ను దనవెంటఁ గలకత్తానగరమునకుఁ దీసికొనిపోయి మొదట నామె మేనత్తభర్తగారి గృహమును దెలిసికొనఁ బ్రయత్నించెను. శ్యామ బజారులో వినోదఘోషనునాతఁ డెవడును లేఁడు. వినోదదాసుఁడను నాతఁ డొకఁడుమాత్రము కలఁడు. కుంద తనకాతఁడు బంధువుకాఁడని చెప్పెను. ఆకారణమునఁ గుందనందిని భారమంతయు నగేంద్రునిపైఁ బడెను.

నగేంద్రునకుఁ గమలయను నొకసోదరియుండెను. ఆమెనగేంద్రునికంటెఁ జిన్నది. ఆమెతనయత్తింట కలకత్తానగరములోనే యుండెను. శ్రీశచంద్రమిత్రుఁడామెభర్త. శ్రీశుడు ప్లండరు ఫేర్లీకంపెనీవారి శేఖరిగా నుండెను. అది మిగుల గొప్పవర్తకసంఘము—శ్రీబాబు చాల ధనవంతుఁడై యుండెను. నగేంద్రునకు నాతనికిని మిగుల నన్యో

న్యము కలదు. నగేంద్రుఁడు కుందనచ్చుటకుఁ దోడ్కొనిపోయి కమల నుబిలిచి కుందవృత్తాంతము నామెకుఁ దెలిపెను.

కమలమణికిఁ బదునెనిమిదవవత్సరము. ఆమె కనుబొమలుగ్గా మొగము, నగేంద్రునిపోలియే యుండెను. సోదరసోదరీమణులిరువురును బరమసుందరులు. కమలమణి సౌందర్యమునకుఁ దోడు విద్యావతియని కూడఁ బ్రసిద్ధి నొందియుండెను. నగేంద్రుని తండ్రి, మిస్ టెంపిల్ అను నైరోపియస్త్రీని వేతనమున కేర్పఱచి కమలమణికిని, సూర్య ముఖికిని జక్కగా వ్రాయుటకును జదువుటకును విద్య నేర్పించెను. కమలమణి యత్తగారు శ్రీశచంద్రుని స్వగ్రామముననున్న స్వంతగృహ మునఁ దక్కినకుటుంబముతో వాసముచేయుచుండెను. కలకత్తాలోఁ గమలమణియే గృహయజమానురాలయి యుండెను.

నగేంద్రుఁడు కుందసంగతిచెప్పి కమలమణితో "నీవిప్పు డీమెకు శరణ్యము చూపనిచో నీమె నిరాధారురాలై పోవలసివచ్చును. నేనిం టికిఁ బోవునపు డీమెను గోవిందపురమునకుఁ దోడ్కొనిపోవుదును." అని చెప్పెను.

"కమలా! నీవు చాలఁ బెద్దదానవు." అని చెప్పి నగేంద్రుఁడు వెడలిపోయెను పిమ్మట కమల కుందను దీసికొనిపోయి స్నానములగది యందున్న వెచ్చనిజలముతో నిండింపఁబడిన యొకతొట్టిలోఁ బడవేసె ను. కుంద భయపడెను. కమల నవ్వుచు సొగసైనపరిమళముగల సబ్బు నామెశరీరమునకుఁ బూసి రుద్దుచుండెను. పరిచారిక యొకతె యజ మానురాలె స్వయముగా నాకార్యమును జేయుచుండుటఁ జూచితాను చేసెదనని చెప్పి యచ్చటికిఁ బరుగెత్తికొనిపోయెను. కమల వేడినీటిని దెచ్చి దానిశరీరముపై బోసెను. పరిచారిక పాఱిపోయెను.

కమల స్వయముగాఁ గుందను జలకమాడించెను. కుందయు హిమవారిపూరములందోగిన తామరవలెఁ బ్రకాశించుచుండెను. పిదపఁ

గమలయామెకునిర్మలదుకూలంబునుగట్టనిచ్చి సుగంధతైలమునుబూసి కురులనుబరిష్కరించి యందంపు వలయునాభరణములచే నలంకరించి "పోయి యన్నగారికి నమస్కారముచేయుము" అనిచెప్పకయే" ఈగృహయజమానులకు నమస్కృతిసలుపుము. వారు చూచినచోఁ బెండ్లిచేసికొనెదరు." అని చెప్పిపంపెను.

నగేంద్రనాథుఁడు కుందనందినిసమాచారమును సూర్యముఖికిఁ జాబువ్రాసి యంపెను. అతనిప్రియస్నేహితుఁడగు హరదేవఘోషా లను నాతఁడు దూరదేశమున వాసముచేయుచుండెను. నగేంద్రుఁ డాతనికి లేఖను వ్రాయుచుఁ గుందనందిని వృత్తాంతమునుగూర్చి యం దిట్లు పొందు పఱచెను.

"స్త్రీ యేవయసునందు సుందరమైయుండునో చెప్పగలవా? నలువదివత్సరములుదాటినపిదప స్త్రీసౌందర్యముచే నొప్పియుండునని చెప్పెదవుకాదా? ఏమందువేసి—నీభార్య యంతకంటె నొకటిరెండు వర్షములు మీఱినవయసుగలదై యుండెను. నేను చెప్పినకుందకుపదు మూఁడువత్సరములవయసు ఆమెను జూచినచో నదేసౌందర్యమునకుఁ దగినసమయమని నీకుఁబోధపడఁగలను. ప్రథమయౌవనసంచారమున కన్యవహితముగాక పూర్వమే మాధుర్యముకు నెట్టిసరళస్వభావ ముండునో యది యనంతర ముండ నేరదు. కుందసరళత యతిచమత్కా రమైనది. ఆమె కేమియుఁ దెలియదు. వీథిలో దిరిగెడు పసిపిల్లలను జూచినచో వారితో నాడుకొనుటకై పోవజూచును. వలదని వారించి నచో భయముతో వెనుకకు మరలివచ్చును. కమలమణి, యామెకుఁ జదువుటయు వ్రాయుటయు నేర్పనక్కరలేకయే చదువుటయుం దామె కధికాసక్తి యుండెనని చెప్పుచున్నది. ఆమెకింకను నేమియుఁ దెలియదు. నేత్రములో నీలవర్ణములు నాకర్ణాంతములునై యుండెను— కన్నులురెండు ననవరతము శరత్సమయాంచిత నిర్మలవారిపూరముల

దేలియాడెడు కమలములవలె నుండును. అట్టి నయనారవిందములతో నామె నాపై దృష్టిసారించి చూచుచుండును. అయినను వానయం దెట్టి దురభిసంధిగలదో తెలియదుకాని నేనా వికసితనయనారవింద ములను జూచి యన్యమనస్కుఁడనై వివశుఁడ నగుచుందును. ఏమి చెప్పుదును ? చెప్పుటకు వలనుపడదు. ఈరీతిగా నున్న నామతిస్థైర్య మును గ్రహియించి నీవు నన్ను పరిహసించెదవుకాఁబోలు. కాని నిన్నా నేత్రనుల సన్నిధి నొకసారి నిలిపినచో నీ మనోదార్ఢ్యమప్పు డెట్లుండునో తెలియఁగలదు. అత్యంత మనోహరములైన యానేత్ర ములకుపమానార్హమగు పదార్థము లెవ్వియో యవి యింతవఱకు నాకు గోచరింపలేదు. అవి రెండునిమిషములైన నేకవిధముగా నాకుఁ గనఁబడుటలేదు. నిమిషనిమిషమున కధికప్రభామయములై కనఁబడు చుండెను. నాబుద్ధికవి యీాపుడమిపయింగల పదార్థముల నాసక్తితోఁ జూచుటలేదని తోఁచుచుండెను. అంతరిక్షముననున్న వానినే చూచు చున్నట్లు కనఁబడుచుండెను. కుంద యట్టి నిర్దోషమైన సౌందర్యము గలదని చెప్పవలనుపడదు. ఆమె ముఖావయవముల ననేక రమణీ మణుల యవయవములతోఁ బోల్చి చూచినయెడల నంతప్రాశస్త్య ముగా లేకపోయినను నంతటి సురూపవతిని మఱియెందును జూడఁ బోమని నాబుద్ధికి బోధయగుచుండెను. ఆమె శరీరము పృథ్వ్యంశ మైన రక్తమాంసములచే నిర్మింపఁబడినదిగాఁ గనఁబడుటలేదు. అది కేవలము శరచ్చంద్రకిరణములతోను నవవికసిత కుసుమసౌరభముల తోను నిర్మింపఁబడియుండవలెనని తోఁచుచుండెను. ఆమె కీడగు వస్తువును జెప్పవలెనన్నచో నింత యాకస్మికముగాఁ జెప్పుటకు సాధ్యముగాదు. ఆమె సర్వావయవములందును శాంతరసము తొలు కాడుచుండెను. నీవెన్నఁడైనను స్వచ్ఛందమైన సరోవరముపై శర చ్చంద్రకిరణప్రసారము ప్రసరించినపుడు గలిగెడు భావమును హృద

యగతము చేసికొని చూచినయెడల నీవపు డామె సాదృశ్యమును గొంతవఱ కనుభవమునకుఁ దెచ్చుకొనఁగలుగుదువు. ఆమె సాదృశ్యమునకు మఱేనే పదార్థమును యోగ్యమైనట్లు నామనమునకుఁ దోచుటలేదు.' అని యేమేనో వ్రాసెను.

నగేంద్రుఁడు సూర్యముఖికి కుందనందినిం గూర్చి వ్రాసిన జాబునకు మఱికొన్ని దినములు గడచినపిమ్మట సూర్యముఖి వ్రాసిన ప్రత్యుత్తరము వచ్చెను.

ఆమె ప్రత్యుత్తరము:—

'సేవకురాలైన నేను శ్రీవారి చరణరాజీవములయెడ నెట్టి యపరాధ మొనర్చితినో దానిని దెలిసికొన నిరీక్షించుచుంటిని. మీరు కలకత్తానగరమున నింతకాల ముండవలసియున్నపుడు నేను మీ సన్నిధిని మీపాదసేవ సలుపుచు నుండరాదాయేమి? అందులకై మిగుల వినయపూర్వకముగా వేడుకొనుచున్నదానను. ఆజ్ఞయైనచో శీఘ్రముగా బయలుదేరివచ్చెదను.

ఒక చిన్నది దొరకినంతమాత్రమున దాసురాలైన నన్ను మఱచిపోవలయునా? అనేకములగు నపక్వములైన పచ్చికాయలపై నెక్కుడుగ మక్కువయుండుట యందఱికిని స్వభావము. నారికేళము లోని జలము శీతలమైనదియే యగును. ప్రకృతమందు మీచేఁ జిక్కిన యధమస్త్రీ యపక్వమైన యువతియని తోఁచుచున్నది. ఒక బాలిక దొరకినంతమాత్రమున నాయందు దుదాసీనభావము వహింపవలెనా? వినోదముమాట యటుండనిండు. మీరు బాలికపైఁ గల స్వాతంత్ర్యమును బూర్తిగా విడిచిపెట్టుకొంటిరా? అట్లుగానిచో నామెను నాకొప్పగించుటకు ప్రార్థించుచున్నదానను. ఆమె మంచిచెడ్డలను విచారించుటకు నాకె స్వాతంత్ర్యముండఁదగినది. అట్లుగాకుండ ప్రస్తుతమున సమస్తస్వత్వాధికారములును మీసోదరికిచ్చినట్లు గనఁబడుచున్నది.

దేలియాడెడు కమలములవలె నుండును. అట్టి నయనారవిందములతో నామె నాపై దృష్టిసారించి చూచుచుండును. అయినను వానయం దెట్టి దురభిసంధిగలదో తెలియదుకాని నేనా వికసితనయనారవింద ములను జూచి యన్యమనస్కుఁడనై వివశుఁడ నగుచుందును. ఏమి చెప్పుదును ? చెప్పుటకు వలనుపడదు. ఈరీతిగా నున్న నామతిస్థైర్య మును గ్రహియించి నీవు నన్ను పరిహసించెదవు కాఁబోలు. కాని నిన్నా నేత్రముల సన్నిధి నొకసారి నిలిపినచో నీ మనోదార్ఢ్యమప్పు డెట్లుండునో తెలియఁగలదు. అత్యంత మనోహరములైన యానేత్ర ములకుపమానార్హమగు పదార్థము లెవ్వియో యవి యింతవఱకు నాకు గోచరింపలేదు. అవి రెండునిమిషములైన నేకవిధముగా నాకుఁ గనఁబడుటలేదు. నిమిషనిమిషమున కధికప్రభామయములై కనఁబడు చుండెను. నాబుద్ధికవి యీపుడమిపయిం గల పదార్థముల నాసక్తితోఁ జూచుటలేదని తోఁచుచుండెను. అంతరిక్షముననున్న వానినే చూచు చున్నట్లు కనఁబడుచుండెను. కుంద యట్టి నిర్దోషమైన సౌందర్యము గలదని చెప్పవలనుపడదు. ఆమె ముఖావయవముల ననేక రమణీ మణుల యవయవములతోఁ బోల్చి చూచినయెడల నంతప్రాశస్త్య ముగా లేకపోయినను నంతటి సురూపవతిని మఱియెందును జూడఁ బోమని నాబుద్ధికి బోధయగుచుండెను. ఆమె శరీరము పృథక్త్వాంశ మైన రక్తమాంసములచే నిర్మింపఁబడినదిగాఁ గనఁబడుటలేదు. అది కేవలము శరచ్చంద్రకిరణములతోను నవవికసిత కుసుమసౌరభముల తోను నిర్మింపఁబడియుండవలెనని తోఁచుచుండెను. ఆమె కీడగు వస్తువును జెప్పవలెనన్నచో నింత యాకస్మికముగాఁ జెప్పుటకు సాధ్యముగాదు. ఆమె సర్వావయవములందును శాంతరసము తొలు కాడుచుండెను. నీవెన్నఁడైనను స్వచ్ఛందమైన సరోవరముపై శర చ్చంద్రకిరణప్రసారము ప్రసరించినపుడు గలిగెడు భావమును హృద

యగతము చేసికొని చూచినయెడల నీవపు డామె సాదృశ్యమును గొంతవఱ కనుభవమునకుఁ దెచ్చుకొనఁగలుగుదువు. ఆమె సాదృశ్యమునకు మఱేపదార్థమును యోగ్యమైనట్లు నామనమునకుఁ దోచుటలేదు.' అని యేమేమో వ్రాసెను.

నగేంద్రుఁడు సూర్యముఖికి కుందనందినిం గూర్చి వ్రాసిన జాబునకు మఱికొన్ని దినములు గడచినపిమ్మట సూర్యముఖి వ్రాసిన ప్రత్యుత్తరము వచ్చెను.

ఆమె ప్రత్యుత్తరము:—

'సేవకురాలైన నేను శ్రీవారి చరణరాజీవములయెడ నెట్టి యపరాధ మొనర్చితినో దానిని దెలిసికొన నిరీక్షించుచుంటిని. మీరు కలకత్తానగరమున నింతకాల ముండవలసియున్నపుడు నేను మీ సన్నిధిని మీపాదసేవ సలుపుచు నుండరాదాయేమి? అందులకై మిగుల వినయపూర్వకముగా వేడుకొనుచున్నదానను. ఆజ్ఞయైనచో శీఘ్రముగా బయలుదేరివచ్చెదను.

ఒక చిన్నది దొరకినంతమాత్రమున దాసురాలైన నన్ను మఱచిపోవలయునా? అనేకములగు నపక్వములైన పచ్చికాయలపై నెక్కుడుగ మక్కువయుండుట యందఱికిని స్వభావము. నారికేళము లోని జలము శీతలమైనదియే యగును. ప్రకృతమందు మీచేఁ జిక్కిన యధమస్త్రీ యపక్వమైన యువతియని తోఁచుచున్నది. ఒక బాలిక దొరకినంతమాత్రమున నాయందు దుదాసీనభావము వహింపవలెనా? వినోదముమాట యటుండనిండు. మీరు బాలికపైఁ గల స్వాతంత్ర్యమును బూర్తిగా విడిచిపెట్టుకొంటిరా? అట్లుగానిచో నామెను నాకొప్పగించుటకు ప్రార్థించుచున్నదానను. ఆమె మంచిచెడ్డలను విచారించుటకు నాకె స్వాతంత్ర్యముండఁదగినది. అట్లుగాకుండ ప్రస్తుతమున సమస్తస్వత్వాధికారములును మీసోదరికిచ్చినట్లు గనఁబడుచున్నది.

అయినను చింతింపను. కమలమణి నాయధికారము నపహరించుకొని పోయెనని నేనసూయపడను.

ఆబాలికవలనఁ బ్రయోజనమేమనినన్ను మీరడుగవచ్చును. నేనాబాలికను తారాచరణునకిచ్చి పెండ్లిచేసెదను. తారాచరణుని కొఱకొకకన్యను వెదకుచుంటినని మీకువేద్యమైయే యుండవచ్చును. ఈశ్వరకటాక్షమువలన నాబాలికసుందరియైనయెడల నాకాశాభంగముచేయకూడదు. కమలమణి యామెనువిడిచిపెట్టనియెడల, మీరిచ్చటకుదయచేయునపు డామెను మీతోఁదీసికొనిరావలయును. కమలమణిపేర జాబువ్రాసెదను. వివాహమునకై వలయునాభరణములను నితరపదార్థములను సిద్ధముచేయుచుంటిని. మీరు కలకత్తాలో బహుకాలముండవలదు. కలకత్తాయందాఱుమాసము లున్నచో జనుల మతులు చెడునఁట. అదినిజమేనా? కుందనందనిని మీరే వివాహము చేసికొనవలెనని తలంపున్నయెడల నదియును సెలవీయవలయును. దానికిని సిద్ధపడియుండెదను.''

తారాచరణునిగూర్చి తరువాతఁ దెలిపెదము. అతఁ డెవ్వరైననేమి? సూర్యముఖి యిట్లుప్రస్తావించినపిమ్మట నగేంద్రుఁడును, కమలయు, నందఱునకియ్యకొనిరి. ఆకారణమున నగేంద్రుఁడు తనస్వగ్రామమునకుఁ బోవునప్పుడు కుందను దనతోఁగూడఁ దీసికొనిపోవలసియుండెను. అందఱును సంతోషితహృదయులైరి. కమలమణి కుందనందినికిఁ గొన్నియలంకారములను జేయించెను. కాని మనుజుఁ డెట్లు చిరాంధుఁడగునో యది మనము చెప్పఁజాలము. కొన్నివత్సరములు గడచినపిమ్మట కమలమణియు నగేంద్రుఁడును భూమిపైఁబడిపొరలాడుచుఁ దలనుబట్టుకొని 'ఎంతటిపాపిష్ఠికాలమున కుంద మనకుఁ జిక్కెనోయనియు, నెట్టిపాపపుసమయమున సూర్యముఖవ్రాసిన రేఖనాంశములకు మనము సమ్మతించితిమో' యనియు చెప్పుకొనుకలహకాలము సంప్రాప్తమగును. దానిని వారెట్లు తెలిసికొనఁగలరు?

ప్రకృతమునఁ గమలమణియు, నగేంద్రుఁడును సూర్యముఖియు జేరి విషబీజమును నాటిరి. తుదకీ ముగ్గురును హాహాకారమును జేయుదురు.

నగేంద్రుఁ డర్ధదోసను జేసికొని కుందను దీసికొని గోవింద పురాభిముఖుఁడై బయలుదేఱెను.

కుందయుఁ దనస్వప్నమును బూర్తిగా మఱచిపోయెను. నగేంద్రునితోఁగలిసి ప్రయాణమును జేయునపు డాస్వప్నవృత్తాంతము స్మరణకువచ్చినను నగేంద్రునికారుణ్యాపూర్ణమైన ముఖవిలాసమును, జనవాత్సల్యగుణాస్పదమైన నడతయును, జూచి తనకాతనివలన ననిష్టముసంప్రాప్తమగునని యామె విశ్వసింపలేదు.

ఇట్లే, పురుగు ప్రజ్వలించుచున్న దీపపువిలాసమును జూచి భ్రమగొని దానిపైబడి భస్మీపటలమగును.

---

## ఆఱవ ప్రకరణము

### తారాచరణుఁడు

కవిసార్వభౌముఁడగు కాళిదాసున కొకమాలిని నిత్యమును పుష్పములను దెచ్చియిచ్చుచుండెను. కాళిదాసు దరిద్రబ్రాహ్మణుఁడు. అందువలన నాతఁడు పుష్పములకు వెలనిచ్చుటకు బదులుగ దాను చేసినకావ్యముల నామాలినికిఁ జదివి వినిపించుచుండెను. ఒక నాఁడు మాలిని పుష్కరిణినుండి వికసనోన్ముఖమై యపూర్వమై యలరారు నొక పద్మమును దెచ్చి యాకవిశిఖామణి కిచ్చెను. కాళిదాసందులకై తాను రచించిన మేఘసందేశము నామెకుఁ జదివి వినిపింప...డఁగెను. మేఘసందేశము రసములకు సాగరస్వరూపమైనదని

యనేకపండితులచేఁ బేర్కొనబడినకావ్యము. అట్టికావ్య మామాలినికి రసవంతముగాఁ గనఁ బడనందున నది దానిని విననొల్లక లేచి పోవుచుండెను. అప్పుడు కవి "ఓమాలినీ! ఇదేమే? లేచిపోవుచుంటివి?" యని యడిగెను.

మాలిని—నీకవిత్వమునందు రసమేమియులేదు.

కవి—మాలినీ! నీవెన్నడైన స్వర్గమునకుఁ బోఁగలవా?

మాలిని—ఎందువలన?

కవి—స్వర్గమునకు మెట్లుగలవు. లక్షయోజనములవఱకు వ్యాపించియున్న యామెట్లనెక్కి స్వర్గమునకుఁ బోవలసియుండెను. నా మేఘదూత స్వర్గమునకును మెట్లుగలవు. నీవుచెప్పిన యానీరసపుఁ గవిత్వమె దానికిమెట్లు. సామాన్యమైన యీమెట్లనే యెక్క జాలని దానవు లక్షయోజనముగల యామెట్ల నెట్లెక్కఁగలవు?

మాలినియు బ్రాహ్మణశాపమువలన స్వర్గలాభప్రాప్తితప్పిపోవుననుభీతిచే నాతని మేఘదూత నాద్యంతమును విని యానందించి మఱుసటిదినమున "మదనమోహిని" యను పుష్పమాలికను గట్టి తెచ్చి యాకవికంఠము నలంకరించెను.

మా యీసామాన్యమైనకావ్యము స్వర్గమునుగాదు. దీనికి లక్షయోజనములమెట్లునులేవు. రసమోయత్యల్పమైనది. సోపానములును చిన్నవి. నీరసమైన కొలఁది ప్రకరణములె దీనిసోపానపంక్తులు మాపాఠకమహాశయులలోనెవరైనను మాలినివంటివా రున్నయెడల వారాసోపానపంక్తుల నధిరోహింపనిచో రసాంతర్భాగమునఁ బ్రవేశింపలేకపోవుదురని వారికి హెచ్చరికను గలిగించుటకై యిచ్చట నీవిజ్ఞాపనయుఁ జేసికొంటిమి.

సూర్యముఖి పుట్టినింటివారిగ్రామము కోన్నగరము. ఆమెతండ్రియుఁ బేరుప్రసిద్ధిగల యొకగొప్పయింటికాయస్థుఁడేగాక కలకత్తా

లో నొక గొప్ప వర్తకసంఘమున నగదీగుమాస్తా (Cashear) యుద్యోగమునుగూడఁ జేసెను. అతనికిసూర్యముఖి యొక్కతెయే తప్పమఱి బిడ్డలు లేరు. సూర్యముఖి బాల్యమున శ్రీమతియను కాయస్థజాతీయురాలైన నొకవితంతువు వారియింట దాసిగా నుండి యాబాలికకు శుశ్రూష చేయుచుండెను. శ్రీమతి కొకకుమారుఁడుండెను. అతని పేరు తారాచరణుఁడు. అతఁడు సూర్యముఖికి సమవయస్కుఁడై యుండెను. సూర్యముఖి బాల్యమునుండియు నాబాలునితో నాడుకొనుటయేగాక బాల్య స్నేహముచే నాతనిని దనసోదరునిగా భావించుకొనియుండెను.

శ్రీమతి విశేషరూపవతి. అందువలన నామె కొలఁదికాలములోనే విపదంబుధిలో బడిపోయెను. ఆగ్రామస్థుడును, దుర్నీతిపారంగతుఁడును నగునొకధనమదాంధునిచే నాకర్షింపబడి యామె సూర్యముఖి జనకగృహమును విడిచిపోయెను. ఎక్కడకుఁబోయెనో యెవరికిని దెలియదు. ఆమె మరల రాలేదు.

శ్రీమతి తనకడుపునఁగన్న ప్రేమాస్పదుఁడగు తారాచరణుని యందలి ప్రేమానుబంధమును నొకత్రుటిలోఁ ద్రెంచుకొని యెక్కడకో లేచిపోయెను. ఆహా! మోహమెంతటిది ! తారాచరణుడు సూర్యముఖి జనకగృహముననె పెంపబడుచుండెను. సూర్యముఖి జనకుఁడు నతిదయాళుఁడు. అతఁడాయనాథబాలకుని తనగర్భవాసమువలెనె చూచికొనుచు దాసత్వము మొదలుగాఁగల హీనవృత్తులఁజేయింపక యాతనికి విద్యాభ్యాసము గావించుచుండెను. తారాచరణుఁడు క్రైస్తవసంఘముచే స్థాపింపబడిన పాఠశాలలో జీతమీయునక్కఱలేకయే యాంగ్లేయభాషను నేర్చుకొనుచుండెను.

పిమ్మట సూర్యముఖికి వివాహమయ్యెను. ఆమె వివాహమైన పిదపఁ గొన్నిసంవత్సరముల కామెతండ్రి పరలోకమున కేగెను. అప్ప

టికిఁ దారాచరణుఁడు కొంచెముగా నింగ్లీషును నేర్చికొనియుండెను. కాన యుద్యోగముచేయఁదగిన సామర్థ్యమాతనికింకను కలుగలేదు. సూర్యముఖితండ్రి చనిపోయినవెనుక నాతఁడు నిరాశ్రయుఁడై సూర్యముఖితోఁగూడ నామెయత్తవారింటికిఁ బోయెను. సూర్యముఖిభర్తయగు నగేంద్రునితోఁ జెప్పి యాగ్రామములో నొకపాఠశాల బెట్టించెను. తా దారాచరణుఁడా పాఠశాల కుపాధ్యాయుఁడయ్యెను. ప్రస్తుతకాలమున గ్రాంటుఇన్ ఎయిడు ప్రభావముచేతను, రిజల్టుపాఠశాల యేర్పాటువలనను, గ్రామగ్రామమునందును విద్యాశాలలు స్థాపింపఁబడి సర్వగుణాలంకరిష్ణులగు రూపారూపరాశులైన నిరీహసత్పురుషులగువా రుపాధ్యాయులై ప్రకాశించుచుండిరి. కాని యాకాలమున నంతమంది యుపాధ్యాయులు లేరు. అందువలన దారాచరణుఁడు గ్రామదేవతలలో నొకఁడుగాఁ బరిగణింపఁబడుచుండెను. అదికాక యాతఁడు (Citizen of the world; Spectator మరియు Made easy series) పుస్తకములను చదువుచుండెను. అదియునుగాక క్షేత్రగణితము (Geometry)లోని మొదటిభాగములనుగూడ నతఁడుచదివెననియంగడివీథిని చెప్పుకొనువాడుకయుఁగలదు. అట్టిసకల గుణములచేతను నాతఁడు దేవీపురనివాసియగు జమీనుదారుఁడైన దేవేంద్రబాబుచే స్థాపింపఁబడిన బ్రహ్మసమాజములోఁ జేరి బాబుల సభాసదులలో నొకఁడై యుండెను. ఆసమాజమునఁ దారాచరణుఁడు విగ్రహారాధనము, బాల్యవివాహము, పూర్వాచారము, మున్నగువానిని ఖండించుచు, వితంతూద్వాహము, స్త్రీవిద్యాభ్యాసము, స్త్రీపురుషులు సభాస్థానమున కలసిమెలసియుండుట, మున్నగునావశ్యకములైన సంస్కారముల ననుమోదించుచు గొప్పగొప్ప యుపన్యాసములను వ్రాసి వారమునకొకసారి చదువుచు "మనసమాజమునందు సంస్కారములు చక్కగా జరుపుటకుగాను మనవారికట్టిబుద్ధిని ప్రసాదింప మన

టికిఁ దారాచరణుఁడు కొంచెముగా నింగ్లీషును నేర్చికొనియుండెను. కాన యుద్యోగముచేయఁదగిన సామర్థ్యమాతనికింకను కలుగలేదు. సూర్యముఖితండ్రి చనిపోయినవెనుక నాతఁడు నిరాశ్రయుఁడై సూర్యముఖితోఁగూడ నామెయత్తవారింటికిఁ బోయెను. సూర్యముఖితన భర్తయగు నగేంద్రునితోఁ జెప్పి యాగ్రామములో నొకపాఠశాల బెట్టించెను. తారాచరణుఁడా పాఠశాల కుపాధ్యాయుఁడయ్యెను. ప్రస్తుతకాలమున గ్రాంటుఇన్ ఎయిడు ప్రభావముచేతను, రిజల్టుపాఠశాల యేర్పాటువలనను, గ్రామగ్రామమునందును విద్యాశాలలు స్థాపింపఁబడి సర్వగుణాలంకరిష్ణులగు రూపారూపరాశులైన నిరీహాసత్పురుషులగువా రుపాధ్యాయులై ప్రకాశించుచుండిరి. కాని యాకాలమున నంతమంది యుపాధ్యాయులు లేరు. అందువలన దారాచరణుఁడు గ్రామదేవతలలో నొకఁడుగాఁ బరిగణింపఁబడుచుండెను. అదికాక యాతఁడు (Citizen of the world; Spectator మరియు Made easy series) పుస్తకములను చదువుచుండెను. అదియునుగాక క్షేత్రగణితము (Geometry)లోని మొదటిభాగములనుగూడ నతఁడు చదివెననియంగడివీథిని చెప్పుకొనువాడుకయుఁగలదు. అట్టిసకల గుణములచేతను నాతఁడు దేవీపురనివాసియగు జమీనుదారుఁడైన దేవేంద్రబాబుచే స్థాపింపఁబడిన బ్రహ్మసమాజములోఁ జేరి బాబుల సభాసదులలో నొకఁడై యుండెను. ఆసమాజమునఁ దారాచరణుఁడు విగ్రహారాధనము, బాల్యవివాహము, పూర్వాచారము, మున్నగువానిని ఖండించుచు, వితంతూద్వాహము, స్త్రీవిద్యాభ్యాసము, స్త్రీపురుషులు సభాస్థానమున కలసిమెలసియుండుట, మున్నగునావశ్యకములైన సంస్కారముల ననుమోదించుచు గొప్పగొప్ప యుపన్యాసములను వ్రాసి వారమునకొకసారి చదువుచు "మనసమాజమునందు సంస్కారములు చక్కగా జరుగుటకుగాను మనవారికట్టిబుద్ధిని ప్రసాదింప మన

మండలము పరమకారుణ్యాధికుఁడైనపరమేశ్వరుని ప్రార్థింతము'' అని సభాసదుల నందఱిని ప్రోత్సహించి యుపన్యాసములను ప్రారంభించుటకుఁ బూర్వము "హేపరమకారుణికపరమేశ్వర!'' అని ప్రారంభించును. ఆతఁడీవ్యాసములను వృత్తాంతపత్రికలనుండి యెత్తివ్రాసుకొనుటయేగాక యితరపండితులచేతఁగూడ వ్రాయించుకొనివచ్చుచుండును. నోటితో నెల్లపుడును "మీరు రాతివిగ్రహములను, మట్టిబొమ్మలను బూజింపకుఁడు. సోదరసంబంధములను జేయుఁడు. స్త్రీవిద్యాభ్యాసము గావింపుఁడు. స్త్రీలను పంజరములలోఁ బెట్టి బంధింపకుఁడు. స్త్రీలకు రజస్వలానంతర వివాహములు చేయుఁడు. పునర్వివాహములు నడపుఁడు'' అని చెప్పుచుండును. స్త్రీలపట్ల యట్టియౌదార్యమును (Libarality) జూపించుటకు విశేషకారణమేమందు రేని:—ఆతనిస్వగృహమున స్త్రీలెవ్వరును లేరు. ఇంతవఱకాతనికి వివాహము కాలేదు. సూర్యముఖియు నాతని వివాహమునకై చాలఁ బ్రయత్నము చేయుచున్నది. కాని యాతనితల్లి కులభ్రష్టయై పోయినవార్త గోవిందపురములోని యందఱకును తెలిసియున్నకారణమున సద్వంశ్యులగువారెవ్వరు నాతనికి కన్యనిచ్చుట కంగీకరించినవారు కారు. కులకళంకితులగు కుత్సితజనులు తమబాలిక నిచ్చుట కొప్పుకొందురు. కాని సూర్యముఖి తారాచరణుని నిజసోదరునిగాభావించుకొనుటవలన నట్టివారిపడుచును తనసోదరునిభార్యయని చెప్పుకొనుట కిష్టములేక వారిసంబంధమున కామె సమ్మతించినది కాదు. మంచిసంబంధముకొఱకు వెదకుచున్నపుడు నగేంద్రుఁడు కుందసౌందర్యమును వర్ణించుచు వ్రాసినజాబామెకుఁ జేరెను. అపు డామె యాబాలికను తారాచరణునకిచ్చి వివాహముచేయవలెనని నిశ్చయించుకొనెను.

నిచ్చుచుండెను. పలితకేశుఁడగు నొకబ్రహ్మచారి కావివస్త్రములను ధరించికొని రుద్రాక్షమాలికను ద్రిప్పుచు స్వహస్తములతో వ్రాసికొనిన భగవద్గీతను పారాయణముచేయుచుండెను. అందందు దరపారాయణులైన సాధువులు నేయిచాలదని కేకలువేయుచుండిరి. అందందు శుష్కకంఠులగు బైరాగులు కంఠమునఁ దులసిమాలికలను ధరించి ముఖమునఁ దిలకమును దీర్చికొని మృదంగము వాయించుకొనుచు ముక్తాయింపునకు సరిగా నాడించుచుఁ గీర్తనలను బాడుచుండిరి. వారిభార్యలు తమతమభర్తలకు మోహావేశముఁ గలుగునటుల కేశరంజనము గావించుకొని ఖంజరీవాయించుచుఁ దాళమునకుసరిగా "గోవింద అధికారి" యనుపల్లవిని జేర్చి పాడుచుండిరి. ఆమందిరోపరిభాగమున నిరుగుపొరుగువారి పిల్లలు నిష్కారణముగా జగడమాడుకొనుచుఁ గేకలువేసికొనుచుఁ గొట్టుకొనుచుఁ బరస్పరము వారివారి తలిదండ్రుల నుద్దేశించి నానావిధములైన యసభ్యభాషల సంభాషించుకొనుచుఁ జరించుచుండిరి.

ఈమూఁడును మూఁడుసదరుమహాలులు. ఈమూడింటికి వెనుకభాగమునమూఁడులోపలిమహాలులుకలవు. కచ్చేరీమహాలునకు వెనుకవైపుననున్న లోపలిప్రాసాదము నగేంద్రునిస్వంతప్రాసాదము. అందతఁడును, నాతనిభార్యయు నాతనిస్వంతసేవకులునుమాత్ర ముందురు. మఱియు వారికిఁ గావలసిన సమస్తపదార్థములు నందు సేకరింపఁబడియుండును ఇదినగేంద్రుఁడు స్వయముగా నూతనముగాఁ గట్టించినమహాలు. ఇది శిల్పవిద్యాపాటవమేర్పడ జక్కగా గట్టింపఁబడెను. దానిప్రక్కను పూజామందిరమునకు వెనుకవైపున పూర్వకాలపుమహాలు గలదు. ఇది చాల పొట్టిగానుండును. చూచుట కంత సొగసుగాఁ గనఁబడదు. దానిలో నగేంద్రుని యనేకాత్మీయులగు బంధువులుండిరి. అమ్మమ్మ, మేనత్త, ఆమె కూఁతురుబిడ్డలు, బిడ్డలబిడ్డలు,

సంసారానుబంధము లేనివారు కలవారు, చిన్నమ్మకూఁతురుబిడ్డలు, వారిబిడ్డలు నింక నెందఱెందరో యింట నిండుగాఁ జేరియుండుటవలన గాక సమాకులవటవృక్షమువలె రేయింబవళులు కిలకిలమని గందరగోళమగుచుండును. అనుక్షణమును నానాప్రకారములైన చీత్కారములు, హాస్యపరిహాస్యములు, కలహములు, కుతర్కములు, నడుచుచుండును. మగపిల్లల యావులింతలు, బాలికలరోదనములు, 'నీరు కావలయును.' 'బట్టకావలయును' అన్నముకావలయును' అన్నము లేదు' 'చంటిపిల్లకు పాలుకావలయును' అనెడి శబ్దములచే సంక్షుభితమైన సాగరమువలె కోలాహలముగా నుండెను. దానిప్రక్కను దేవాగారమునకు వెనుకవైపున రంధనశాలకలదు. అక్కడ మఱింత యెక్కుఁడు గందరగోళముగా నుండెను. అక్కడ వంటచేయు నామె యొకర్తుక ప్రొయ్యిపై పాత్రనుంచి ప్రొయ్యిలోపలఁ గట్టెలను దగిలించి కాళ్లుచాపికొని కూర్చుండి దగ్గరనున్న యామెతో తన కుమారుని వివాహవృత్తాంతము నేకరవుపెట్టుచుండెను. మఱియొక సేవకురాలు పచ్చికట్టెలు మండక, పొగచే విగళితలోచనయై కట్టెలు తెచ్చిన యుద్యోగిని దూషించుచు నతఁడు డబ్బుపుచ్చుకొని పచ్చి కట్టెలను దెచ్చెనని యనేకవిధముల నిదర్శనపూర్వకముగా ధృవపరుచుచుండెను. ఒక సుందరి కాగిననూనెలో వేచుటకు పదార్థమును వేసినపు డానూనె చెదరి శరీరముపైఁ బడుటవలనఁ బంఢ్లు కఱచుకొని ముఖభంగము చేయుచుండెను. మఱియొకతె స్నానమాడుటకుఁ దైలమును దలకు రాచికొని సిగకట్టఁగని తనకేశజాలమును సీమంతప్రదేశమున చూడాకారముగాఁ జేర్చి కట్టికొని హస్తమునఁ గోలను బూని మార్జాలమును ఝుళిపించుచుండెను. అపుడామె సాక్షాత్తుగ శ్రీకృష్ణుఁడు కోలచే గోవులను బెదరించుచున్నట్లే యుండెను. ఒక ప్రక్కను గత్తిపీటపైఁ గూర్చుండి భామి, కామి, క్షేమి, లక్ష్మి,

నుబ్బి, గోపాలునితల్లి నేపాలునియత్త మున్నగువారు గుమ్మడి కాయలు, వంకాయలు, దుంపలు మొదలగు శాకములను దఱుగు చుండుటవలనఁ గలిగెడు గసగస, కచకచ శబ్దములఁ కనుపుగా వారు విరామములేకుండ దడదడ మాటాడుచు నిరుగుపొరుగువారిని, యజమానులను, నితరులను నిందించుచు, 'సుందరికి చిన్నవయసుననె యాధీనము తప్పిపోయినది. చంద్రవదనపెనిమిటి త్రాగుబోతు. కావేరమ్మ మగనికి గొప్పపనియైనది. జానకి కొడుకువంటివాఁ డిక నీలోకమునఁ బుట్టఁబోఁడు. పార్వతికొడుకో ? అంతటి దుర్మార్గుఁ డున్నాడా ? శ్వేతదీపవాసులది రావణవంశముసుమా ! భగీరథుఁ డెంతోకష్టపడి గంగను దీసికొనివచ్చెను.' మున్నగు లోకాభిరామాయణములనుగూర్చి చర్చించుకొనుచుండిరి. ఒక వృద్ధురాలు నది యందు స్నానముచేసివచ్చి యధికనిష్ఠతో జపమాచరించు నెపమున గూర్చుండి వచ్చినవారితోఁ దన దుఃఖమును వెళ్ళబోసికొనుచు నసూయతోఁ బరనిందాసక్తురాలై సంకటపడుచుండెను. ఒకపొదుపు కత్తె తన యక్కగారి వస్త్రాభరణములను ధరించుకొని వచ్చినవారికిఁ జూపించుదానివలెఁ దిరుగుచుఁ దక్కినవారందఱు లోభగుణము గలవారని దూషించుచుండెను. కొందఱు పరిచారికలు, సిపాయిలు, నపరిచితులు నడయాడెడు నడవలోఁ జీర చెఱఁగుల సవరించుకొనకయె నటనానుకూలముగ వస్త్రాలంకారము గావించుకొనెడు దొరసానులవలెఁ గూర్చుండి పొరుగువారి ఛిద్రాన్వేషణమును జేయుచు సావకాశముగా సంభాషించుకొను చుండిరి. ఆసమయమున వారిభర్తల నడిసన్నలు పొడగట్టినంతనే చీర చెఱఁగులనుసరి జేసికొనిలజ్జితలవలె లేచినిలువఁబడుచుండిరి. ఉగ్రాణము నందొకపరిచారిక తనకిచ్చిన నేయిచాలదని యాయుగ్రాణాధికారితో గట్టిగాఁ గలహించుచుండెను. ద్వారముచెంత నన్నముకొఱకై యనేకు

లగుభిక్షుకులు, చిన్నలు, పెద్దలు, స్త్రీలు, మగవారు గూర్చుండియుం డిరి. వారితోఁ గుక్కలును వేచియుండెను, లోపల మార్జాలములు వృథాగాఁ దిరుగుట లేదు. వానికవకాశము చిక్కినపుడెల్ల వంటలవారి వలె నెవరియనుమతియుఁ బొందకయె దొరకినపదార్థములను సంగ్రహించుకొని పాఱిపోవుచుండెను. అనుజ్ఞనుపొందకయె ప్రవేశించినగోవు తరఁగఁబడినశాకావశిష్టము నమృతమయముగా గ్రహించి కన్నులుమూసికొని తినుచుండెను. ఆసమయమున శరీరముపై బ్రాలుచున్న మక్షికబాధానివారణార్థమై చెవులను విసరికొనుచుండెను.

ఈలోపలిమూఁడుమహాలులకు వెనుకటిభాగమునఁ బుష్పోద్యానముకలదు. ఈయుద్యానవనమునందు నీలాకాశమువలెఁ బ్రకాశించుచున్న యొకవిశాలమైన సరోవరముకలదు. ఆసరోవరమునకుఁజుట్టును నావరణముగాఁ గోడకట్టఁబడియుండెను. అంతఃపురస్త్రీలుండెడు లోపలిమహాలు మూఁడుభాగములుగా నుండెను. ఆపుష్పోద్యానమున నొకరహస్యమార్గము కలదు. ఆమార్గమున కాద్యంతములను రెండుద్వారములుండెను. ఈద్వారము లతిగూఢములై యుండెను. వినిమార్గమున నంతఃపురములోనిమూఁడుమహాలులకును బోవచ్చును. అనంతమైన రాజభవనమున కావల గుఱ్ఱపుతబేలాలు, ఏనుగులశాలలు, శ్వానములయిండ్లు, గోశాలలు, పక్షులగూడులు, గలవు.

కుందనందిని నగేంద్రునియతులైశ్వర్యసంపదకచ్చెరువునొందుచుఁ బల్లకిలోఁగూర్చుండి యంతఃపురమునకుఁ బోయెను. సూర్యముఖిసన్నిధికిఁ గొనిపోఁబడినపు డామెకు నమస్కారమును జేసెను. ఆమెయు కుంద నాశీర్వదించి గౌరవించెను.

కుందనందిని నగేంద్రునిజూచి యాతనియందుఁ దాను స్వప్నమునఁజూచినపురుషునిలక్షణములు సరిగా నుండినట్లు గ్రహియించి నిశ్చయించుకొని, తాను స్వప్నమునందుఁ దరువాతఁ జూచినస్త్రీయా

తనిభార్యయగునా కాదాయని సందేహించుచుండెను. కాని యిప్పుడు సూర్యముఖిని సందర్శించినంతనె యామెసందేహము తీఱిపోయెను. కుందనందిని స్వప్నమునఁజూచినస్త్రీవలె సూర్యముఖి శ్యామాంగి కాదు. సూర్యముఖపూర్ణచంద్రునివలె పుటమెత్తినచొక్కపుబంగారు వర్ణముగల దేహకాంతిచేఁ బ్రకాశించుచుండెను. ఆమెనేత్రము లతి సుందరములై యుండెను. కలలోఁ గనఁబడినస్త్రీ కిట్లులేవు. సూర్యముఖి నేత్రము లాకర్ణాంతవిశాలలై యళికస్పర్శము లయిన భ్రూయుగ్మసమాశ్రితములై కమనీయంబగు వక్రపల్లవరేఖాధ్యస్థములై స్థూలమైన కృష్ణతారాసనాథములై తారలు సమున్నతోజ్వలములై నిశ్చలములై యొప్పుచుండెను. స్వప్నదృగ్గోచరమైన శ్యామాంగి నేత్రములయం దట్టియలౌకికమనోహరత్వము కనఁబడుటలేదు. సూర్యముఖి యవయవము లట్లులేవు. స్వప్నదర్శి ఖర్వాకృతిగలది. సూర్యముఖి కొంచెమున్నతాకృతిగలదై మందమలయానిలాందోళితమధురసాంతర్గతకోమలలతవలె లావణ్యరసోదంచిత దేహసౌందర్యముగలదై యుండెను. స్వప్నమునఁ గనఁబడినకాంత సుందరియేగాని యామెకంటె సూర్యముఖి నూఱుమడుంగులధికసుందరియై యుండెను. స్వప్నదర్శి కిరువదివత్సరములవయసు సూర్యముఖి కిరువదియాఱువత్సరముల వయసు సూర్యముఖికిని స్వప్నగతయైన యాశ్యామాంగికిని స్వల్పమైనను పోలికలేదని తెలిసికొని కుందనందిని స్వచ్ఛందచిత్తముతో నుండెను.

సూర్యముఖి కుందతో సరసముగా సంభాషించి పరిచారికలరావించి వారిలో ముఖ్యురాలగునామెతో—ఈకుందను తారాచరణునకిచ్చి వివాహముచేసెదను. అందువలన నీమెను నాసోదరిభార్యవలెఁ జూడవలయును" అని చెప్పెను.

ఆదాసి యందుల కంగీకరించి కుందను మఱియొకసగదునకుఁ దోడ్కొనిపోయెను. దానిని జూచినంతనే కుందదేహ మాపాదమస్త

కమును జలించి నీరువిడిచినట్లయ్యెను. ఆమెకు స్వప్నమునఁ దల్లికనఁ బఱచిన పద్మపలాశ లోచనయగు శ్యామాంగి యామెయేయై యుండెను.

కుంద భయవిహ్వలచిత్తయై యొకనిట్టూర్పుపుచ్చి "నీవెవ్వ తెవు?"

దాసి—నా పేరు "క్షీర"

---

## ఎనిమిదవ ప్రకరణము

పాఠకమహాశయులకు మాపై గోపమునకుఁ గారణము.

ఇందుపాఠకమహాశయులు మాపై మిగుల నాగ్రహపరవశు లగుదురు. అందులకు సందేహములేదు. గ్రంథకర్తల గ్రంథరచన కొకయను శ్రుతమగు నాచారముకలదు. గ్రంథమును పరిసమాప్తి చేయునపుడు గ్రంథమునందుఁ జెప్పఁబడిన నాయికానాయకుల బరిణయముతో సమాప్తి చెప్పవలయును. కాని, ఇపుడు మేమో గ్రంథారంభమునందే కుందనందినికి వివాహముచేయుటకు సంసిద్ధులమై యుంటిమి. ఇంతేకాక ప్రాచీనమైన మఱియొకయాచారము ననుసరించి నాయికకు వివాహము చేయఁబడునాయకుఁడు పరమసుందరుఁడును, సర్వగుణవిభూషితుఁడును, వీరపురుషుఁడును నాయకియందు బద్ధానురాగుఁడునై యుండవలయును. పాపము మనతారాచరణున కట్టిగుణము లేవియును లేవు. సౌందర్యమేమయిన కలదన యోచింతుమేని యదియు శూన్యమే. కల్మషయుతమగు తామ్రవర్ణముఁబోలిన దేహకాంతియుఁ జితుకముక్కు నాతని సౌందర్య లక్షణమును. ఆతనిశౌర్యాటోపమంతయు బడిపిల్లలమీఁదనే విని

యోగపడుచుండెను. ప్రణయవిషయమునుగూర్చి యాలోచింతు మేని కుందనందినియెడల నాతనికెంతవఱకనురాగముగలదో దానిని జెప్పఁజాలము. కాని, పెంపుడుకోతియందుండెడు ననురాగమున కది తీసిపోయియుండదని చెప్పవచ్చును.

యెట్లయిననుసరే—కుందనందిని నగేంద్రునిగృహమునఁ బ్రవేశించిన కొలఁదికాలములోనే తారాచరణునకిచ్చి వివాహము చేయఁబడెను. కాని యాతఁడు రూపవతియగుకాంతను భార్యగాఁబడసి కొండొకవిపత్తునకు లోనైనవాఁడయ్యెను. ఆతఁడింతకుఁబూర్వము దేవేంద్రబాబు గృహమున "స్త్రీవిద్యాభ్యాసము" జనానాపద్ధతిని తొలగించుట" మొదలగు విషయములనుగూర్చి వ్యాసములను జదివినసంగతి పాఠకులకుఁ దెలిసియేయుండును. ఆవిషయములనుగూర్చి తర్కవితర్కములు జరగినపుడు మనయుపాధ్యాయుఁడుదంభముతో; 'నాకు సమయము దొరకినచో, నిట్టిసంస్కారములు జరుపుటలో నేనే ప్రథమోదాహరణమును జూపెదను. నాకువివాహమైన యెడల నా భార్యను మనసమాజములోనికిఁ దీసికొనివత్తును" అని చెప్పియుండెను.

ఇప్పు డతనికి వివాహమైనది. కుందనందిని సౌందర్యాతిశయము సర్వత్ర వ్యాపించెను. లోకులందఱును బూర్వ మీతఁడుచెప్పిన ప్రగల్భముల నెత్తిపొడుచుచు నాశపథ మేమయ్యెనని యడుగుచుండిరి. దేవేంద్రబాబుకూడ "ఇపుడు నీవుకూడ బుద్ధిహీనులగు నా ఛాందసులలోనే చేరిపోయితివా? నీభార్యనేలగనుపఱుపవు?" అని యడుగుచుండెను.

తారాచరణుఁడు లజ్జచేఁ గ్రుంగిపోయెను. అతఁడు దేవేంద్రుని యెత్తిపొడుపులను దప్పించుకొనుట కుపాయాంతరను లేక తుదకాతనికిఁ దనకాంతను జూపుటకు సమ్మతించెను. కాని యది సూర్యముఖికి దెలిసినయెడల నాపైఁ గాగ్రహము వచ్చునని యాతఁడు భయపడు

చుండెను. 'ఇపుడు' 'రేపు' అని చెప్పుచునొకసంవత్సరమువఱకు కాతం డు కాలహరణము చేసెను. కాలహరణమువలనఁ బ్రయోజనము లేదని తెలిసికొని తనగృహమును బాగుచేయింపవలయునను నెపము కల్పించి కుందనందినిని నగేంద్రునిగృహమునకు బంపివైచెను. స్వగృహము పూర్తిగాఁ జక్క చేయబడినపిమ్మట కుందనందిని మరల నింటిలోఁ బ్రవేశించెను. తరువాతఁ గొన్నిదినములకు దేవేంద్రుఁడు తనస్నేహితులతోఁగూడఁ దారాచరణునియింటికివచ్చి "తారాచరణుఁడు వట్టిదంభము రాయులఁ" డని పరిహాసింపఁజొచ్చెను. అప్పుడు తారచరణుఁడు చేయునది లేక యెంతో ప్రయత్నముతోఁ గుందనందిని నొడఁబఱిచి యామెను, దగిన యుడుపులను ధరింపఁజేసి దేవేంద్రునితో సంభాషించుట కాతని కడకుఁ దీసికొనివచ్చెను. కుందనందిని దేవేంద్రునితో సంభాషించునా? క్షణకాల మాతనియెదుటఁదన మేలిముసుంగు నెడలింపకయె నిలువఁబడి పిమ్మట నేడ్చుచు లోనికిఁ బోయెను. అయినను దేవేంద్రుఁ డామె యపూర్వనవయౌవనసంచారసముదంచిత దేహ కాంతిని గని ముగ్ధుఁడయ్యెను. ఆకాంతినాతఁ డెప్పుడును మఱచిపోలేదు,

పిమ్మట దేవేంద్రునిగృహమున నొకశుభకార్యము జరగెను, అందులకై యాతనిగృహమునుండి యొకబాలిక వచ్చి కుందను పసపుఁ గుంకుమకుఁ బిలిచెను. కుందపోలేదు.

దేవేంద్రుఁడు మఱియొకసారి కుందతో సంభాషించుటకై తారాచరణుని గృహమునకుఁ బోయెను. సూర్యముఖి యీసమాచారమునువిని తారాచరణునిబిలిపించి తీవ్రముగాఁ జీవాట్లుపెట్టెను. అంతటినుండి దేవేంద్రుని రాక నిలిచిపోయెను.

వివాహమైనపిమ్మట మూఁడువత్సరము లీవిధముగా నడచిపోయెను. అనంతరము కుందనందిని విగతభర్తృక యయ్యెను, జ్వర

బాధచే తారాచరణుఁడు కాలాధీనుఁ డయ్యెను. సూర్యముఖి యనాథయగునాకుందను నిజగృహమునకుఁ దోడ్కొనిపోయి తారాచరణుని గృహమును విక్రయించి యాధనముచే కుందనందిని పేరుతో సర్కారు ధనపత్రములను గొనెను.

పాఠకమహాశయులకు మాపై జాల నాగ్రహము గలుగుట నిజము. కాని మేమేమిచేయుదుము? కథ యిప్పుడే ప్రారంభమైనది. విషవృక్షమునకు బీజము బాగుగా నాటఁబడినది.

---

## తొమ్మిదవ ప్రకరణము.

### హరిదాసివైష్ణవి.

భర్తృహీనయగుకుందనందిని నగేంద్రునిగృహమునఁ గొంత కాలము గడపెను. ఒకనాఁడు మధ్యాహ్నకాలమున నంతఃపుర స్త్రీలందఱును జేరి యంతఃపురభవనమందలి ప్రాచీనగృహమునఁ గూర్చుండియుండిరి. ఈశ్వరునికృపచే వారందరును దమతమమనోభీష్టములననుసరించి గ్రామ్యస్త్రీ సాధ్యములగుసులభ కార్యములను జేయుచుండిరి.. వారిలోఁ బసిపిల్లలు మొదలుకొని పలితకేశులగువృద్ధులవఱకునన్నితరగతులప్రాయమువారును జేరియుండిరి. ఒకతె మఱియొకతెకు జడవేయుచుండెను. రెండవది యాజడబిగింపునకు బాధపడుచుండెను. ఒకతె తనతలపైనున్న తెల్లవెండ్రుకలను దీయించుకొనుచుండెను. రెండవది యాతలవెండ్రుకలను ధాన్యపుగింజలసాహాయ్యమున నూడఁబెరుకుకొనుచుండెను. ఒకసుందరి చిత్రవర్ణముగలగుడ్డతో దనబాలునకంగీని గుట్టుచుండెను. ఒకతె తన బిడ్డకు స్తన్యము నిచ్చుచుఁ బుత్రవాత్సల్యముచేఁ గలిగెడు సుఖభావాపన్నయై నిశ్చలముగా

గూర్చుండియుండెను. ఒకతె మనోహరముగా వస్త్రాలంకారముఁ జేసికొనుచుండెను మఱియొకతె తనభర్తపైఁ గోపముచే బిడ్డను గొట్టుచుండెను. ఆబిడ్డనోఱ తెఱచుకొని సప్తస్వరమున త్రిస్థాయిలను రోదనముఁ జేయుచుండెను. ఇంకొకతె యాకోలాహలమునడుమ గాఢనిద్రాపరవశయై నిద్రించుచుండెను. ఒకచిత్రరేఖ (కుశల) యొకరివివాహమునుగూర్చి యోచించుచు, నూతనదంపతులుగూర్చుండుట కుపయోగించెడు పెండ్లిపీటపైఁ బిండితోఁ గొండొకచిత్రముగాఁ బట్టుపెట్టుచుండెను. సద్గ్రంథరసగ్రాహిణియగు నొకవిద్యావతి భారతమును జదువుకొనుచుండెను. మఱియొక విదుషీమణి దాసురాయనిపద్యములను పఠించుచుండెను. ఒకముదుసలి తనకుమారునిపై గల నేరములను చెంతనున్నవారిచెవులలో నూఁదుచుండెను. రసికశిఖామణియగు నొకయువతి యర్ధస్ఫుటస్వరమునఁ దననాథునిరసకౌశలమును సకియలచెవులలోఁ జెప్పుచు విరహిణులమనోవేదనము నతిశయింపఁజేయుచుండెను.

కొందఱుయజమానుని, మఱికొందఱుయజమానురాలిని, కొందఱిరుగుపొరుగువారిని నిందించుచుండిరి. అందఱు నాత్మప్రశంసమునే యెక్కువగా జేసికొనుచుండిరి. ప్రాతఃకాలమున సూర్యముఖి వాగ్దండనకు పాత్రురాలైన బుద్ధిహీనురాలొక్కతె తనబుద్ధిసూక్ష్మతనుగూర్చియనేకోదాహరణములను జూపుచుండెను. వంట సరిగా చేయలేనియొకతె పాకశాస్త్రమునందు తనకుఁగల పాండిత్యమునుగూర్చి యుపన్యసించుచుండెను. మూఢత్వమున కాగ్రామములో సాదృశ్యముగాఁ జెప్పుకొనఁబడు పురుషుని భర్తగావడసిన యొకతె యనన్యసామాన్యమైన యాతని వైదుష్యమునుగూర్చి తన చెలికత్తెలమ్రోల వేవిధములఁ గొనియాడుచుండెను. ఒకతె రూపవిహీనులగుతనబిడ్డలను సౌందర్యాలంకారులుగా భావించుకొని యుప్పొంగుచుండెను. సూర్యముఖి వారి సంఘములోఁ జేరియుండలేదు. ఆమె స్వల్ప

ముగా గర్వియగుటవలన వారినడుమ విశేషకాలము కూర్చుండదు. ఆమెయున్నచో మిగిలినవారు నిర్భయముగా మాటాడఁజాలరు. కుం దనందిని మాత్రమిపుడు వారితోఁ గలసియుండెను. ఆమె యొకబా లునకాతనితల్లికోరికప్రకార మక్షరములను నేర్పుచుండెను. ఆమె శిష్యుఁడు మఱియొక బాలునిహస్తమున దినుబండారపుపదార్థముండు టను జూచుటవలన నది యాతనివిద్యాభివృద్ధికిఁ జాలనాటంకముగా నుండెను.

ఆసమయమున నచ్చటికి యొకవైష్ణవి "జయ రాధ" యని పాడుచు వచ్చి నిలువఁబడెను.

నగేంద్రుని "ఠాకూరువాడి" యందు నిత్య మతిథుల కన్న మిడుచుండుటయేగాక భానువారమున నక్కడ భిక్షుకుల కమితముగా తండులములు దానము చేయఁబడుచుండెను. కాని భిక్షార్థులగువారెవ్వ రైనను నంతిపురమునఁ బ్రవేశించుటకు వీలులేదు. అందువలన "జయ రాధ "యను కేకవినినంత నె పురవాసిని యొకతె "అదేమే? లోప లికివచ్చితివి? ఠాకూరువాడికి పొమ్ము. " అని చెప్పుచు నామెవైపు నకు ముఖముఁద్రిప్పుకొని యంతటితో నాగక "నీ వేవైష్ణవివి? " యని యడిగెను.

అందఱును విస్మయముతోఁ జూచిరి. ఆవైష్ణవి యువతియు, మనోహరరూపవతియునై యుండెను. బహుసుందరశోభితమైన యార మణీమండలమున కుందనందినియొక్కతక్క మఱియెవ్వరును నావై ష్ణవికంటె నధికరూపవంతులు లేరు. ఆసంచలితాధరము, ఆచక్కని నాసికయు, ఆవికసితవిశాలనయనారవిందములు, చిత్రింపబడినట్లున్న యాకనుబొమ్మలు, నాయాయతలలాటము, మృణాళములనిరసించెడు నాబాహువులు కాంచనసన్నిభం బగునా దేహకాంతియు. రమణీకుల కులమునకు దుర్లభమైనవియే యగును. అక్కడ నెవరైన సౌందర్య

సద్విచారమును జేసెడువారుండిరి. యామెరూపమును జూచినయెడల నామెసౌందర్యమునందు మార్దవమాధుర్యము కొఱంతపడి యుండెనని చెప్పకమానరు. ఆమె ప్రవర్తనాదికములలో బరుషములగు పురుష లక్షణములు గనఁబడుచున్న వని చెప్పవచ్చును.

నాసికపై గోపీచందన నామమును, తలపై సిగయు, గలనొక వైష్ణవి చిత్రపుటంచులుగల చక్కనిచీరను గట్టుకొని హస్తమున తంబురను బూనియుండెను. ఆమెహస్తముల నిత్తడి కంకణములును, గాజులును గలవు.

ఆస్త్రీలలో వృద్ధురాలొకతె "నీవెవరమ్మ" యని యడిగెను.

వైష్ణవి—నాపేరు హరిదాసి వైష్ణవి. యజమానురాండ్రు సంగీతమును వినెదరా?

"వినెదము. వినెదము" అని ఆబాలవృద్ధులును చెప్పిరి. పిమ్మట తంబురనుపైకెత్తి వైష్ణవి యాసుందరీమణుల చెంతఁ గూర్చుండెను. అచ్చట కుంద యొక బాలునికి పాఠమును జెప్పుచుండెను. కుందకు సంగీతమన్న చాల నాసక్తి. వైష్ణవిపాటను వినుటకు మఱికొంచెము సామీప్యమునకు వచ్చెను. ఆమెశిష్యుఁ డాయవకాశమున దినుబండా రపుపదార్థము పట్టుకొనియున్న బాలునిచేతినుండి దానిని లాగికొని తిని వేసెను.

ఆవైష్ణవి యేమిపాడమనెదరని వారినడిగెను. ఆసభికురాండ్ర నేక విధములగు పాటలను పాడుమని కోరిరి. ఒక్కతె "గోవిందాఅధికారి "యను పాటను పాడుమనెను. మఱియొక్కతె "గోపాలహరే" యనుపాటను పాడుమనెను. దాసురాయని శ్లోకములను జదువుచున్న యామె యాశ్లోకములను జదువుమనెను. కొందఱుకృష్ణలీలలనుపాడుమనిరి. మధ్యవయస్కులు కృష్ణచారిత్రములో 'సఖీవాదము' విరహము అనుపాటలను బాడుమనిరి. కొందఱు శ్రీకృష్ణుని పశులకా

పతిత్రతనమునుగూర్చి పాడుమనిరి. లజ్జావిహీనురాలైనయొకతె 'ప్రభాతమైనపిదప' యనునది పాడుము. లేనిచో నేను విననని' అనియెను. నోరు తెరుగని బాలిక 'బాడె బాడె దూతి' యనుపాటను బాడుమనెను.

వైష్ణవి యందఱియాజ్ఞలను గైకొని కుందపై తనకటాక్షమునునిలిపి 'అమ్మా! మీరేమియు నాజ్ఞాపింపరు? అనెను. కుంద లజ్జావనతవదనయై మోమున లేనగవంకురింప నేమియు పలుకక నొకతె చెవిలో 'నొకకీర్తనను బాడుమనుము' అని చెప్పెను.

అప్పుడా చెలి 'ఓవైష్ణవీ! కుంద యొకకీర్తనను బాడుమని సెలవిచ్చెను. 'పాడుము' అని చెప్పెను. అదివిని వైష్ణవి కీర్తనను బాడుటకు ప్రారంభించెను. తక్కుంగలసుందరీమణుల యభీష్టములను తనయాజ్ఞానుసారముగాఁ బాడుచుండుటను జూచి కుంద లజ్జాన్వితయయ్యెను. హరిదాసివైష్ణవి తంబురను సారించి యలరుం దేనియలు చిందు నటుల నతిమాధుర్యముగా నొకటిరెండు తానములను వాయించి పిమ్మట సుస్వరమాధుర్యం బగుతనకంఠమును తంబురశ్రుతులతో లీనపరచి నవవసంతసమయవికసనోన్ముఖ కుసుమముకళసమాశ్రితమధుకరీ మధుర ఝంకారనినదంబువలె నవీన లజ్జాశీలయగు నూతనవధువు తన ప్రథమప్రేమరసంబును నిజనాథుని కర్ణపుటంబులజిల్కుచుం బలుకు బలుకులవలె సుకుమారమాధుర్యరసాస్పదమై యొప్పునటుల మనోహర గీతములను బాడెను. మరలతంబురనుగైకొని మహావాద్యవిద్యావిశారదాంగుళీజనిత తాళలయసమన్విత సరససంగీతశబ్దంబులంబోలె గంభీరమేఘనాదంబులఁ బోరుగొల్పుచు నప్సరసల నధిగమించి పాడు. తనగానామృత రసప్రవాహమున నాసుందరీబృందమును నోలలాడించెను. సభికులాంద్రఁగు నారమణీమణులు అట్టాలికాపరిపూర్ణంబై గగన సమాశ్రితంబై

యనన్యసామాన్యంబై యలగారు దానికంఠస్వరమునువిని విస్మితలై విమోహితచిత్తలైరి. ముగ్ధాంతఃపురాంగనలగు నా సుందరీమణులా సంగీతపాటవము నెట్లు గ్రహింపఁగలుగుదురు? అయ్యెడ నొకసంగీత శాస్త్రవిశారదుఁ డున్నయెడల నాతఁడు సర్వాంగసుందరమైన యా తాళలయస్వర పరిశుద్ధమైనసంగీతము కేవలము సుకంఠిసులభ సాధ్యము కాదనియు, వైష్ణవి సామాన్యవలెఁ గనఁబడినను నామె సంగీతమునం దసాధారణమైన నైపుణ్యమును బొంది లేవయసునందె దానియం దపార దర్శియై యుండెననియుఁ దెలిసికొనియుండును.

ఆవైష్ణవి సంగీతమును ముగించెను. పౌరస్త్రీలు మరలఁ బాడుమని యామెనడిగిరి. అప్పుడు వైష్ణవి సతృష్ణవిలోలనేత్రయైన కుందనందినిని విలోకించుచు గానము సేయఁదొడఁగెను.

అలసిపోయి చేరితివిగో ♦ కులము నివుడు
త్వన్ముఖాబ్జంబుఁ జూపు ము ♦ త్యాలమాల!
భామినీమణినీముఖ ♦ పంకజంబుఁ
గాంచినీకోపభరమడఁ ♦ గించుకొఱకు
నాఁడురూపంబుతో వచ్చి ♦ నాఁడనన్ను
మంచిమాటలఁదనుపుమీ ♦ మగువ రాధ!
రాధికా! మధురాధరా! ♦ రమ్మటంచు
నాదరంబున నీదుపా ♦ దాబ్జములకు
నందలినొసంగికమల ద ♦ ళాక్షి నీ ము
ఖేందుఁగని మదిఁబొంగిపో ♦ యితిని రాధ!
పరమకారుణ్యమునసన్నుఁ ♦ బలుకరించి
యెటులబ్రదికించెదో సుమీ ♦ యింకమీఁద
మురళినైన మృదుస్వర ♦ సరళినైన
రాధయనుపేరుపల్కఁగా ♦ రాకయుంట

గనులునీర్నించుచున్నవి ♦ కనుము రాధ
కాననిర్దయగలదను ♦ కారణమున
వేణువును దూరముగఁ బార ♦ వేయుదునొకో
సద్దుసేయక నేఁడాంగ ♦ బ్రొద్దు వేళఁ
బోయి కాళింగమడుగులో ♦ మునుగుదునొకో
నీకొఱకు నిల్వఁబడియున్న ♦ నిట్టుసురులఁ
గలపివై చెద యామున ♦ జలములందు
కేవల నిరర్థకంబైన ♦ జీవితమున
నాశఁజూపుచు భారవా ♦ హకునిబోలె
నలయికలకోర్చి జగతిపై ♦ నిలువఁజాల
వ్రజకులసుఖార్థమాత్మజీ ♦ వనముగంగఁ
గలపివై చెదఁ గలకంఠ ♦ కంఠి! రాధ!
కాలిబంగరుగజ్జెల ♦ కట్టువిప్పి
కంఠమునకురిదారంబు ♦ గా బిగించి
తెగువతోడఁ గాళిందీ న ♦ దీజలముల
మునిగిపోవంగఁ దలఁతునే ♦ మనెదు రాధ!
బోటి మదిలోనఁ బరమాత్మ ♦ మోముజూచి
యాదరంబున నొక్క మా ♦ టాడు రాధ!

సంగీతము సమాప్తమైనపిమ్మట వైష్ణవి కుందనందినిఁ జూచి 'పాడిశ్రమఁ జెందుటవలన దాహమగుచున్నది. కొంచెము జలము నిండు' అని యడిగెను.

కుందనందిని యొక పాత్రతో జలమును దీసికొనివచ్చెను. వైష్ణవి యపుడు 'నేను మీపాత్ర నంటరాదు. చెంతకువచ్చి యా జలమును నాహస్తములఁ బోయుఁడు' అని యడిగి 'నేను జాతివైష్ణవిని కాను' అని చెప్పెను.

అందువలన వైష్ణవిపూర్వము హీనజాతిసంభూతురా లనియు, పిమ్మట వైష్ణవియయ్యెననియు తెలిసికొని కుందనందిని పాత్రను గైకొని జలమును బోయుటకై యామె వెనుక కొంతదవ్వేగి యామెకు జలమును బోసెను. ఆవైష్ణవి యాజలముతో ముఖమును హస్తములను గడిగికొనుచు నెవ్వరికిని వినఁబడకయుండ మెల్లగా 'మీపేరు కుందనందిని గాదటమ్మా'యని యడిగెను.

కుంద యాశ్చర్యముతో 'ఎందులకు?'అని యడిగెను.

వైష్ణవి—మీయత్తగారి నెప్పుడైన జూచితిరా?

కుంద—లేదు.

కుందనందిని తన యత్తగారు జాతిభ్రష్టయై తన దేశాంతరమునకు లేచిపోయెనని వినియుండెను.

వైష్ణవి—మీయత్తవచ్చి మాగృహమందున్నది. మిమ్ముల నొకసారి చూడవలెనని యెంతో గోలపెట్టుచున్నది. తన ముఖము నీ గృహయజమానురాలికిం జూపించుటకు సాహసింప లేకున్నది. ఆమెను జూచుటకు నాతో మీరేల రాకూడదు? ఎంతైనను నామె మీయత్తగారు.

కుందనందిని యెంత సరళహృదయయైనను, నామెతో సంబంధము పనికిరాదని యెరుగును. గాన వైష్ణవిమాటకు సమ్మతింపలేదు. అయిన నావైష్ణవి యంతటితో విడువలేదు. మరలమరల నామెనొత్తి యడిగెను. కుందనందిని తన యజమానురాలికిం దెలుపకుండ రావీలు లేదనెను.

హరిదాసి "అట్లుచెప్పవలదు. నీయజమానురాలికీసంగతి తెలియఁగూడదు. ఆమెనిన్నుపోనీయక, నీయత్తగారికొఱకు వర్తమాన మంపినఁ బంపవచ్చును. అపుడు నీయత్తగారు మరల దేశమును విడిచి పారిపోవలసివచ్చును" హరిదాసినొక్కి చెప్పినకొలఁదిని స్పష్టముగాఁ జెప్పుచుండెను.

హారిదాసిగత్యంతరముఁగానక "మంచిది. ఆమె కేలాగునఁజెప్పెదవో? చాలజాగ్రతగాఁజెప్పవలెనుసుమా! నేను మఱియొకసారివచ్చి నిన్ను వెంటఁగొనిపోయెదను. జాగ్రత్త! చాలనేర్పుతోఁ జెప్పవలెసుమా! అని చెప్పినవుడు కొంచెము కన్నీరు కూడ విడువవలసివచ్చినను విడువవలయును. లేనిచో నామె యొప్పుకొనదు" అని చెప్పెను.

ఇందులకును కుందయంగీకరింపలేదు. వైష్ణవి మఱేమియుఁ బలుకక ముఖమును జేతులను గడిగికొని మరలఁబాడుట కుపక్రమించెను. ఆసమయమున సూర్యముఖియచ్చటకు విచ్చేసెను. ఆమె వచ్చినంతనె యంతయు నిశ్శబ్దముగానుండెను. బాలిక లేదియోపని చేయుచున్నటులఁ గూర్చుండిరి.

సూర్యముఖియా వైష్ణవిని నఖశిఖపర్యంతముఁ బరీక్షించి "నీవెవ్వతెవు?" అనియడిగెను. నగేంద్రునితల్లిసోదరి "ఆమెహారిదాసి వైష్ణవి. సంగీతవిద్వాంసురాలు. మిగులచక్కగాఁబాడఁగలదు ఇట్టి పాటను నేనెందును వినలేదు. నీవుకూడవినవలసినదే. హారిదాసీ! భక్తిరసమయినగీతమును బాడుము" అనియెను.

హారిదాసి శ్యామనుగూర్చి యొక యపూర్వగీతమునుబాడెను

సూర్యముఖి యానందించి బహుమానపురస్సరముగా నామె నంపివేసెను. హారిదాసియుఁ బ్రణామమాచరించి కుందనుమరల నొక సారి వీక్షించి వెడలిపోయెను. సూర్యముఖి కనుమఱుగై పోయి తంబురను మీటుచు మృదుస్వరమునఁ బాడుకొనుచుపోయెను—ఏమనిన—ఓ చంద్రకళ!

క. పొగడుగలమధువాసంగెద
భగభగమనునత్రఘనుత ♦ ములమిచ్చెద గొ
జ్జగినీటమేనుదోలచెద
దగినతొడవులిడెదఁగొనము ♦ తారేశముఖీ!

వైష్ణవి వెడలిపోయినపిమ్మట స్త్రీలందఱు దానిప్రశంసయే చేయుచుండిరి. మొదటవారామె నెంతోఘనముగాఁ గీర్తించిరి. పిదప నామెలోపములను బట్టనారంభించిరి.

విరజ—అది సుందరియేగాని దానినాసికకొంచెము బల్లపరపుగా నుండెను.

వామ—దానిశరీరము పాలిపోయినట్టుండెను.

చంద్రముఖి—దానితలరుప్పతల.

చంపక—దాని పెదవులు తుట్ట పెదవులు.

కమల—దానినుదురు కోలగానుండెను.

నీల—దానిముఖము వైజారువలెనుండెను.

హరిణి—అదికొయ్యబొమ్మవలె నుండెను.

ప్రమద—దానివక్షము నాటకరంగమున బ్రవేశించు కృత్రిమ వేషధారివలె నున్నదిగాని సౌష్ఠవముగాలేదు.

పద్మ—దాని దేహముస్వల్పమైనను మార్దవముగాలేదు.

ఈవిధముగా సురూపవతియగువైష్ణవి క్షణకాలములోఁ గురూపిణియైపోయినది. పిమ్మటలలిత "చూపులకామె యెట్లున్నను నామె చక్కఁగా పాడును" అనియెను. కాని యిదియు నంగీకారముకాలేదు. చంద్రముఖి "ఏమిపాట? ఆకంఠమున నేమియు సుఖములేదు. ముక్తకేశి యీయభిప్రాయమును బలపరచెను. అనంగ "దానికేమియు గీతములురావు. దాసురాయని గీతములలో నొకటయినను బాడలేకపోయెను. కనక" దానికి తాళజ్ఞానమే లేదు. ఇట్లు క్రమముగా నాహరిదాసివైష్ణవి కురూపిణియగుటయేగాక యామె సంగీతమును పనికిరానిదయ్యెను.

---

## పదియవ ప్రకరణము

### బాబు

హరిదాసివైష్ణవి నగేంద్రనాథదత్తుని గృహమునుండి బయలు వెడలి దేవీపురమునకుఁ బోయెను. ఆపురమున నొకపుష్పోద్యానము కలదు. దానిచుట్టునుజక్కఁగా జిత్రింపఁబడిన యినుపకమ్ములచేఁగల్పింపఁబడిన నావరణయుండెను. ఆయుపవనమున నానావిధపుష్పఫలభరితంబగు వృక్షసముదాయము కలదు. దానిమధ్యమున సరోవరమును దానినడుమ సుందరమందిరమును గలవు. హరిదాసి యుపవనమునఁ బ్రవేశించి యందుండి యాసుందరమందిరమునకుంబోయి యందొకయేకాంతగృహమునఁ దనవస్త్రాలంకారములను దీయుటకారంభించెను. అంతనాకస్మికముగా నిబిడమైన వినీల కేశదామంబుచే రచింపఁబడిన కబరి తలనుండి జాఱిపడెను—అవి కృత్రిమకుంతలములు. వక్షమును జారిపడెను—అది వస్త్రనిర్మితమైనది. మణిబంధములు మున్నగునలంకారములనుఁగూడ దీసివైచెను. లలాటమునందలి తిలకమును దుడిచివైచెను. పిమ్మట ననువగు వస్త్రములను ధరించిన తోడనే వైష్ణవి నారీరూపము చాలించి యిరువదియైదు వత్సరముల యపూర్వయౌవనసుందరపురుషుఁడై నిలిచెను. అదృష్టవశమున నాతనిముఖము శ్మశ్రుహీనమై యుండుటవలన నాతఁడు కిశోరవయస్కుని వలెఁ గనఁబడుచుండెను—ఆయంగసౌష్ఠవ మాతని పరమసుందర పురుషునిగాఁ దోఁపఁజేయుచుండెను. ఆయువకుఁడే దేవేంద్రబాబు—ఆతఁడు మాపాఠకమహాశయులకు స్వల్పముగా పరిచితుఁడు.

దేవేంద్రుఁడును నగేంద్రుఁడు నేకవంశోద్భవులే. అయిన నా రెండు శాఖలకును బరస్పరము బురుషానుక్రమణికగాఁ బోరాటము జరుగుచు వచ్చినందున నానాటికి నన్యోన్యద్వేష మతిశయమై గోవిం

దపుర వాసులకును దేవీపురవాసులకును సంభాషణ నిలిచిపోయెను. ఈ రెండు కుటుంబములవారికిని తరతరములనుండి న్యాయస్థానములలోఁ దీవ్రమైన వాదములుజరిగెను. అందొకగొప్పవాదమున నగేంద్రుని పితామహుఁడు దేవేంద్రుని నోడించి దేవీపురశాఖవారిని బలక్షీణులుగాఁజేసెను. న్యాయస్థానములోని వాదనలకై వారిధన మంతయు వెచ్చమైపోయెను. వారిస్థిరసంబంధమగు వసతులన్నిటిని గోవిందపురశాఖవారు క్రయమునకుఁ దీసికొనిరి. అది మొదలుకొని దేవీపురము వారి స్వాస్థ్యము క్షీణించి రెండవశాఖవారిది యభివృద్ధి జెందెను. ఈరెండుశాఖలు నెన్నడును మరల కలిసికొనలేదు. దేవేంద్రబాబుతండ్రి క్షీణమైపోయిన తన కుటుంబ ధన గౌరవములను నిలుపుకొనుటకై కొండొక యుపాయమును వెదకెను. హరిపుర మండలమున గణేశుఁడను మఱియొక జమీనుదారుఁ డుండెను. ఆతనికి హైమవతి యను కన్యక యొక్కతెయే తక్క వేరుసంతానము లేదు. ఆమెను దేవేంద్రునకిచ్చి పెండ్లిఁజేసినయెడలఁ దమ ధనగౌరవములు నిలుచునని యెంచి యాచొప్పున నాబాలికను దేవేంద్రునకు వివాహముఁ జేసెను. హైమవతి సకలగుణాభిరామ—కురూపి. కృత్రిమబుద్ధి, కుటిల, ఆత్మపరాయణ దేవేంద్రున కామె నిచ్చి వివాహము చేయునంతవఱకు నాతని ప్రవర్తన మతి నిష్కళంకమై యుండెను. అతఁడు విద్యార్జనయందుఁ బట్టుదలగలవాఁడును, ప్రకృతిచే ధీరుఁడును, సత్యనిష్ఠాగరిష్ఠుఁడునై యుండెను. కాని యీ వివాహమాతని గుణాభివృద్ధికి నాశనహేతు వయ్యెను. ఆతఁడు ప్రాప్తవయస్కుఁడైనపిమ్మట తనకాంత చెయిదములవలన నిజగృహమున సుఖాశ లేదని తెలిసికొనెను. వయోగుణముచే నాతనికి రూపతృష్ణవొడమెను. కాని భార్య కురూపిణియగుటవలన స్వగృహమున నాతృష్ణకు శాంతి లేకపోయెను. వయోధర్మముచే నాతనికి దాంపత్య

ప్రణయకాంక్ష జనించెను. అప్రియవాదినియైన యా హైమవతిని జూచినతోడనే యాకాంక్షయు దూరముగాఁ దొలఁగిపోయెను. సౌఖ్యముమాట నటుండనిండు—హైమవతి వాక్కులనుండి వెలువడు విషానలజ్వాలకు సహించి యా గృహమున వసించుటయె యాతనికిఁ జాల దుష్కరముగాఁ గనఁబడెను. ఒక దినమున హైమవతి తన భర్తను జాల తూలనాడెను. ఆతఁ డింతవఱకును మిగుల నోపికతో సహించుకొనుచు వచ్చెను. ఆనాఁడా కఠినోక్తులను విని సహింపలేక యామె పెన్నెరులను బట్టుకొని యీడ్చి చిదుకగొట్టి విడిచెను. ఆనాఁడు మొదలుకొని స్వగృహమును విడిచిపోయి పుష్పోద్యానమున దనకొఱకొక గృహమును గట్టఁబంచి తాను కలకత్తానగరమునకు వెడలిపోయెను. ఆతనితండ్రి యిదివఱకె పరలోకమున కేగియుండుట వలన నాతఁడు స్వతంత్రుఁడై యుండెను. కలకత్తాలో నతఁడు సంతృప్తిఁ జెందని నిజమనోరథముల నీడేర్చుకొనుటకై పాపచింతనా ప్రవృత్తుఁడై యుండెను. వాని కవరోధముగా నంతరాత్మ చేయు బోధనల నణఁగద్రొక్కి ప్రమత్తుఁడై యుండుటకు మద్యపానలోలుఁడు గూడ నయ్యెను. అదిమొదలాతనికి పాపభీతి లేకుండఁబోయెను. పాపకార్యముల నొనర్చుటలో నాతఁ డత్యుత్సాహమును బొందు చుండెను. స్వల్పకాలము కలకత్తాలో నుండి యా నగరవాసులగు బాబులతోఁ జెలిమి నలవరచుకొని వారివలన విలక్షణముల నభ్యసించి పిమ్మట స్వగ్రామమునకు వచ్చి యందు నూతనముగఁ గట్టఁబడిన యా రామమందిరమున బ్రవేశించి విషయలోలుఁడై తిరుగుచుండెను.

కలకత్తానుండి వచ్చిన దేవేంద్రుఁ డనేక నూతనవిశేషాంశము లను నేర్చికొనివచ్చెను. దేవీపురమునకు మరల వచ్చినపిమ్మట తా నొక గొప్ప సంఘసంస్కారుఁ డని చెప్పుకొనుచుండెను. మొదట నాతఁడు దేవీపురమున 'బ్రహ్మసమాజము'ను స్థాపించెను. తారా

చరణుఁడు మొదలగువా రనేకు లా సమాజములోఁ జేరిరి. ఉపన్యాసములకు మితిలేకుండ నుండెను. దేవేంద్రుఁ డొక స్త్రీపాఠశాలను స్థాపించుటకుఁ జాల ప్రయత్నించెను. కాని కార్యకారియైనది కాదు. వితంతూద్వాహములను గూర్చి యాతఁడు చాలపట్టుదలతోఁ బనిచేయుచుండెను. హీనజాతిలోఁ జేరిన యొకరిద్దఱు వితంతువులకు వివాహము చేయఁబడెను. కాని అవి కన్యావరుల యన్యోన్యానుమతి ప్రకారము జరిగెను. కాని సమాజమువారి ప్రయత్నబలముచేతను కాలేదు. స్త్రీలకు జనానాస్వరూపమైన కారాగారబంధమును దప్పించుటకై దేవేంద్రుఁడు తారాచరణునితో నేకీభవించి సర్వవిధములఁ బ్రయత్నించుచుండెను. వారిద్దఱును 'స్త్రీలను బహిరంగముగాఁ దిరుగనిండు' అని చెప్పుచుండిరి. ఈ విషయమున దేవేంద్రుఁడు విజయమును పొందుచుండెను. కాని యీకార్యమునం దాతనికిఁ బ్రత్యేకార్థముగలదు.

దేవేంద్రుఁడుగోవిందపురమునుండి తరిగివచ్చినపిమ్మటఁ దన కృత్రిమవేషమును జాలించి నిజస్వరూపమును దాల్చి వేరొకగదిలోఁ గూర్చుండెను. ఒకభృత్యుఁడు శ్రమనివారిణియగు 'హుక్కా' నాతు త్తపఱచి తెచ్చి యాతనిసన్నిధి నుంచెను. దేవేంద్రుఁడు కొంతసేపు శ్రమహారిణియైనహొగాకుదేవిని సేవించెను. ఆమహాదేవీప్రసాదసుఖము నెవరనుభవింపఁజాలరో వారు మానవనామమున కర్హులు కారు. హేసర్వజనచిత్తరంజనకారిణి! ఓవిశ్వమోహిని! నీయందు నాకుఁగ లభక్తిని చలింపకుండఁ జేయుము. నీ వాహనమైన హుక్కా, గుడిగుడి, మున్నగు దేవకన్యకలను సర్వదా నానయనపథమున బ్రకాశించుచుండనిమ్ము. వానిసందర్శనమబ్బినంతమాత్రముననె నాకుస్వర్గసుఖలాభ మబ్బినట్లుండును. హేహుక్కా! హే గుడిగుడి! హేకుండలీకృతధూమరాశిసముద్గారిణి! హేఫణిసన్నిభదీర్ఘనాళసంసర్పిణి! హే

రజతమయ కిరీటాలంకృత శిరోభాగసుశోభిని! నీకిరీటమునుండి తూగాడుజాలుగల ఝుళఝుళకాంతు లెంతమనోహరముగానున్నవి! నీశృంఖలాంగుళీయములచే నలంకృతమైన వక్త్రాగ్రభాగముగల ముఖనాళశోభారాశియు నెట్లుండెను! త్వదీయగర్భస్థశీతలజలరాశీ సముద్భూతగంభీరనినద మెంతశ్రావ్యముగనుండెను! హే విశ్వజనశ్రమహారిణీ! నీవు అలసజనులను బ్రతిపాలించుదానవు. నీవుకులకాంతచే భజింపఁబడినజనులకు చిత్తవికారహారిణివి. నీవు ప్రభుభీతిగల జనులకు సాహసప్రదాయినివి. హే, దేవీ! నీమహిమను దెలిసికొనఁ జాలనినరులకు దుఃఖమే ప్రాప్తించును. నీవు శోకప్రాప్తులగుజనులకు బ్రబోధమును గలిగింతువు. నీవు భయప్రాప్తులగుజనులకు ధైర్యము నొసఁగుదువు. నీవు బుద్ధిభ్రష్టులైనజనులకు బుద్ధిని ప్రసాదింతువు. కోపపరవశులైన నరులకు శాంతిప్రదానమును జేయుదువు. హేవరద! హే, సర్వసుఖప్రదాయిని! నీవు మాగృహములలో నక్షయముగాఁ బ్రకాశించుచుండుము. నీమాధుర్యయుతమైన సుగంధమును గ్రమముగా నభివృద్ధనొందుఁగాక! నీగర్భమందున్న జలకల్లోలమునందు మేఘగర్జనవలె ధ్వనియగుచుండుగాక! నీముఖనాళము ,నాయోష్ఠములనుక్షణకాలమైనను విడువకుండుఁగాక!

భోగాసక్తుఁడయిన దేవేంద్రుఁ డామహాదేవీ ప్రసాదమును సేవించెను. దానితోఁ బరితృప్తినొందక మఱియొక మహాశక్తిని సేవించుటకు నారంభించెను. సేవకునిహస్తమున తృణపటావృతమైన కాచపాత్రమునుండి వాహిని యావిర్భవించెను. విమలశ్వేతవర్ణవిరాజితంబును, సువిస్తృతంబునగుశయ్యపై రజతానుకృతాసనమున సంధ్యాగగనమును వెలిఁగింపుచున్నరక్తాంబుదంబునకుసమానంబగు వర్ణముగలయాద్రవమయియగుమహాదేవి డికాంటరను నాసురఘటమునసంస్థాపితయయ్యెను కట్టుగ్లాసు పూజకుస్ఫటిక పాత్రవిశేషము

ప్లేటెడ్డుజగ్గు పూజకు తామ్రఘటము. పాకశాలనుండి యొకకృష్ణకాయుఁడు వేడినీళ్ళపళ్లెమను పాత్రయందు 'గోస్టుమట్టన్' మరియు కట్లెట్సు' అనుపేరుగల మాంసాహారమును దీసికొనివచ్చెను. పిమ్మట దేవేంద్రుఁడు దేవీపూజ కాసీనుఁడయ్యెను సితారు. తబలా మున్నగు నుపకరణములతో గాయకులువచ్చి పూజావశ్యకమైన వాద్యోత్సవమును గావించిరి.

తుదకు దేవేంద్రుని సమవయస్కుఁడగు సుందరపురుషుఁడు వచ్చి యాతని చెంతఁ గూర్చుండెను. ఇతఁడాతనిపినతండ్రికుమారుఁడు. సురేంద్రునిగుణములన్నియు దేవేంద్రునిగుణములకు విపరీతమైనవి. స్వభావసిద్ధమైన యాతనిసద్గుణములను జూచి దేవేంద్రుఁ డాతని యెడఁ జాలనాదరముఁ గలిగియుండెను.

దేవేంద్రుఁడు సురేంద్రునివచనములను దక్క మఱియెవ్వరి పలుకులను వినఁడు సురేంద్రుఁడు నిత్యము రాత్రియొకసారి దేవేంద్రుని క్షేమము దెలిసికొని పోవుచుండును. కాని మద్యాదిహేయ పదార్థములకు జడిసి విశేషకాలమచ్చట నుండఁజాలఁడు. అందఱు వెడలిపోయిన పిమ్మట సురేంద్రుఁడు దేవేంద్రునితో "నీశరీరములో నెట్లున్నది ?" అనియడిగెను.

దేవేంద్ర—శరీరంవ్యాధిమందిరమ్.

సురేంద్ర—ఇపుడు జ్వరమువచ్చినదా ?

దేవేంద్ర—లేదు.

సురేంద్ర—యకృద్వ్యాధి యెట్లున్నది ?

దేవేంద్ర—యథాప్రకారమే.

సురేంద్ర—అట్లయినచో నేలవానినివిడిచి పెట్టరాదు ?

దేవేంద్ర—దేనిని ? మద్యపానమా ? దానినిగురించియెన్ని తడవలు చెప్పను ? అదినాజన్మముతోఁ గూడనుండునదియే.

సురేంద్ర—విడిచిపెట్టకూడదా? అది దేహధారణమున కావశ్యకము కాదు. అనేకులు విడిచియుండిరి. నీవునట్లేల చేయఁగూడదు ?

దేవేంద్ర—నేనేసుఖమునకై దానిని విడువవలయును? దాని నిత్యజించువారు మఱియొకసుఖము నపేక్షించి విడిచెదరు. నాకుమఱియొకసుఖమేమియు లేదు.

సురేంద్ర—నీప్రాణరక్షణకొఱకై నను విడువుము.

దేవేంద్ర—బ్రదికి యెవరు సుఖపడగోరుదురో వారు మద్యమును విడువవలయును. నేను బ్రదుకుటవలనలాభమేమి ?

సురేంద్రునికన్నులశ్రుపూరితములయ్యెను. స్నేహపరిపూర్ణతచే "నేను చెప్పుచున్నాను గనుక విడువుము" అనియెను.

దేవేంద్రుని కన్నులనుండియు నశ్రుబిందువులుజారెను. నన్ను సన్మార్గమందుండుమని చెప్పెడువారు నీవుతక్క మఱియెవ్వరు నాకుఁ గనపడలేదు. నేను విడువవలసినయెడల నీకొఱకు విడువవలయును. మఱియు—

సురేంద్ర—మఱియేమి ?

దేవేంద్ర—నాభార్య మృతిఁజెందిన సమాచారమును నాచెవులతో వినినచో మద్యమును విడిచివైతును. లేనిచో నేను బ్రదికియున్నను, చచ్చిపోయినను నొకటె.

సురేంద్రుఁడు కన్నులనిరునించుచు మనస్సునందు హైమవతిని శపియించుచుఁ దనగృహమునకుఁ బోయెను.

---

## పదునొకండవ ప్రకరణము

### సూర్యముఖి జాబు.

ప్రాణాధికయైన శ్రీమతికమలామణిదాసి చిరాయుష్మతికి—

నీకిఁకముందాశీర్వాదపూర్వకముగా లేఖను వ్రాయుటకు నాకు సిగ్గగుచున్నది. నీవిపుడు వయోవతివి, గృహయజమానురాలవునైతివి. అయినను నిన్ను నాసోదరివలె భావింతునుగాని వేరుగా భావింపఁజాలను. నేను నిన్ను బాల్యమునుండి పెంచి పెద్దదానిని జేసితిని. నీకక్షరములు నేనె నేర్పితిని. కానియిపుడు, ముక్తాఫలములం బోలిన నీయక్షరములను జూచినపిమ్మట నాకాకలిపితో నీకు జాబు వ్రాయుటకు నాకు సిగ్గగుచున్నది. సిగ్గుఁజెందుటవలన నేమిప్రయోజనము? నాకాలము చెల్లిపోయినది. అట్లుగాకున్న నాకీదశ యేలపట్టవలెను?

ఏదశ?—అది యెవరికిని జెప్పఁగూడదు. చెప్పితినేని దుఃఖమయముగానుండును. సిగ్గు, సిగ్గు, యేమనిచెప్పను? అయినను నాహృదయభారమును నెవరికడనైన వెల్లడించుకొనినగాని సహించుకొనియుండుట చాల దుస్తరము. మఱియెవ్వరితోఁ జెప్పుకొందును? నీవు నాప్రాణముకంటె నధికురాలవు. నీవుదక్క మఱియెవ్వరును నాపైఁ బ్రేమ కలవారులేరు. అదిగాక యిది నీసోదరు విషయముఁగూడనైయుండెను. నీకుఁదప్ప మఱియెవ్వరికిని చెప్పఁజాలను.

“నాచితిని నేనే స్వయముగా సిద్ధపరచుకొని సట్లయ్యెను. కుందనందిని యన్నము లేక చచ్చినయెడల నాకేమయిన లోపముకలుగునా? లోకమునకంతకు నాధారుడైయున్న దేవుఁడామెకాధారుఁడుగాకుండునా? నావినాశముకొఱకు నేనామె నింటిలోఁ బెట్టుకొంటిని. అట్లేల జేసితినో యిప్పుడేమి చెప్పుదును.? నీవాహతభాగినిని జూచినప్పు

డామెపసి బాలికగానుండెను. ఇపుడామెకుఁ బదునేడు పదునెనిమిది వత్సరములుండును. ఆమె సుందరియే యగును. దానికేమియు నాక్షేపణలేదు. ఆసౌందర్యమే నావినాశనమునకు కారణమయ్యెను. ఈపృథ్విపై నాకు సౌఖ్యమనునది యుండునేని నది నాస్వామియందె. ఈలోకమున దేనికయిన చింతింపవలసియుండునేని యది నాభర్తకొఱకె. ఈపుడమిపై నాకేమయిన ధనమున్నయెడల నది నానాథుఁడె. ఇట్టి నాప్రాణాధికుఁడగు నాహృదయేశ్వరుని కుందనందిని యపహరించుకొని పోయెను. ఇహలోకమున నేనపేక్షించునది యేమయిన నున్నయెడల నది నాప్రాణేశ్వరుని యమూల్యమైనప్రేమయె. నానాథుని ప్రేమవిశ్వాసములనుండి కుందనందిని నన్ను వంచించుచున్నది. నీసోదరుని నీవు నిందింపవలదు. నేను వారిని నిందించుటలేదు. వారు ధర్మాత్ములు. వారివిరోధులైనను వారియందు దోషారోపణమును జేయఁజాలరు. వారు నిత్యము హృదయమును స్వాధీనముఁజేసికొన బ్రయత్నించుచుండిరి. కుందనందిని వారిదృష్టిపథమునఁబడుట తటస్థించినపుడెల్ల వారందుండి సాధ్యమైనంతవఱకు తమదృష్టులను మరలించుకొనుచునేయుండిరి. అధికావసరముండిననేగాని వారామెపేరుచ్చరింపరు, ఒక్కొక్కసారియామె నతిక్రూరముగాఁగూడఁ జూచుచుందురు. ఆమెవలన దప్పులేనప్పుడుఁగూడ వారామెను నిందించుట నేనెఱుఁగుదును. అట్లయినచో నేనీపిచ్చివ్రాఁత నేల వ్రాయవలయును? ఎవరయిననిట్లు ప్రశ్నించినచో వారికి తృప్తికరముగాఁ బ్రత్యుత్తరమొసగుటఁచాల కష్టమే. కాని నీవాఁడుదానవగుట వలన దానినంతయునిమిషములో గ్రహింపఁగలవు. వారిహృదయమున కుందనందినిని సామాన్యస్త్రీలవలెనె భావించినచో నామెనుజూడకుండుటకాయన కంత ప్రయత్నమెందులకు? ఆమెపేరుచ్చరింపకుండుటకు కన్నిపాట్లుపడనేల? కుందనందినియెడల వారుమనసా యపరాధు లగుటవల

ననే యకారణముగా నామెనువారు నిందించిరి. ఆకోపమామెపైఁ గోపముకాదు. అదితమపైఁ దమకుఁగలకోపమే. ఆమెను నిందించుట లేదు. తమ్మును దామే నిందించుకొనుచుండిరి. ఇది నేను గ్రహించితిని! ఇంతకాలమునుండి యనన్యవ్రతనై నాహృదయమును వారి కర్పణముఁ జేసికొని యంతర్బహిర్లోకములరెంటిలోను కనుగొనుచున్న నేను వారిపీడను జూచి నంతమాత్రముననె వారిమానసిక సంకల్పములను గ్రహింపలేకపోవుదునా? నాకు దెలియకుండ వారేమి దాపగలరు? వారప్పుడప్పుడన్యమనస్కులై కన్నులనటునిటుఁ ద్రిప్పుచుఁ జూచుచుందురు. ఎవరినిజూచుటకో నాకుఁదెలియద్దు? దానిని జూచితిరేని కడుంగడు కష్టముతోఁ దమనేత్రములను మరలించుకొనుచుందురు. నేనంతమాత్రము గ్రహింపలేకపోవుదునా? భోజనసమయమున నెవరికంఠస్వరము వినుటకో గాని చేతితో గలుపుకొనిన కబళమునోటిలోఁబెట్టికొనక నిరీక్షించు చుందురు? అప్పుడుకుందమాటపడి చెవిసోకినంతనె వారతిశీఘ్రముగా భోజనమును ముగింతురు. అదియెవరికి తెలియదు? నాప్రాణాధికుఁ డెప్పుడును. ప్రసన్నవదనుఁడై యుండెడువాఁడు నేఁడట్లన్యమనస్కుఁడై యుండనేల? ఎవరైనవచ్చివారితో మాట్లాడినప్పుడది వారిచెవికెక్కుటలేదు. అప్పుడప్పుడసంబద్ధమైన ప్రత్యుత్తరములనుగూడ నిచ్చుచుండెను. నేనెప్పుడైనను కోపపరావశురాలనై "నేప్రాణత్యాగమును జేసికొందునా?" అని యడిగినచో నన్యమనస్కులై "చేసికొనుము" అని చెప్పుదురు. "అట్లన్యమనస్కులై యుంటిరేల" యని యడిగినప్పుడు వారు "న్యాయస్థానములోని వాదములను గూర్చి" యోచించుచుంటిని" అని చెప్పుదురు. కాని వారిహృదయమున నెక్కడను నవకాశము లేదు. వారు వాదముల విషయమై మాటాడినప్పుడెల్ల నతిసంతోషపూర్వకముగనే మాటాడుదురు. మఱియొకవిశేష

విషయమేమనగా—ఇరుగు పొరుగు వృద్ధస్త్రీలు కుందనుగూర్చి ప్రసంగించుకొనుచు నామె బాల్యవైధవ్యము, అనాథత్వమునున్నగువాని గూర్చి జాలిగా జెప్పుకొను నపుడు మీయన్నగారు కొండొకకార్యార్థమై యచ్చటికేగిరి. నేను చాటుననిలిచియుండి చూచితిని. వారి నేత్రములశ్రుపూరితములై యుండెను. తోడనే తాచోటువిడిచి వెడలిపోయిరి దానికేమియు నర్థము లేకుండునా? ఈనడుమ నేనొక క్రొత్తదాసినుంచితిని. దానిపేరు కుముద. యజమానులును దానిని కుముదయనియే పిలుచుచుండిరి. తఱుచుగానిపుడు "కుముద" యని పిలుచుటకు బదులుపొరబడి "కుంద" యని పిలుచుచు నావెంటనే యప్రతిభులగుచుందురు. అట్లప్రతిభులై యుండుటేలకో? నావిషయమై వారుదాసీనభావమువహించి యుండిరో యనాదరభావమును గలిగి యుండిరో ప్రేమవిశ్వాసశూన్యులై యుండిరో నేనుచెప్పఁజాలను. పూర్వముకంటె వారిపుడునాపై నెక్కుడుగ నాదరమును ప్రేమమును జూపుచుండిరి. ఇందులకు కారణము నేను పూర్ణముగా గ్రహించితిని. నావిషయమున తామపరాధ మొనర్చుచుంటిమని వారు బాగుగా దెలిసికొని యుండిరి. అయినను వారికినామీద మనసు లేదని నేనెఱుఁగుదును. ఆదరణకును, ఆంతరంగికప్రేమకును జాల భేదము కలదు. ఆభేదము స్త్రీలమగు మనము సులభముగా గ్రహింపగలుగుదుము.

మఱియొక వినోదకరమైనసంగతి కలదు—కలకత్తాలో ఈశ్వరచంద్రవిద్యాసాగరులనునొకమహావిద్వాంసుఁడువితంతూద్వాహములనుగూర్చి యొకగ్రంథమును బ్రకటించియుండెను. స్త్రీపునర్వివాహము లాచరణీయములని స్థిరీకరించునాతఁడె పండితుఁడైనచో మఱి మూర్ఖుడెవడు? బ్రాహ్మణభట్టాచార్యులాగ్రంథము బైఠఖానాకును దెచ్చినపుడు దానినిగూర్చి విశేషముగా తర్కవితర్కములు జరగి

యుండెను. ఒక దినమున 'న్యాయకచాకచి'యను బిరుదమును వహించిన పండితుఁ డొకఁడు—సాహిత్యరసస్వతీవరపుత్రుఁడు—వచ్చి విధవావివాహములు శాస్త్రసమ్మతములె యని చెప్పి సంస్కృత పాఠశాలాభవనము బాగుచేయుటకని మీ యన్నగారియొద్ద పది రూపాయలను బట్టుకొనిపోయెను. ఆ మరుచటిదినమున సార్వభౌమ భట్టాచార్యులు వచ్చి విధవావివాహము లశాస్త్రీయము లనియు ననాచారములనియు శాస్త్రనిదర్శనములం జూపుచు మూఁడుగంటల సేపు కంఠశోషగా వాదించెనుగాని యాతని కొక కాసైనను చిక్కలేదు. నేను చాల విచారించి యాతని కూఁతునికొఱకు స్వర్ణవికారమైన మణిబంధములను జేయించి యిచ్చితిని. అది మొదలుకొని విధవావివాహపక్షపాతు లగు పండితు లెవరును రాలేదు.

నాదుఃఖములను వ్రాయుచు నీకు విసుగుపుట్టునటులఁ జేసితిని. నీవు చాల విసుగుఁజెందుదువని నే నెఱుఁగుదును. కాని యేమిచేయుదును? నాకష్టములు నీతోఁ జెప్పికొనక మరియెవ్వరితోఁ జెప్పుకొందును? నేనింకను పూర్ణముగాఁ జెప్పనేలేదు. నీవలన నాదుఃఖము కొంతైనను తీరునని చాల నాసతో నుంటిని. ఇది యెవరికడను వెలిపుచ్చకుము. అన్నగారికైనను నీజాబు గనపరుపకుము. నీవు నన్ను జూచుటకొక సారి రావా? ఒక్కసారి వచ్చి పొమ్ము. నీవిపుడు వచ్చినయెడల నిన్నుఁ జూచినతోడనే నాకు దుఃఖనివారణ కాఁగలదు. చిరంజీవి బాలుని క్షేమమును, మాయన్నగారి క్షేమమును శీఘ్రముగా వ్రాసి పంపుము.

'సూర్యముఖి'

మఱియొకమాట—ఈ బాలిక వదలిపోయినయెడన నాకు మరల సుఖము దొరకును. కాని అది పోవుటెట్లు? నీవు దానిని దీసికొని పోయెదవా? భయపడెదవా?

కమలమణి ప్రత్యుత్తరము —

నీవు పిచ్చిదానవు. లేనిచో నీభర్తయెడల నీకట్టి యవిశ్వాస మెట్లు కలుగును? ఆతనియందు విశ్వాసమును వదలకుము. నీవు నిజముగా నాతని విశ్వసింపనియెడల నొక గొప్ప బావిని జూచికొని దానిలో నురుకుట మేలు. కమలమణినైన నేను నిశ్చయముగాఁ జెప్పునది యేమందువేని — నీవు నూతఁబడి ప్రాణము విడుచుట మంచిది. పతిని నమ్మని యాఁడుదానికి మరణమే మంగళకరము.

---

## పండ్రెండవ ప్రకరణము

## అంకురము

కొలదికాలములోనే నగేంద్రుని ప్రకృతియంతయు మారిపోయెను. శరత్కాలమునైతము నొక్కొక్కసారి నిర్మలాకాశమున నాకస్మికముగా మేఘోదయమగునటుల నగేంద్రుని నిర్మలాంతరంగము మేఘావృతమై పోయెను. దానికై సూర్యముఖి తనలోఁదానే కడుదుఃఖించుచుండెను.

ఆమె తనహృదయమున నిట్లు తలపోయ దొడఁగెను.— కమలమణి చెప్పినచొప్పునఁ జేసెదనుగాక! హృదయేశ్వరుని యాంతరంగికవృత్తిగూర్చి నేను సందేహపడనేల? వారిహృదయము పర్వతమువలె నిశ్చలమైనది. నేనె భ్రాంతినొందియుంటిని. బహుశః వారు శరీరారోగ్యము చెడి యట్లు బాధపడుచుందురు.' అయ్యో! పాపము సూర్యముఖి యిసుకతో వారధిఁగట్టుచున్నది.

ఆగృహముననే యొకపాఠశాలయుఁ గలదు. గృహయజమానురాలగు సూర్యముఖి తెరమఱుంగుననుండి పరులతో సంభాషించు

సాచారముగలదు, ఆయాచారముచొప్పుననామె తెరమఱుంగున గూర్చుండి వైద్యుని రావించి దాసిసహాయమున నావైద్యునితో నిట్లు చెప్పెను.—'యజమానులు దేహారోగ్యముచెడియున్నట్టు కనం బడుచుండిరి. వారికి నౌషధము నేల యీయరు?

వైద్యు—వారు జబ్బుగానుండిరా? నాకు తెలియదు. నాతో నెవ్వరును జెప్పలేదు.

సూర్య—యజమానులు సెలవీయలేదా?

వైద్యు—లేదు. ఏమిజబ్బు?

సూర్య—ఏమిజబ్బా? మీరు వైద్యులైయుండి మీకుం దెలియకున్న నాకుం దెలియునా?

వైద్యుండందులకు సరియైనప్రత్యుత్తరమును జెప్పలేక 'పోయి కనుగొనెదము' అని చెప్పి వెడలిపోవుచుండెను. అంత సూర్యముఖి యాతని మరల రావించి 'యజమానుల నడుగవలదు. ఏదైననౌషధము నీయుండు' అనియెను.

వైద్యుండు తనమనంబున 'ఇది యొకచిత్రమైనచికిత్స' యని యనుకొని యాజ్ఞానుసారముగా నౌషధము నంపెదనని చెప్పి వెడలి పోయెను. ఔషధశాలలో నౌషధములకు లోపమేమియు లేదు. వైద్యుడచ్చటికిఁబోయి కొంచెము సోడా కొంచెము పోర్టువైను సిరపుఫెర్రి మూరటిసు యీమూడును నీటితోఁజేర్చి యొకగాజుబుడ్డిలోఁబోసి దానిపై "నిత్యము రెండుసార్లు లోపలికిఁ బుచ్చుకొనవలెను" అని వ్రాసినచీటినంటించి పంపించెను. సూర్యముఖి యాయౌషధము నందికొని భర్తకొసఁగుటకై పోయెను. నగేంద్రుఁడాసీసాను బుచ్చుకొని యాదారిని బోవుచున్నపిల్లిపై విసరివేసెను. పిల్లిపారిపోయెను; ఆగాజుసీసా చెక్కలైపోయెను, ఆపిల్లితోఁకయు నాయౌషధములో దాగిపోయెను.

సూర్యముఖి "మీ శాపథమునుబుచ్చుకొనకపోయినను మీశరీరములోని యస్వస్థతనైనను దెలుపరాదా?" యనియెను.

నగేంద్రుఁడు విసుగుకొనుచు 'నాకేమియస్వస్థత!" అనియెను.

సూర్యముఖి "మీశరీరమును చూచికొనుఁడు. ఎంతచిక్కిపోయియుంటిరో!" అనిచెప్పి యొకయద్దమునుదీసికొనివచ్చి నగేంద్రుని యెదుటఁ బెట్టెను.

నగేంద్రుఁ డాయద్దమును దీసికొని నేలపై వేసికొట్టి ముక్కలు ముక్కలుగఁ జేసెను.

సూర్యముఖి కంట తడిపెట్టుకొనెను. కోపముతోఁ జూచుచు నగేంద్రుఁడు వెడలిపోయి యావలగదిలోనున్న నిర్దోషియైన సేవకుని గొట్టెను. సూర్యముఖి యాప్రహారణము తనకుఁ దగిలినట్లే భావించుకొనెను.

ఇంతకుపూర్వము నగేంద్రుఁడు మృదుస్వభావముగలవాఁడై యుండెడి వాఁడు. ఇప్పుడన్ననో యాతనికి మాటమాటకుఁ గోపమే!

కేవలము కోపముతో సరిపోవుటలేదు. ఒకనాఁటిరాత్రి భోజన సమయము మించిపోయినను నగేంద్రుఁ డంతఃపురమునకు రాలేదు. సూర్యముఖి యాతనికొఱకు వేచికొని కూర్చుండెను. ఎట్టకేలకాతఁడు వచ్చుసరి కాతనిఁజూచి యామె విస్మితురాలయ్యెను. ఆతనిముఖమును, నేత్రములు నారక్తములై యుండెను—ఆతఁడు పూర్ణముగా మద్యపానమును జేసియుండెను—ఇదివఱకెన్నఁడిట్లు దుర్వ్యసనాసక్తుఁడై యుండలేదు. అదిచూచి సూర్యముఖిహృదయము కొట్టుకొనసాగెను. అదిమొదలుకొని యాతఁడు దానిని నిత్యము సేవించుచుండెను. ఒకదినమున సూర్యముఖి యాతనిపాదములపైఁబడి కన్నీరు విడుచుచు నతివినయముతో "నాకొఱకైనను దానిని విడువవలయును" అని యెంతో వేఁడుకొనియెను.

నగేంద్రుఁ డతితీవ్రముతో "దానివలన దోషమేమి ?" అని యడిగెను.

ఆప్రశ్నలోనే దానికిప్రత్యుత్తరము నిమిడియుండెను. అయినను సూర్యముఖి "మీకు దోషము లేదని తెలిసినపిమ్మట నేనేమి చెప్పఁగలను? నాకొఱకైనను దానిని పరిత్యజింపవలెనని వినయపూర్వకముగా మిమ్ములను బ్రార్థించుచున్నదానను." అనియెను.

నగేంద్రుఁడు "సూర్యముఖి ! నేను త్రాగుబోతును. త్రాగుబోతున కాత్మార్పణము గావించుకొనుట యుచితమని తోఁచినయెడల నాకట్లు గావింపుము. లేనిచో నావశ్యకము లేదు." అనియెను.

సూర్యముఖి దుఃఖమును నాపికొనలేక యచ్చోటువిడిచి వెడలిపోయెను. నగేంద్రుఁ డాకన్నీటిని చూచినచో నాతఁడు పోయి సేవకులను శిక్షించునని యామె యాతనిసన్నిధిని కంటతడివెట్టలేదు.

ఆతరుణమున నె దివానునగరునకువచ్చి యజమానురాలైన సూర్యముఖికి "ఆస్థానమంతయుఁ బాడగుచున్నది. ఆదాయము సరిగా వచ్చుటలేదు. ఇఁకను పాడగును" అని వర్తమానముచేసెను.

సూర్యముఖి "ఏమికారణమని" యడిగెను.

ఉత్తరము "యజమానులు వ్యవహారమును చూచుకొనుట లేదు. ఆస్థానములోనియుద్యోగియులు తమయిచ్చవచ్చినరీతిని పని చేయుచుండిరి. యజమాను లజాగ్రతగానుండుటచే నెవ్వరును నామాట లెక్కగొనకుండిరి."

సూర్యముఖి "యజమానులు చక్కగాచూచి వ్యవహరించుకొందురా యాస్థానమునిలుచును. లేనిచో నశించిపోవును. మనమేమిచేయఁగలము. నాయాత్మధనమును (తనభర్త) కాపాడుకొనిన నంతియేచాలును" అనియెను.

నగేంద్రుఁడు మొదట తనజమీావ్యవహారము నంతను చక్కగా స్వయముగాఁ జూచుకొనుచుండెడివాఁడు.

ఒకదినమున వందలకొలది రయితులు ఆస్థానమునకు వచ్చి ముకుళితహస్తులయి 'న్యాయము దయచేయుఁడు. మహాప్రభూ! న్యాయాధికారియు, లేఖరియు పెట్టుబాధలకు మేము బ్రదుకలేము. మా చెంత నొక కాసైనను నిలువనిచ్చుటలేదు. దేవరవారు మమ్ము లను శిక్షించినచో మేమెవరిసన్నిధిని మొఱపెట్టుకొనుదుము!' అని విన్నవించుకొనిరి.

నగేంద్రుఁడు వారినందరిని వెళ్ళఁగొట్టుమని యాజ్ఞ చేసెను.

ఇంతకుపూర్వ మొకలేఖరియొకరైతును గొట్టి వానినుండి యొకరూకను లంచముదీసికొనెను. అప్పుడు నగేంద్రుఁడా లేఖరి వేతనము నుండి పదిరూపాయిలను త్రుంచి యాధనమును రయితు కొసఁగెను.

నగేంద్రునిమిత్రుఁడగు హరదేవఘోషాలని కొక లేఖను వ్రాసి పంపెను—'నీవెట్లుంటివి? నీవేమిచేయుచుంటివో నాకుఁ దెలియకు న్నది. నీయుత్తరమే అపరూపమైనది. వ్రాయుటమానుకొంటివి. ఒక వేళవ్రాసినను నర్థములేని యొకటిరెండువాక్యములు వ్రాసి విడుచు చుంటివి. నాపై నీకాగ్రహమేమైన వచ్చియుండలేదుకదా? అట్లయి నచో నది నాకేల తెలుపరాదు? నీవ్యాజ్యము పోయినదాయేమి? అదిమాత్ర మేల తెలుపఁగూడదు? ఇవేవియు నాకు దెలుపనిష్టము లేనిచో నీక్షేమమునైనను నాకు వ్రాయుము.'

దాని కిట్లు నగేంద్రుఁడు ప్రత్యుత్తరము వ్రాసెను. "నాపైఁ గోపించుకొనకుము. నేనధఃపాతాళమునకుఁ బోవుచుంటిని.

హరదేవుఁడు బహువిజ్ఞాని. నగేంద్రునిజాబుఁ జూచికొని యిట్లు యోచించుకొనియెను "ఇదేమి? ధనవిషయమయిన చింతయో? స్నేహితునితో విరోధమా? దేవేంద్రదత్తునివలె నయ్యేనేమో! ఇదే మియుకాదు, మోహమా?

సూర్యముఖి మరల కమలమణికొక లేఖను వ్రాసెను. దానిలోఁజివరకు వ్రాసినది—"కమలమణీ! నీవొక్కసారిరమ్ము. నీవుదక్క నాకుస్నేహితులులేరు. ఎట్లయిన నొక్కసారివచ్చి చూచిపొమ్ము."

---

## పదమూఁడవ ప్రకరణము

### మహాసమరము

కమలమణి సూర్యముఖి వ్రాసినలేఖను, చదివి చంచలహృదయ యయ్యెను. ఆహృదయభారమును సహించుకొనఁజాలక నిజేశునితో యోచింపవలయునని యామె భావించుకొనెను.

శ్రీశచంద్రుఁడు లోపలిగదిలోఁ గూర్చుండి తనయుద్యోగసంబంధమగు లెక్కలపుస్తకములను జూచుకొనుచుండెను. ఆతనిచెంతను రత్నకంబళముపై నొకసంవత్సరమువయసుగల యాత్మని కుమారుఁడు సతీశచంద్రుఁడనువాఁ డాంగ్లేయవార్తాపత్రికను బుచ్చుకొని యాడుకొనుచుండెను. ఆబాలుడు మొదట నాపత్రికను భక్షణముచేయవలెనని యత్నించి కృతకృత్యుఁడు గానేరక దానిని క్రింద పఱచి దానిపై సుఖాసీనుఁడై యుండెను. కమలమణి నిజనాథుని సమీపించి తనమేలిముసుంగును సవరించుకొని యాతనికి సాష్టాంగనమస్కారముఁ గావించుకొని లేచి ముకుళితహస్తయై "మహారాజా! నాహృదయపూర్వకవందనమిదె యందికొనుఁడు." అనియెను. ఇంతకుపూర్వమె యొకనాటక మాభవనమున ప్రదర్శింపఁబడెను. అది చూచి యీనూతన సంభాషణము నామె నేర్చికొనెను.

శ్రీశచంద్రుఁడు నవ్వుచు నిట్లడిగెను. "గుమ్మడికాయలు హరింపఁబడెనాయేమి?

కమల—గుమ్మడికాయలు కావు. అమూల్యమైనపదార్థమే పోయినది.

శ్రీశ—ఎక్కడ నీ దొంగతనము జరిగినది?

కమల—గోవిందపురమున జరిగినది. నాయన్నగారిసువర్ణపేటికలోని చిల్లిగవ్వ పోయినది?

శ్రీశ—నాకేమియు నర్థమైనదికాదు. మీయన్నగారిసువర్ణపేటికయనగా సూర్యముఖియైయుండును. చిల్లిగవ్వయేది?

కమల—సూర్యముఖిబుద్ధి.

శ్రీశ—అందువలననే జనులు చిల్లిగవ్వలతో నాడుచుందురు. సూర్యముఖి యాచిల్లిగవ్వలాటమూలముననే నీసోదరుని దనవశముఁ జేసికొనినది. నీవింతటికుశాగ్రబుద్ధిగలదానవైనను—

ఆవాక్యము పూర్తిగాకుండగనే కమలమణి శ్రీశచంద్రునికంఠమును గౌఁగిలించుకొనెను.

శ్రీశచంద్రుఁ డామెకౌగిలింతను విడిపించుకొని "ఆచిల్లిగవ్వను హరించినవారెవరు?" అని యడిగెను.

కమల—అదేమియు నాకుఁ దెలియదు. కాని యామెజాబును బట్టిచూడఁగా చిల్లిగవ్వపోయినట్లే కనబడుచుండెను. లేకున్నట్లు స్త్రీ వ్రాయఁగలదా?

శ్రీశ—ఆలేఖను నేను చదువవచ్చునా?

కమలమణి యాలేఖను నిశేశునిహస్తమున నునిచి "సూర్యముఖి యీవృత్తాంతమును దమకుఁ దెలుపఁగూడదని వ్రాసినది. అయినను దమకుఁ దెలుపక నాప్రాణములు నిలుచుటెట్లు? మీరాలేఖను జదువకున్న నాకు భోజనము సహింపదు. నాకన్నులకు నిద్దుర రానేరదు. నిజముగా నాకు బుద్ధిభ్రమణముఁగూడ కలుగును." అనియెను.

శ్రీశచంద్రుఁ డాజాబు చేతిలోనుంచికొని "దీనిని జూడఁగూడదని

నిషేధించినయెడల నేను చదువ నేచదువను. అందలియంశములను గూడ నేను విననొల్లను. కర్తవ్యమేమో దెలుపుము'' అనియెను.

కమల— కర్తవ్యమేమందు రేని—సూర్యముఖిబుద్ధి మారింపఁ బడిపోయినది. దానిని పునరుద్ధారణము చేయవలయును. ఆమెకు బుద్ధివాదమును గఱపువారు సతీశుఁడు తక్క మఱియెవ్వరుగలరు? సతీశుఁ డొకసారి గోవిందపురమునకు వచ్చి పోవలయునని యాతని మేనత్త వ్రాసినది.

సతీశుఁ డింతలో నచ్చటనున్న పూలసజ్జను పూలతో గ్రుమ్మరించి యంతటితోఁ బోవక మషీరసపాత్రపైఁ గన్నువేసి చూచుచుండెను. ఆబాలుని గనిపెట్టిచూచుచు శ్రీశచంద్రుఁడు ''సరే. అందులకుఁ దగినవాఁడె యతఁడు; తెలిసినది. ఆతనిమేనత్తగారి యొద్దనుండి యాతనికి గోవిందపురము రమ్మని యాహ్వానపత్రిక వచ్చినది. ఆతఁడు వెళ్లినచో నాతనితల్లికూడ నాతనితోఁ బోవలయునుగదా! సూర్యముఖిబుద్ధి భ్రమసిపోయే యుండవలెను. లేనిచో నామె యట్లేలవ్రాయును?'' అనియెను.

కమల— కేవలము సతీశునికొక్కని కే యాహ్వానము రాలేదు తమకును, నాకును, నందఱికినివచ్చినది.

శ్రీశ—నాకెందుల కాహ్వానము?

కమల— నేనొక్కతెనె పోవు టెట్లు? వస్తుసామగ్రులను జూచుకొనువా రెవరు?

శ్రీశ—సూర్యముఖి తమ యింటియల్లుని సామానులను గాచికొనియుండుటకే రమ్మని వ్రాసినచో నది కేవల మన్యాయము. ఆకార్యమునకుఁ గావలసినయెడల రెండుదినములకు మాత్రము వేఱొక యల్లుని సంపాదించి పంపెదను.

కమలమణి యది విని కోపపరవశురాలై ముఖముం జిట్లించి గొణుగుకొనుచు శ్రీశచంద్రుఁడు వ్రాయుచున్న పత్రమును లాగికొని ముక్కలుముక్కలుగఁ జింపివేసెను.

శ్రీశచంద్రుఁడు చిరునవ్వుతో 'చాల మంచిపని చేసితివి కాదా ?' అనియెను.

కమల కృత్రిమకోపముతో 'నాయిష్టము'.

శ్రీశుఁడు ఆస్వరముతోనే 'నాయిష్టమువచ్చినట్లు నేను చెప్పెదను.'

పిమ్మట నిరువురు నన్యోన్యప్రణయకలహమునకు లోనైరి. శ్రీశుఁడు కమలమణికొప్పును విప్పివైచెను. ఆమె యాతని మషీరస పాత్రమందలి మషీరసమును పీకదానులో పారఁబోసెను. కోపావేశ ముఁజెందిన శ్రీశుఁడామె ముఖమండలమును ముద్దువెట్టుకొనెను. కమలమణియుఁ గోపాధికురాలై యాతని నట్లే యొనరిచి పగఁదీర్చి కొనెను. ఇట్లు వారిరువురు కలహావిజయసాధనములగు ముద్దులను నొండొరులపైఁ గురిపించుకొనుచుండ నదిచూచి సతీశుఁడానంద పరవశుఁడై ముద్దు తన యేకాధిపత్యమునకు జేరిన ద్రవ్యమని యెఱిఁగినవాఁడగుటచే నట్టి ద్రవ్యమన్యథా వ్యయమగు చుండుటకు సహింపఁజాలక తన రాజభాగమును భద్రపఱచుకొనుటకై తల్లియగు కమలమణి జానుప్రదేశమును బట్టుకొని నిలువఁబడి జననీజనకుల ముఖకమలములను వీక్షించి నవ్వసాగెను. ఆ బాలకుని నగవు కమల మణిచెవి కెంత మధురముగా వినఁబడుచుండెనో బిడ్డలుగల సతీతిలక ముల కది గోచరమగును. కమలమణి సతీశుని నెత్తికొని లెక్క లేనన్ని తడవులాతని ముఖమండలమును ముద్దుపెట్టుకొనెను. పిమ్మట శ్రీశుఁడామె చెంతనుండి యాబాలుని తానుదీసికొని యదేవిధముగాఁ దానుఁగూడ ముద్దువెట్టుకొనెను. సతీశుఁడు తన రాజభాగమును దీసి

కొనినపిమ్మట దిగివచ్చి తండ్రిగారి సువర్ణవికారమగు పెన్సిలును జూచి దాని నపహరించికొని పోవుటకై పరుగెత్తెను. దానిని సంగ్రహించుకొని భోజ్యపదార్థ మను తలంపుతో దానిని నోటిలో నుంచుకొని నమలుటకు సిద్ధపడెను.

కురుక్షేత్రమున జరగిన భారతయుద్ధమందు భగదత్తుఁడు నర్జునుఁడు నొండొరులం దవిలి పోరాడుసమయమున భగదత్తుఁ డర్జునునిపై ననివార్యమైన మహావైష్ణవాస్త్రమును బ్రయోగించెను. శ్రీకృష్ణుఁ డర్జునున కాయస్త్రమును నివారించుటకుం దగిన సామర్థ్యంబు లేదని గ్రహించి దాని కభిముఖముగాఁ దాను నిలిచి దాని వేగమును శమింపఁజేసెను. అట్లే కమలమణికిని శ్రీశచంద్రునకును జరిగిన మహాసమరమున నొండొరులపైఁ బ్రయోగించుకొనిన మహాస్త్రములనన్నిటిని సతీశుఁడు తన వదనమండలమునం గ్రహించి యాపోరాటమును మాన్పెను. కాని వారి సంధివిగ్రహములు వర్షాకాలపు చినుకులవలె నప్పుడప్పుడు నడుచుచు నిలుచుచుండెను.

శ్రీశ—అట్లయినచో నీవు నిశ్చయముగాఁ గోవిందపురము నకుఁ బోయెదవా ? నేనొంటరిగా నెట్లుందును ?

కమల—నేనొక్కతెనె పోయెదనా ? నేనుఁ బోయెదను, మీరును రావలెను. రేపు పెందలకడలేచి కచ్చేరికివెళ్ళి యక్కడ నన్నియు జాగ్రత్తపఱచి పోవుటకు సంసిద్ధులై రావలయును. మీరు రాక యాలసించినయెడల నేనొకవైపునను, సతీశుఁడొకవైపునను గూర్చుండి యేడ్చుచుందుము.

శ్రీశ—నే నిప్పుడెట్లు వచ్చెదను. ఇపుడు జనపవిత్తనములు కొనెడు సమయము. నీవొక్కతెవె పొమ్ము.

కమల—సతీశా ! గమ్ము. మనమిరువురము చెఱియొకవైపున నేడ్చుచుఁ గూర్చుందము. ఆదరపూర్వకమైన తల్లికంఠస్వరము చెవిని

బడినంతనె సతీశుఁడు పెన్సిలునుసమలుటమాని యానందముతో కేరుచు తల్లి చెంతకు వచ్చెను. అందువలన కమలమణి యేడ్చుటకు బదులుగా సతీశుని ముద్దు పెట్టుకొనెను. ఈఘనకార్యము ముగిసిన పిమ్మట కమలమణి "ఏమేయాజ్ఞ" యని శ్రీశుని యడిగెను.

శ్రీశు—నీవు వెళ్ళుము. నేనడ్డము చెప్పను. ఇప్పుడు పైరులకు కోతకాలము. నేనిపుడు వచ్చుటకు వీలుకాదు.

అందుపై కమలవాడినముఖమును ద్రిప్పికొని మౌనమువహించి కూర్చుండి యుండెను. మరల నొక్కమాటయైనను బలుకలేదు.

శ్రీశుఁడు ఆమెవెనుకనే వెళ్ళి గలమునందున్న మషీరసముతో నామెక పాలతలమున నొక బొట్టుంచెను.

కమల "నవ్వుచు ప్రాణాధికా! నాయందు నీకెంతయనురాగ మున్నది" యనిచెప్పి తన బాహువల్లరులచేఁ గౌఁగిలించుకొని నిజేశుని ముఖమండలమును ముద్దు పెట్టుకొనెను. ఆసమయమున నామెకపాల తలముననున్న మషీరసపుబొట్టు శ్రీశునిగళప్రదేశమున గుఱుతుపడెను.

ఈవిధముగా యుద్ధములో జయమునొందిన తరువాత కమల మీరువచ్చుటకు వీలుగాకపోయినచో నేనువెళ్లుటకైనను నేర్పాటు చేయుము.

శ్రీశు—నీవుతిరిగి నెప్పుడువత్తువు?

కమల—అడుగు టెందులకు ? మీరు నాతోఁగూడ రానియెడల నేనక్కడ నెంతకాలముందును ?

శ్రీశచంద్రుఁడు కమలమణిని గోవిందపురమునకుపంపించెను. కాని యీసమయమున జనపవిత్తనములవ్యాపారములో శ్రీశచంద్రునకు మంచిలాభము రాలేదని మేము నిశ్చయముగాఁ జెప్పఁగలము. అది శ్రీశచంద్రుని దోషమేయని యావర్తపుసంఘములోని గుమాస్తాలు మాకు గోపనముగాఁ దెలియఁజేసిరి. అతఁడీసమయమున తన

మనసును వ్యాపారమున బ్రవేశపెట్టక యూరక యింటియొద్దఁ గూర్చుండి వ్రేళ్లు లెక్కఁబెట్టుచుండెను. ఈవిషయమును శ్రీశచంద్రుఁ డొకదినమున విని "అట్లేయైయుండవచ్చును. నేనపుడు లక్ష్మినిఁజూసి యుంటిని." అనియెను.

ఈమాట వినినవారలు ముఖము లనుద్రిప్పికొని "ఛీ! ఇతఁ డెంత స్త్రీలోలుఁడు" అనియనుకొనిరి. ఈమాటనువిని శ్రీశచంద్రుఁడు సంతుష్టహృదయుఁడై తనభృత్యుని బిలిచి "ఓరీ! ఆహారాదికము లను బాగుగా సిద్ధపరుపుము. వీరంద రీదినమున నాతో భుజింతురు" అని యాజ్ఞాపించెను.

---

## పదునాల్గవ ప్రకరణము.

కమలమణి గోవిందపురమునకు వచ్చినంతనె యంధకారావృత మైయున్న నగేంద్రునిగృహమున నొకవింతకాంతి యొదవెను. కమల మణి ప్రసన్న వదనసందర్శనమబ్బినంతనె సూర్యముఖ నయనాశ్రు ధారలింకిపోయెను. కమల గృహమున బ్రవేశించిన వెంటనే వదెన గారి తల చిక్కుఁదీయుటకు ప్రారంభించెను. సూర్యముఖ చాలకాల మునుండి తలదువ్వుకొనుటలేదు.

కమల—వదెనా! ఒకటి రెండు పుష్పములను ముడుతునా?

సూర్య—(చెక్కిలి నొక్కుకొని) వలదని చెప్పెను.

అయిన నంతటితో విడువక కమల రెండుపుష్పములను దెచ్చి వదెనగారికొప్పున దుఱిమెను. మఱియు ఇరుగు పొరుగువారు వచ్చిన ప్పుడు "చూచితిరా! యీముదుసలి కొప్పున పువ్వులు ముడిచికొనిన ది!" అని యామె చెప్పెను.

శాంతిమతియైనకమలమణి ముఖకాంతిఁగూడ నగేంద్రునిముఖము నావరించుకొనిన మేఘపటలమును వెలిఁజిమ్మలేకపోయెను. అతఁడామెను జూచినపుడు "కమలా! ఎప్పుడువచ్చితివి?" అనిమాత్ర మడిగెను. కమల తనసోదరునికిఁ బ్రణమిల్లి "యీపాపఁడు నన్ను దీసికొనివచ్చెను" అని లజ్జాన్వితయై చెప్పెను.

"నిజముగానా! ఏడీ యాబండ? రెండు కొట్టెదను" అని చెప్పి నగేంద్రుఁ డాబాలుని యెత్తికొని యాతనితో నొకగంటసేపాడుకొనెను. ఆబాలుఁడును కృతజ్ఞతాసూచకముగా నగేంద్రుని శ్మశ్రులను బట్టి లాగెను.

కమల కుందనందినిని బరిహసించుచు "ఓసీ! కుంది! కుంది! నంది! దుంది! క్షేమముగా నుంటివా?" అని యడిగెను.

కుందనందిని కొంచెము సేపేమియుఁ బలుకక యోచించుకొని పిమ్మట "ఉన్నాను" అనియెను.

కమలమణి "అదేమి? ఉన్నాననిమాత్రము పలికితివి? నన్ను "అక్కా" యనిపిలువ కూడదటే?" అనిచెప్పి "అక్కా" యని పిలువుము. లేనిచో నీవు నిద్రపోవుచున్నప్పుడు నీతలకు చిచ్చు వెట్టి తగులఁబెట్టెదను. లేదా నీశరీరమును కాకులకును గ్రద్దలకు నాహారముగా వేతును.

కుందనందిని—"అట్లేచేయుము అక్కా" యని చెప్పి తదారభ్య యామెను "అక్కా" అని పిలువనారంభించెను.

కుంద కలకత్తాలో కమలమణియొద్దనున్నపు డామెను వావివరుసలతోఁ బిలిచి[illegible]దు. నిజముగా నామెతో నోరువిప్పి యథిముగా మాటాడియెఱుగదు" అయినను కమల మొదటినుండియు క్షేమమయియై యుండుటచేఁ గుందనందిని కామెయెడఁ జాలవిశ్వాసముండెడిది. తరువాత వారొండొరులకు విడిచిపెట్టియున్న యీకొలది

యేండ్లనుండియు నట్టివిశ్వాసమున కొకింతలోపము సంభవించియుండె ను. కాని యిపు డచిరకాలములోనే వారివారి స్వభావసిద్ధమైన గుణ సంపదచే నన్యోన్యపూర్వస్నేహ మభివృద్ధిఁజెంది వారికి మైత్రియధిక మయ్యెను—కొంతకాలముగడచిన పిమ్మట కమలమణ తనయూరుకుఁ బోవలయునని చెప్పెను. సూర్యముఖి ఇప్పుడే పోవలదు. మఱిరెండు దిన ములుండి వెళ్ళవలయును. నీవు వెళ్ళిపోయినచో నేనీభూమిపై నిలు చుటకడు దుస్తరము. నీతో మాటాడునపుడు నామనస్సు పరిపూర్ణా నందమున నోలలాడుచుండును. అని యేమేమొపలికెను. కమల నీకా ర్యమును జక్కఁజేయకుండ నేను పోవుదానను కాను'' అని చెప్పెను.

సూర్యముఖి ''నాకార్యమేమి? అని యడిగెను.

కమల (తనమనస్సులో) నీకంటకనివారణమని యనుకొని (ప్రకాశముగా) నీశ్రాద్ధ మనియెను.

కమల బయలువెడలిపోవునను సమాచారమును విని కుంద నందిని తనగిదిలోఁ బ్రవేశించి యొరులకుఁ దెలియకుండ కన్నీరు మున్నీరుగాఁ బ్రవహింప దుఃఖించుచుఁ బోయెను. ఆమెకుఁ దెలియ కుండ కమల మెల్లగా నచ్చటికి పోయిచూచెను. కుంద తలగడపై మోమునానికొని యేడ్చుచుండెను. కమల యామెచెంతఁజేరి యామె పరుండియుండగనే యామెకురులను చిక్కుఁదీయసాగెను. ఆమెకు తలదువ్వుటయం దధికానక్తి.

కమల యట్లు కురులను చిక్కుదీసి కుందనందినిశిరము నెత్తి తనయూరుభాగంబున నునిచికొని యామెకన్నీరుఁదుడుచుచు ''ఓసీ కుందనందినీ! ఏడ్చెద వేల?'' అని యడిగెను.

కుంద—నీవువెళ్లిపోయెదవని.

కమలమణి కొంచెము నవ్వి ''నీ వెందులకేడ్చెదవు?'' అనియ డిగెను. కమల నవ్వినను నామెకన్నులనుండి కాల్వలైపాఱినయశ్రు

ధారలచే గండభాగములు దొప్పదోగెను. అదియంతయు నెండయు వానయు నేకకాలమున వచ్చినట్లయ్యెను.

కమల—నేను వెళ్ళినచో నీవేల యేడ్వవలెను?

కుంద—నీవు నన్ను ప్రేమించినకారణమున

కమల—మఱియెవ్వరును ప్రేమించుటలేదా?

కుంద మాఱుపలుకక స్తబ్ధురాలై యుండెను.

కమల—ఎవరును ప్రేమించుటలేదా? యజమానియుఁ బ్రేమించుటలేదా? నాయొద్ద నేమియు దాపక సత్యమును చెప్పుము.

కుంద యేమియు బలుకలేదు.

కమల—నాసోదరుఁడైనను ప్రేమఁజూపుటలేదా?

కుంద మౌనిరాలై యుండెను.

కమల—మనమిరువురమే ప్రేమానురాగులమై యుంటిమి. గనుక నీవు నాతో రాఁగూడదా?

కుందమాటాడలేను.

కమల—మనమిరువురము కలసి పోవుదమా?

కుంద—(తలనాడించుచు)—రాలేదు,

అది విన్నతోడనే ప్రఫుల్లమైనకమలమణివదనము గంభీరభావమును దాల్చెను. ఆమె ప్రేమపూర్వకముగా కుందనందిని మస్తకమును తనవక్షమున నిడికొని యామెకుత్తుకనుబట్టుకొని "కుందా! నిజముచెప్పుము." అనియెను.

కుంద—ఏది?

కమల—నేనడిగినదానిని చెప్పుము. నేను నీకు సోదరిని నాయొద్దనేమియు దాపవలదు. నేనెవరికిని చెప్పను.

(మనస్సులో, నొకవేళ చెప్పినచో, రాజమంత్రియైన శ్రీశబాబునకును మఱియు బాలుని కర్ణపుటముననును వారిరువురకుమాత్రమె చెప్పుదాననని యనుకొనెను)

కుంద—ఏమి! చెప్పుము.

కమల—నీవు నాసోదరునియందుఁ బ్రేమకలదానవై యుంటి వికాదా?

కుందప్రత్యుత్తరము చెప్ప లేదు. కమలమణియామెముఖమును దనహృదయమునఁ జేర్చికొని, యేడ్చుచు "తెలిసినది! నీవు చచ్చిపోవు చుంటివి. చావుము. నీవు చచ్చిపోయినను చింతలేదు. కాని నీమూల మున ననేకులు చచ్చిపోరా ?" అనియెను.

కుందనందిని తలయెత్తి కమలమణిముఖమును స్థిరదృష్టితోఁ జూచెను. ఆస్థిరదృష్టిమూలమున బ్రస్ఫుటితమైనయామెహృదయభావ మును కమల గ్రహించి "అయ్యో ! నిర్భాగ్యురాలా ! నీవినాశము నీవే తెచ్చుకొనుచుంటివా? నాసోదరుఁడు నిన్నుఁ బ్రేమించుచున్నాఁడని నీవు గ్రహింపలేదా ?" అనిచెప్పెను— తరువాత మాటపలుక లేదు—అంతలోఁ మరల కుంద తల కమలమణిహృదయమునఁ జేర్చెను ఆమె కన్నీటిచే కమలవక్షము తడిసిపోయెను. కుంద చాలసేపు మాటాడకయె యేడ్చెను. పసిపిల్లవలె వివశయై వెక్కి వెక్కి యేడ్చు చుండెను. అదిచూచి కమలయు దుఃఖించెను. ఆమెకన్నీటిచే కుంద తలయంతయుఁ దడిసిపోయెను.

ప్రేమస్వరూపమును స్వర్ణమయియగు కమలమణి చక్కగా నెఱుఁగును. ఆమె తనహృదయాంతరమున కుందనందిని సుఖదుఃఖము లలో సమభాగినియై "కుందా !" యనెను.

కుంద మరల ముఖము నెత్తిచూచెను.

కమల—నాతో బయలుదేఱెదవా ?

కుందనందిని నయనములు మరల నశ్రుపూరితములయ్యెను.

కమల—లేనియెడల నశించిపోవుదు. బంగారమువంటిసంసా రము భగ్నమైపోవును.

కుంద యేడ్పుటకు ప్రారంభించెను. కమలమణి "బయలు దేఱెదవా ? యోచించి చూడుము" అనియెను.

కుంద చాలయోచించి కన్నుల దుడుచుకొనుచు లేచికూర్చుండి "బయలుదేఱెదను" అనియెను.

కుంద యామాటను చెప్పుట కంతకాల మాలస్యముచేయుట కుఁగలకారణమును కమల గ్రహియించెను. కుందనందిని మంగళకరమైన యన్యులగృహమునఁ దనప్రాణమ్ములబలియిచ్చుకొనుచున్నట్టులను, నగేంద్రునిశుభముకొఱకును సూర్యముఖి శుభముకొఱకును నగేంద్రుని మఱచియందుండుటకును స్థిరపరచుకొనుట కంతకాలము యోచించెనని తెలిసికొనెను. తనసుఖముమాట యేమయ్యెను? తన సుఖమునుగూర్చి యామె యెంతగా యోచించుట లేదనియుఁగూడ కమల తెలిసికొనెను. కుంద దానిని తెలిసికొనలేకపోయెను.

---

## పదునేనవ ప్రకరణము

—oo—

### హీర

ఆసమయమున వైష్ణవి వచ్చి గీతము పాడెను.

దేవాదిదేవ! ము ♦ క్తిప్రద ! వరద
శ్రీవధూలోల ! యా ♦ శ్రితభక్తపాల!
మల్లికాముకుళంబు ♦ మఱివిచ్చుచుండె
నల్లదె ! మకరంద ♦ మూనుముసఖియ
అదినీయసుఖమూల ♦ మగునేని చెలువ !
బెదరకు మొసఁగెద ♦ వేడ్క నాయుసురు
తరుణి ! నిన్ బ్రోచునీ ♦ శ్వరునివీక్షింప
నరిగెదనేఁగంట ♦ కారుణ్యములకు——

అప్పుడు సూర్యముఖియు నందున్నస్త్రీలు నాపాటను విను
టకై కమలను బిలిచిరి, కమల కుందనందినితోఁగూడ కలసివచ్చెను.

పోయితిసుమముకై ♦ ముండ్లలోపలికి
నాయెనియ్యదికళం ♦ కాన్వితసుమము
ముద్దుసఖి! దీని ♦ ముడువుమీతలను
నొద్దికగాదీని ♦ నొగిఁజెవిసంది
నవతంసముగఁదాల్ప ♦ నలకిఁ బ్రేలాడు
చెవిదీనిఁదాల్చిన ♦ చెలువధన్యసుమీ!
పరమేశ్వరుఁడుదయా ♦ పరమతియగుచుఁ
గరుణనెల్లపుడునిన్ ♦ గాపాడుఁగాక!

ఆగానమును విని కమల భ్రూభంగముసేయుచు నావైష్ణవితో "నీమొగములాగున్నది. మఱియొకపాటను పాడలేవా?" అనియెను.

హరిదాసు—ఎందులకు?

కమల కోపోద్రేకమానసురాలై "ఏల! బర్బరవృక్షశాఖను దీసికొనివచ్చి దానిముండ్లరుచిని వానికొకసారి కనపఱుపుఁడు. అని చెప్పెను.

సూర్యముఖి నెమ్మదిగా "ఆపాటమేమువినము. అవిగృహస్థులయిండ్లలోఁ బాడఁదగినవికావు. మేము వినఁదగు పాటలను బాడుము.

వైష్ణవి "మంచిది" యని చెప్పి పాడుటకు ప్రారంభించెను.

కం. చదివితిని శ్రుతులస్మృతులను
వదలక కొలిచితిని గురుని ♦ సదజలజములన్
మదినిందసేయను నొరులను
చెదరనుధర్మంబునాయెఁ ♦ జెప్పఁగనేలా!

కమల విసిగికొని "వదినే! నీకిష్టమున్నయెడల నీవైష్ణవిపాటను వినుము. నేనుపోయెదను." అనిచెప్పి వెడలిపోయెను. సూర్య

ముఖి కాసంగీతము రుచింపనందున నందుండి లేచిపోయెను. మిగిలిన స్త్రీలు వారివారియిష్టముచొప్పున నున్నవారుండిరి. పోయినవారు పోయిరి. కుంద యందే నిలిచియుండెను. ఆమె కాగీతార్థమేమియు పడలేదు. అధికముగా విననదియు కాదు. అన్యమనస్కయై యుండుటచేఁ గూర్చున్నట్లే కూర్చుండెను. అవహారిదాసి మరల పాడలేదు. వేఱుగ మాటాడుచుఁ గూర్చుండెను. సంగీతము చాలించినందున స్త్రీలందఱు వెడలిపోయిరి. కుందమాత్రము లేచిపోలేదు. నడువలేక యున్నట్లు కనఁబడుచున్నది. కుంద యొక్క తెరయే యుండుటనుజూచి హారిదాసి యేమేమొ చెప్పెను. కుంద వానిలోఁ గొన్నికొన్నిటిని వినలేదు.

సూర్యముఖి దానిని దూరమునుండి చూచుచుఁ గమలమణిని బిలిచి యామెకుఁ జూపించెను.

కమల—అయిననేమి ? మాటాడిన మాటాడనిమ్ము. పురుషుఁడు కాఁడుకదా! స్త్రీ స్త్రీతో మాటాడిన బాధకమేమి ?

సూర్య—స్త్రీయో? పురుషుఁడో? ఎవరికి తెలియును ?

కమల యత్యాశ్చర్యముతో 'అదేమి యట్లు చెప్పుచుంటివి ?' అనియెను.

సూర్య—కా పురుషులుండరనవచ్చునా ? ఇప్పుడే దానిని తెలిసికొనియెదను. ఆహా ! కుంద యెంతపాపిష్ఠురాలు !

కమల—కానిమ్ము. నేనుపోయి యొక ముండ్లచబుకును తీసికొనివచ్చి కంటకసుఖమును గనపఱచెదను.' అని చెప్పి కంటకావృతమగు నొకానొక వృక్షశాఖను దెచ్చుటకు వెడలిపోయెను. అట్లు పోవుచు మార్గమధ్యమున సతీశుని జూచెను. ఆ చిన్నిబాలుఁడు తన మేనత్త కుంకుమబరణిని సంగ్రహించుకొని యందలి కుంకుమను ముఖము, నోరు, శరీరమంతయు నలఁదికొని విలక్షణమైన యంగ

రాగముతో నలరారుచుండుటఁ జూచి వైష్ణవిని, ముండ్లచబుకును, కుందనందినిని గూడ మఱచిపోయెను.

సూర్యముఖి హీరాదాసిని బిలిపించెను.

హీరయను దానిపే రిదివఱకొకసారి చెప్పఁబడియుండెను. ఇప్పుడు దాని ప్రత్యేకచరిత్రమును జెప్పుట యధికావశ్యకము. నగేంద్రుఁడు నాతనితండ్రియు తమ గృహమునఁ బనిచేయు పరిచారిక స్త్రీలను సత్స్వభావము కలవారినే చూచి నియమించుకొనుచుండు వారు. అందుకొఱకు తండ్రికొడుకు లిద్దఱు నధికవేతనముల నిచ్చి సత్ప్రవర్తనముగల స్త్రీలను పనికత్తెలుగా నుంచుకొనెడువారు. నగేంద్రుని గృహమునఁ బనిచేయు పనికత్తెలు నెక్కుడుగా సుఖ గౌరవముల నందుచుండుటచే నుపాధి చాలని మర్యాదకుటుంబము లోని సుందరీమణులు వారియొద్ద కొలువు కుదిరియుండిరి. ఆవిధముగా చేరిన పనికత్తెలలో హీర ముఖ్యురాలు. పరిచారికలందఱుఁ జాల వఱకు కాయస్థజాతివారు. హీరయు కాయస్థ బ్రాహ్మణకుటుంబము లోనిది. నగేంద్రునితండ్రి హీరమాతామహిని వేఱొక యూరినుండి తీసికొనివచ్చెను. హీరమాతామహిని పనికత్తెగా నియమించినప్పటికి హీర పసిబాలికయైయుండెను. దానికి యుక్తవయసు వచ్చినపిమ్మట నాముదుసలి పనిని జాలించుకొని తాను గణించికొనిన ద్రవ్యముతో గోవిందపురమునందే యొక సామాన్యమైన గృహమును గట్టికొని యందు వాసముచేయుచుండెను. హీరమాత్ర మాదత్తుగృహమున దాసిపనిని చేయుచుండెను.

హీర కిరువదివర్షముల వయసు. వయసునందితర పరిచారక స్త్రీలకంటె చిన్నది. బుద్ధిప్రభావముచేతను సత్ప్రవర్తనముచేతను దాసీలలో శ్రేష్ఠయై కనఁబడుచుండెను.

హీర బాలవిధవయని గోవిందపురమున ప్రచురితమైయుండెను. కాని యామె భర్తనుగూర్చి కొంచెమైన నెవరికిని దెలియదు. హీర

ప్రవర్తనమును కళంకయుక్తమయినదని యెవరును వినలేదు. ఆమె యత్యంత ముగ్ధయై సువాసినివలె వస్త్రాలంకారములు ధరించుచుండెను. ఆమెయందు కొంచెము గయ్యాళితనము కలదు.

అదిగాక హీరసుందరి. ఉజ్జ్వలమైన శ్యామాంగి. పద్మపలాశలోచన-ఆకారమున ముఖము మేఘావృతమైన చంద్రునివలె నుండును. కేశరాశియు పడగవిప్పిన సర్పమువలె వెన్నున జీరాడుచుండెను. హీరయొంటిగాఁ గూర్చుండి పాడుచుండును. పరిచారికలలో నొండొరులకు గలహముగల్పించి వారుపోరాడుచుండ వినోదముగాఁ జూచుచుండును. అంధకారమున వంటలవారిని భయపెట్టుచుండును. పిల్లలు తనకు వివాహము చేయుమని వారివారి తల్లిదండ్రుల బాధించునటుల బోధసేయును. ఎవరైనను గాఢనిద్రా పరవశులై యున్నయెడల వారి మోములపై సున్నమురాచి సిరాబొట్లు పొడుచును.

హీరయొద్ద ననేక దోషములుకలవు. వాటినన్నింటిని గ్రమముగాఁ దెలిసికొనవచ్చును. ప్రకృతమున నొక్క విషయమును జెప్పెదము—ఏమనగా—ఆమెయత్తరు, పన్నీరుమున్నగు సుగంధసహితములగువిలాస వస్తువులను జూచినచో వానిని దొంగిలించితీరును.

సూర్యముఖి హీరనుబిలిచి "ఆవైష్ణవిని నెఱుఁగుదువా?" యని యడిగెను.

హీర—ఎఱుఁగను—నేనెప్పుడు నీయిరుగుపొరుగు దాటియావలకు పోయినదానను కాను. ఆవైష్ణవిభిక్షుకి నెట్లు నేనెఱిఁగియుందును? కూరవాడియందుండు స్త్రీలనడుగుఁడు. కరుణ, సీతల దానినెఱుఁగుదురు.

సూర్యముఖి—అది ఠాకూరువాడి వైష్ణవి కాదు. ఆవైష్ణవి యెవరో నీవెఱిఁగియుండవచ్చును. అదివైష్ణవియగునో కాదో దాని గృహ మెక్కడనో, కుందతోనది రహస్యాలోచన యేలచేయుచుం

డెనో యదియంతయు సవిస్తరముగాఁ జక్కగాఁ దెలిసికొని వచ్చిన యెడల నీకొక క్రొత్తబనారసుచీర నిచ్చెదను.

క్రొత్తబనారసుచీర యనుమాట చెవినిబడినంతనె హీరకు శరీరముప్పొంగి "సమాచారమంతయు దెలిసికొని రావలెనా?" యని యడిగెను.

సూర్యముఖి—"నీయిష్టమువచ్చినటుల; కాని యిప్పుడు నీవు దానివెన్నంటిపోకున్న దాని నీకగుర్తింపలేవు. దానిగృహమును దెలిసికొనలేవు.

హీర—మంచిది.

సూర్యముఖి— కాని యప్రమత్తురాలవై యుండవలెను సుమా! ఆవైష్ణవికిగాని యన్యులకుఁగాని యీసంగతి తెలియఁగూడదు.

ఆసమయమునకుసరిగా కమలమణి మరలవచ్చెను. సూర్యముఖి హీరాదాసికి చెప్పినదంతయు నామె తెలిసికొని సంతోషించి హీరతో "నీకు సామర్థ్యమున్నయడల నీముండ్ల చబుకుతో వైష్ణవిని నాలుగు దెబ్బలుకొట్టి తీసికొనిరావలెను" అని చెప్పెను.

హీర—అదియంతయు జేయగలను. కాని నాకు బనారసుచీరెమాత్రము చాలదు.

సూర్యముఖి—మరేమి కావలయును ?

కమల—ఆమెకొక వరుఁడు కావలయును. పెండ్లిచేయవలెను కాదా ?

సూర్య—మంచిది. అదియు జరుగవలసినదియే. కావలసిన యెడల కమల నీకు వివాహముచేయును.

హీర—అప్పుడు చూచుకొన వచ్చును ఇప్పుడు గృహమునందె నాకు తగిన వరుఁడొకఁడుండెను.

సూర్య—అదెవరు ?

హీర—యముఁడు.

---

# పదునాఱవ ప్రకరణము

ఆదినమునఁ బ్రదోషసమయమునందు కుందనంది యుద్యానవనమునందలిపుష్కరిణీతీరతలంబునఁ గూరుచుండి యుండెను. ఆపుష్కరిణి యతివిశాలమైనది. అందలిజలంబు లతిపరిష్కృతములై సర్వదా నీలప్రభాతరళితములై యుండును. పుష్కరిణికి వెనుకభాగమునఁ బుష్పోద్యానమున్నదని పాఠకులకు జ్ఞప్తియందుడవచ్చును. ఆపుష్పోద్యానవనంబునకు మధ్యప్రదేశమున శ్వేతశిలావినిర్మితంబగు కుట్టిమంబున విరాజిల్లులతామండపమొకటి కలదు. ఆలతామండపమునకు ముందటి భాగమునఁ బుష్కరిణిలోనికి దిగుడకు సోపానపరంపర యున్నది. ఆసోపానములు శిలాసన్నిభంబు లగునిటుకలచే నిర్మింపఁబడి చదునుగను నునుపుగను విలసిల్లుచుండెను. దానికిరువంకలను చిరకాలమునాఁటి వకుళభూరుహములు రెండుకలవు. ఆవకుళభూరుహతలంబున నాసోపానములపై నంధకారబంధురంబగునాప్రదోషకాలమున నేకాకినియై కుందనందిని కూరుచుండి వినీలనిర్మలసరోవరతలంబునఁ బ్రతిబింబించుచున్న తారకాహారవిభూషితంబగుగగనఫలప్రతిబింబమును వీక్షించుచుండెను. ఆసరోవరమునం దచ్చటచ్చట నస్పష్టములై పుష్పములును, పరిణతతరుపత్రంబులును కానవచ్చుచుండెను. ఆపుష్కరిణి యవ్వలి మూఁడువైపులను మామిడి, పనస, నేరేడు, మారేడు, నిమ్మ, నారింజ దబ్బ మొదలగు వృక్షములు ఫలవంతములై యలమికొని వరుసతీరి యాయంధకార సమయమున సమోన్నతముకాక హెచ్చుతగ్గుగల రాతిగోడవలెనే కానఁబడుచుండెను. అప్పుడప్పు డొక్కొక్కసారి యాచెట్లపైఁ గూర్చుండియున్న గ్రుడ్లగూబలు వికటశబ్దములచే నిశ్శబ్దంబైయున్న సరోవరమును శబ్దాయమానముగఁ జేయుచుండెను. శీతలమందమలయానిలము లాసరోవరమున నంతటఁ బ్రచారము

సేయుచు వచ్చి యందలి తామర మొగ్గల నించించుక కదలించి విని ర్మల జలమునకు రఫలకంబునఁ బ్రతిఫలించు నాకాశచిత్రము నొక్కిం తయూచి కుందనందిని తలపై నున్న వకుళవృక్షమునందలి పత్రములలో మర్మరనినదంబుల నుదయింపఁజేసి తమసంచాలనంబుల నల్లనవికసించు చున్న వకుల కుసుమంబుల యందలి మనోహర సుగంధముల నాకుం దనందినిపై నలువంకలఁ బ్రసరింపఁ జేయుచుండెను. వెనుకవైపునుండి మాలతీ మల్లికాది వివిధ సుగంధ కుసుమంబుల మనోహర పరిమళంబు లల్లనఁ బరతెంచుచుండెను. దశదిశలు నంధకారబంధురములై యుం డెను. మెఱుగుఁదుబురువులు వినిర్మలజలోపరిభాగంబున నెగురుచు మినుకు మినుకున మెఱసి వెలుతురు నొసంగుచుఁ దిరుగాడుచుండెను. ఒకటిరెండు పాలపిట్టలుకూడ నప్పుడప్పుడు కూయుచుండెను. భయం కరముగ నక్కలును కూయుచుండెను. ఒకటిరెండు మేఘములాకాశ పథంబునఁ ద్రోవతప్పి తిరుగాడుచుండెను. ఒక్కొక్కసారి యొండు రెండు నక్షత్రములు మనోవ్యాకులంబున సత్పథము వదలి యధఃపత నముం గాంచుచుండెను. అప్పుడు కుందనందిని మానసికం బగుదుఃఖ మున నేమేమియో యోచించికొను చుండెను. ఆమె యేమని యోచించుకొను చున్నది ? ఆమెయాలోచన మేమందు రేని—

"అందఱును మరణమునకు లోఁబడిపోయిరి;—మాయమ్మమృత్యు ముఖంబునఁ బడిపోయినది; మాయన్నయు మరణించియున్నాఁడు నేనెందులకు మరణింప లేదు ? చావలేదు సరియే—ఇక్కడ కెం దులకు వచ్చితిని ? మంచిది. మనుష్యుఁడు మరణించినచో నక్షత్రమగునఁట కాదా ? అని—ఆమెకు తండ్రి మరణించిన నాఁటి రాత్రి కలిగిన స్వప్నము మాట జ్ఞప్తియందు లేదు. ఏమేమో కొంచె మస్పష్టముగ స్వప్నమునందుఁ దనతల్లిని జూచినట్లును, ఆమె తన్ను నక్షత్రము కమ్మని బోధించినట్లును, కుం

దనందిని కించుక జ్ఞప్తియం దుండెను. ఆమె మరలమరల యోచిం చుకొనియెను. కాలగతులైన మనుష్యులు నక్షత్రములు కారా! అట్లయినచో మాయమ్మయు, మాతండ్రియు, నక్షత్రములే యైయుం దురా? అట్లయినచో మాజననీజనకు లేనక్షత్రములో?—ఇదియా? కాక మఱియొకటియైయుండునా? మాతండ్రి యిందేనక్షత్రము? నేను దాని నెట్టులానవాలు పట్టఁగలుగుదును? నేనిప్పు డిచ్చట నుండి యేడ్చు చుండుటనుగూర్చి వారు దూరమునుండి చూచి యోచిం చుట లేదా? అందుకొఱకు నేను మిగుల బిగ్గరగా నేడువవలయు నని తోఁచుచున్నది—అయ్యో! ఏడ్చుటవలన నేమిప్రయోజనమున్నది? దుఃఖమే నానుదుట వ్రాయఁబడి యున్నది. అట్లుకానిచో మాయ మ్మ—మరలనామాట యెత్తుటెందులకు? చచ్చుట కేదియైన నుపా యము లేదా? ఈనీటియందుఁ బడి మునిఁగిపోయినచో నేమగును? ఇదియే బాగుగ నున్నది—నక్షత్రమునయ్యెదను. నక్షత్రమ నైన చోఁ జూడవచ్చును. నిరంతరమును జూడవచ్చును. నేనెవ్వరిని చూడ వచ్చునో యాతని నొక్కసారి నానోరార నుచ్చరింపవచ్చునా? మం చిది. ఆతనిపేరు చెప్పవచ్చునా? ఇచ్చట నిప్పు డెవ్వరును లేరు— కావున నెవ్వరును వినఁజాలరు. ఒక్కసారి నోటితోఁ బలుకుదునా? ఎవ్వరును లేరు. నామనసునందలి యాశతీరునట్లొకసారి పేరు చెప్పి చూచుకొందును. న—నగ—నగేంద్ర—నగేంద్ర—నగేంద్ర— నగేంద్ర—అయ్యో! నా నగేంద్రుఁడా? నే నెవ్వతెను? ఆతఁడు సూర్యముఖినగేంద్రుఁడు. ఎన్నిసారులుపేరు చెప్పితిని! ఆయిన నేమి? సూర్యముఖికిఁ బరిణయము కాకపోయి నాకే వివాహ మైనచో— ఈయాలోచనము సరిగా లేదు. నేనీ జలంబులఁ బడి మునిఁగిఁ చచ్చె దను. మంచిది. ఇప్పుడు నేను మునిఁగిపోయినచోఁ దెల్లవారుసరికి లేచి తేలుదును. అప్పు డందఱు నీవర్తమానమును వినియెదరు. ఆత

డును వినఁగలఁడు. నగేంద్ర—నగేంద్ర—నగేంద్ర—మరలఁ బిలు తునా? నగేంద్ర—నగేంద్ర—నగేంద్ర—నగేంద్రుఁడు విని యేమి చేయును? ఏమని చెప్పను? నేను మునిఁగి మరణింపఁజాలను. ఒడ లంతయు జలపూరణమున నబ్బుటచే నేను పెద్ద రక్కసివలె నగు దును. అప్పు డాతఁడు చూచి యేమనుకొనును? విషము తిని మర ణింతునా? ఏవిషమును పానము చేయవలసియుండును? విష మెచ్చ టనున్నది? దానిని గొని తెచ్చి యిచ్చువారెవ్వరు? ఒకవేళ నెవ్వరైన దెచ్చి యిచ్చినయెడల—చావగలనా? చావఁగలను. కాని యిప్పుడు వలదు. ఒక్కసారి మరల నానామమును స్మరించుకొని యాశతీర్చు కొనియెదను. అతఁడు నన్నుఁ బ్రేమించు చుండెనని కమల చెప్పు చున్నది. ఏల చెప్పవలయును? అదియేమాట. ఆమె చెప్పినమాట నిశ్చయమే. కాని, కమల కాసంగతి యెట్లు తెలియవచ్చినది? నిర్భా గ్యురాలను నేనెఱుఁగకయే పోయితిని! ప్రేమించుచున్నాఁడా? ఎట్లు ప్రేమించు చున్నాఁడు? దేనిని చూచి ప్రేమింపవలయును? రూప మునా? కాదు గుణమునా? రూపమునే? చూతము'' ఇట్లనుకొనుచు నీలములై నిర్మలములై నిశ్చలములై యున్న యాసరోవరజలంబులఁ దనప్రతిబింబమును చూచుకొనుటకై పోయి చూచి యేమియుం గాన లేక వెనుదిరిగి వచ్చి మొదటఁ దానుగూర్చుండి యున్నచోటనే కూరు చుండెను. అట్లుండి కుందనందిని మరల దనలో 'అట్లు నేనేల యోచించి తిని? సూర్యముఖి నాకంటెను మిగుల సౌందర్యవతి. నాకంటె రమణియు సుందరియే. వామయుసుందరియే. చంద్రముఖయును సుందరియే. ముక్తకేశినియు సుందరియే. నాకంటె హీరాదాసియు సుందరియే. హీరాదాసి నాకంటె నందకత్తె యనియే చెప్ప వచ్చును. శ్యామలవర్ణమైనంతమాత్రమున నేమి? ఆమెమొగము నామొగముకంటెఁ జాల నందమైనది. రూపమేమో లేదు! రూపము

లేక పోయినను నాయందు గుణమేదియైన నున్నదా? ఏగుణ మున్నది? యోచించి చూడవలయును ఎంతగా యోచించిచూడ వలయును. ఎంతగా యోచించినను నాకేమియు బోధపడుటలేదు. కావున చావఁగూడదు. కమలమణి యెందులకుఁ జెప్పినది? ఆమె చెప్పినది యసత్యమేయైనఁగానిమ్ము అసత్యమునే సత్యమనియోచించి చూచుకొందును. కాని, నేను కలకత్తాకుఁ బోవఁజాలను. అట్లు పోయినచో దర్శనలాభము లేకపోవును. నేబోవఁజాలను. నిశ్చయముగ బోవ జాలను. పోక యేమి చేయఁగలుగుదును? కమల చెప్పినది నిజమే యైనచో నన్నుఁ బెంచి ముందునకుఁ దెచ్చినవారినాశనమునకు నేనే కారణ మయ్యెదను సూర్యముఖిహృదయమున నేమో సందేహముదయించినట్లు తోఁచుచున్నది. సత్యమే కానిమ్ము. అసత్యమే కానిమ్ము—నేను తప్పక కలకత్తాకుఁ బోవలయుననియే తోఁచుచున్నది. కాని యెట్లు పోఁగలను? పోవఁజాలను. అట్లయినచో జలంబులఁబడి మునిఁగి చచ్చి పోయెదను. సరోవరంబునఁ బడి ప్రాణత్యాగము చేసికొందును. జీవించి యుండుటవలనఁ బ్రయోజనమేమున్నది? హా! తండ్రీ! నీవు నన్నిట్లు దుర్మరణము నొందుటకై దిగవిడిచిపోయితివా?" అనికుందనందిని తనరెండుచేతులను తలపై నుంచుకొని రోదనముచేయ నారంభించెను. ఒక్కసారిగా గాఢాంధకారంబున దీపోదయం బైనట్లు కుందనందిని స్వప్నవృత్తాంత మంతయు స్పష్టముగ నామెహృదయమునఁ బొడకట్టెను. అప్పు డామె మెఱుపుతాఁకిన దానింబోలె లేచి నిలువఁబడి "నేనెంతయును మఱచిపోయితిని. మాయమ్మ నాకంతయును తెలియఁజెప్పి యున్నది నానుదుట వ్రాసినవ్రాఁత యంతయు నామె యెఱింగినది కావుననే నన్నా నక్షత్రలోకములకుఁ బొమ్మని బోధించి యున్నది. నేనామెబుద్ధి వాదము నేల పెడచెవిని బెట్టితిని? నేనిప్పుడైన నేల ప్రాణము

లను విడువఁగూడదు? ఏల యింక నాలస్యము చేయుచున్నాను? నేనిప్పుడే ప్రాణత్యాగముఁ జేసికొందును." అని యాలోచించి లేచి మెల్ల మెల్లగ సరోవరసోపానములనుబట్టి లోనికి దిగ నారంభించెను. కుందనందిని యబల. అతిభీరుస్వభావయై యడుగడుగునకుఁ భయగ్రస్తయై ప్రతిపదంబునను వడఁక నారంభించెను. కాని మనసునమాత్రను చలింపక తల్లియాజ్ఞను పరిపాలించుటకై మెల్ల మెల్లగ దిగి పోవుచుండెను. ఆసమయమున వెనుకవైపునుండి యెవ్వరో వచ్చి యామెవెన్నుపైఁ జేయివైచి "కుందా!" అని పిలిచినట్లయ్యెను. కుందనందిని వెనుదిరిగి చూచెను. అగాఢాంధకారమునఁగూడ నామెకు గుర్తు తెలిసెను. ఆతఁడు నగేంద్రుఁడై యుండెను. కుందనందిని కప్పుడు మరలఁ బ్రాణత్యాగము చేసికొనుట కవకాశము లేకపోయెను.

నగేంద్రా! ఇదియేమి? నీవు పవిత్రచరిత్రుఁడవై యుంటివి. అందుల కిదియేనాఫలము! ఛీ! నీవు దొంగవు. నీవు చోరునకంటె నధముఁడవు. దొంగ సూర్యముఖి నేమిచేయుచున్నాఁడు? ఆమెనగ నాణెములను దొంగిలించి ధనహాని చేయుచుండును. నీవో-ఆమెప్రాణముల నపహరించుకొనుటకు వచ్చి యున్నాఁడవు. సూర్యముఖి దొంగ కేమియు నీయకపోవుటవలన నాతఁడు దొంగిలించి దొంగ యగుచున్నాఁడు. నీకైనచో, సూర్యముఖి తనసర్వస్వమును స్వాధీనపఱచి యున్నది, అట్లయినను నీవు దొంగకంటె నధికముగా దొంగతనముచేయుటకు వచ్చియుంటివి. నగేంద్రా! నీవు ప్రాణత్యాగము చేసికొనిన బాగుగ నుండును. ధైర్యము కలదేని పోయి యా సరోవరజలంబులం బడి ప్రాణత్యాగము చేసికొనుము!

ఛీ! ఛీ! కుందనందినీ! నీవు దొంగ స్పృశియించినంతమాత్రమున నేల ప్రకంపిత వయ్యెదవు! దొంగవానిమాటలను వినుటవలన నీశరీరమునం దేల ముండ్లుగ్రుచ్చినట్లు కాపలయును? కుందనందినీ!

చూడుము! పుష్కరిణీజలంబు లతి పరిష్కృతములై శీతలములై సురభిళములై యున్నవి. వాయుసంచాలనంబున నందలి నక్షత్ర ప్రతిబింబములు చలియించుచున్నవి. అందు మునిఁగెదవా? మునిఁగి చావఁజాలవా? కుందనందినికి మరణించుట కిష్టములేదు.

దొంగ—కుందా! నీవు కలకత్తాకుఁ బోయెదవా?

కుందనందిని మాటాడలేదు. కన్నులను మూసికొనియెను. మాటలాడలేదు.

దొంగ—కుందా! నీవు మనఃపూర్వకముగఁ బోయెదవా?

మనఃపూర్వకముగనే! హరిహరీ! కుందనందిని మరలఁ గన్నులను మూసికొనియెను. మాటలాడలేదు.

కుందా! ఏడ్చెద వెందులకు? కుందనందిని బిగ్గరగా నేడువసాగెను.

నగేం—కుందా! వినుము. నేనతి కష్టముతో నిన్నిదినముల వఱకు సహియించి యుంటిని. ఇంకను ప్రయోజనము కలుగలేదు. ఎంతకష్టముతోఁ బ్రాణములను నిలుపుకొని యుంటినో నేను చెప్పఁజాలను. నాతో నేనే పోరాడి క్షతవిక్షతశరీరుఁడనై పోయితిని. నేను కేవల మధీరుఁడను నధముఁడను నై యుంటిని. తుదకు త్రాగుబోతును కూడ నైతిని. నేనిఁక నిలువఁజాలను. నిన్ను విడువనోపను. వినుము! కుందా! ఇపుడు విధవావివాహములు బహిరంగముగ నిర్వహింపఁబడుచున్నవి. నిన్ను నేను వివాహము చేసికొందును. నీ వంగీకరింతువేని తప్పక పరిణయము కాఁగలదు.

కుందనందిని యప్పుడు మాటలాడెను. నగేంద్రుఁ డడిగిన ప్రశ్నమునకు 'వలదు' అని యుత్తర మిచ్చెను.

మరల నగేంద్రుఁడు 'కుందా! అదియేమి? విధవావివాహము శాస్త్రీయ మనియూ సెసం దేహము?' అనెను.

కుంద మరల 'కాదు' అనియెను.

నగేం—అట్లయినచో 'వలదు' అందువేల? బాగుగ నాలోచించుకొని చెప్పుము! యిల్లాలవయ్యెదవా? కావా? నన్నుఁ బ్రేమింతువా? ప్రేమింపవా?

కుంద—వలదు,

అప్పుడు నగేంద్రుఁడు సహస్రవిధముల నపరిమిత ప్రేమ పూర్ణంబులును, మర్మభేదనంబులును, నగు నెన్నియో మాటలను వచియించెను.

కుంద—వలదు,

నగేంద్రుఁ డప్పుడు పరీక్షించి చూడఁగా నా పుష్కరిణీ జలంబులు వినిర్మలంబులును, కుసుమవాసనా వాసితంబులునై వాయు సంచాలనంబున నందలి నక్షత్రమండలము ప్రకంపిత మగుచుండెను. 'అందు శయనించిన నెంత బాగుగ నుండునోకదా!' అని యాతఁడు భావించుకొనుచుండెను.

మనసునందుమాత్రము కుందనందిని వలదని చెప్పినను 'విధవా వివాహము శాస్త్రములం దున్నది. అందుకొఱకు కాదు' అనియెను.

అట్లయినచో నామె మునిఁగి చావలేదేల? స్వచ్ఛమైయున్న జలము—శీతలమై యున్న యుదకము—క్రింద నక్షత్రములు కులుకుచుఁ జలియించుచున్నవి. కుందనందిని యాసరోవరమునం బడి యేల చావలేదు?

---

## పదునేడవ ప్రకరణము

### యోగ్యంయోగ్యేన యోజయేత్—

హరిదాసివైష్ణవి యుద్యానవనగృహంబునకు వచ్చి యాకస్మికముగ దేవేంద్రబాబుగా మారి కూరుచుండెను. పార్శ్వమునందు

హుక్కా—విచిత్రరజతనాళమాలామయియు, కలకలకల్లోల నినాద సంకులయు, నైరోష్ఠచుంబనార్థము సుందరతరదీర్ఘనాళమును చాచి యుండెను. దానితలపై సువాసనావిలసితం బగుదివ్యానలము సముజ్జ్వలం బగుచుండెను. మఱియొకవంక స్ఫాటికపాత్రంబున మనోమోహనాంగియగు మధుకుమారి (ఎక్షా ఉత్కృష్టంబగు బ్రాంది విశేషము) ద్రవమయియై తళతళ మెఱయుచుండెను. దేవేంద్రుఁడు మొట్టమొదట హుక్కావంకఁ దిరిగి దానిముఖచుంబనముం జేసెను. దాని ప్రేమము ధూమాకారముం దాల్చి యుండెను. తరువాత మధుకుమారి నెదహత్తుకొనియెను. ఆమెయుఁ గ్రమక్రమముగాఁ దలకెక్కనారంభించెను. అందులకుఁ దగురీతి నితరసేవనముకూడ జరిగెను.

అప్పుడు సురేంద్రుఁడు వచ్చి దేవేంద్రునయొద్దఁగూరుచుండి యాతని యారోగ్యములంగూర్చి కుశల ప్రశ్నము చేసి యనంతరమున ''నీవిప్పు డెచ్చటికిఁ బోయితివి?'' అని యడిగెను.

దేవేం—ఇంతలోనే యిది నీచెవులఁ బడియెనా?

సురే—ఇదియే నీభ్రాంతి! నీవు చేయుపను లెవ్వరికిని తెలియకుండ జరగుచున్నవనియే నీవు తలంచుచుందువు—కాని నీవు చేయునదంతయు నూరూరఁ జాటించినరీతినే తెలియవచ్చుచుండును.

దేవేం—మీధర్మాచరణ మిఁకఁ జాలును. నేనేదియు నెవ్వరికిని దెలియకుండ వలయు నని చేయుట లేదు. ఏల రహస్యముగాఁ జేయవలయును?

సురే—అదియొక గొప్పతనముగాఁ దెలుపవలదు. నీకుఁ గొంచెము సిగ్గుగలదేని చెప్పవచ్చును. నీకు సిగ్గేయున్నయడల వైష్ణవివేషముందాల్చి యూరవెంట నెట్లుతిరుగుదువు?

దేవేం—(నవ్వుచు) అట్లయినచో నేనెంతటివైష్ణవినై యుంటినో నీవు చూడలేదా? మిగుల నందముగానుంటినిగాదా?

సురేం—నేనా పాడు మొగమును చూడలేదు. చూచియున్న చో చబుకు తీసికొని యీ వేషపు సొగసును చూపించి యుందును.

అనంతరము సురేంద్రుఁ డాతనిచేతియందున్న మద్యపాత్ర మునులాగికొని "త్రాగుట నాపివేయుము. శరీరస్మృతియున్నచో రెండుమాటలను చెప్పెదను. వినినతరువాత నింకను కావలసియున్నచోఁ ద్రాగవచ్చును." అనియెను.

దేవేం—చెప్పుము! ఇప్పుడు మిగుల గందరగోళము చేయుచున్నావు. హైమవతిగాలి నీకును సోకినట్లున్నది.

సురేంద్రుఁ డామద్యముఖునిమాటలను చెవినిబెట్టక "నీవెవ్వరిని పాడుచేయుట కావైష్ణవి వేషమును ధరియించి పోయితివి?" అనియెను.

దేవేం—అది ఇంకను బోధపడలేదు. ఉపాధ్యాయుఁడగు తారాచరణుఁడు వచ్చి దేవకన్యకంబోలిన యొకసుందరాంగిని పెండ్లి చేసికొన్నమాట నీకు జ్ఞప్తియందున్నదా? ఆదేవకన్యక యిప్పుడు వితంతువై యున్నది. రాక్షసుఁడగు నగేంద్రదత్తుని మందిరమునవంట చేసికొనుచు భుజియించి జీవించుచున్నది. ఆమెనుచూచుటకే నేను పోయియుంటిని.

సురే—నీవింకను నెన్నిదుర్వ్యాపారములు చేయవలెను? నీవిప్పుడు లోఁబడిపోయినదుర్వృత్తి చాలదా? అనాథయగు నాబాలికను నధోగతిపాలు చేయుటెందులకు? చూడుము! దేవేంద్రా! నీవు మిగులఁ బాపాత్ముఁడ వైతివి. మిగుల నృశంసుఁడవై పోవుచుంటివి. కేవల మత్యాచారమునకు లోనై పోయితివి. నీవు నాసహవాసమునకు యోగ్యుడవు కావు. నేను నీతో సహవాసము చేయను.

సురేంద్రుఁడు మిగులఁ బట్టుదలతో నంతనిశ్చయముగఁ జెప్పుటను విని దేవేంద్రుఁడు విస్మితుఁడై తరువాత గంభీర భావమును

దాల్చి "నీవు నాపైఁ గోపింపవలదు. నామనసు నావశమునందులేదు. నేనేమి కావలసినను విడువఁగలను. కాని రమణీమణులపయిం గల యాశనువదలఁ జాలను. మొట్టమొదట నేనామె నెప్పుడు తారాచరణునిగృహమునందుఁ జూచితినో యాదినము మొదలుకొనియు నామె సౌందర్యమున ముగ్ధుఁడనై పోయియుంటిని. నేనంతటి సౌందర్యమును మఱియెచ్చటను వీక్షించియుండలేదు. జ్వరమునందలివిదాహము రోగిని నాశనము చేయునట్లే నాఁటినుండియు నామెయందతి ప్రేమయు నన్నుఁ గాల్చివేయుచుండెను. అదిమొదలుగ నేనామెను మరలఁ గనుఁగొనుటకు మిగులఁ బ్రయత్నించుచుంటిని, కాని సాధ్యపడలేదు. తుదకు వైష్ణవీవేషమును ధరియించితిని. ఆమె పరమపతివ్రతయను నంశమున నీవెంతమాత్రమును సంశయింపవలదు." అని చెప్పెను.

సురేం—అట్లయినచో నీవెందులకుఁ బోయితివి?

దేవేం—కేవల మామెను చూచుటకొఱకే నేను పోవుచుంటిని. ఆమె నొక్కసారి చూచి యొక్కసారి మాటలాడి యామెకొఱ కించుకసేపు సంగీతమును పాడివచ్చినంత మాత్రముననే తృప్తి నందుచుంటిని.

సురేం—నేను నీకు నిజము చెప్పుచున్నాఁడను. ఏమనిన—నీవాదుర్వృత్తిని విడువక యదేత్రోవను పోవుచుందువేని నీకును నాకును సంభాషణమైన లేకపోవుటయే కాక నేనుగూడ నీయెడల శత్రునిం బోలి వర్తించెదను. ఇది పరిహాసవచనము కాదు. బాగుగఁ దెలిసికొనుము.

దేవే—నాకుఁ గావలసినవారిలో నీవొక్కఁడవు మాత్రమే మిత్రుఁడవై యుంటివి. మఱియెవ్వరును నామేలు కోరువారు లేరు. నీకొఱకు నాధనమునైనను నాదుర్గుణములనైనను పరిహరింపఁగలను.

కాని నిన్నుమాత్రము విడువఁజాలను. మఱియొకమాట చెప్పెదను. నిన్నయినను విడువఁగలను గాని కుందనందినిజూచు నాశమాత్రము వదలుకొనఁజాలను.

సురేం—అట్లయినచో నట్లే కానిమ్ము. నాకును నీకు నిదియే కడపటి సందర్శనము.

ఇట్లు చెప్పి సురేంద్రుఁడు దుఃఖితుఁడై వెడలిపోయెను. దేవేంద్రు డేకయాత్రబంధు విచ్ఛేదమువలన మనంబునఁ గుంది కొంతసేపటి వఱకును వ్యసనాక్రాంతుఁడై కూరుచుండి యుండెను. కొంతసేపు యోచించుకొని తుదకు "పోయినఁ బోనిమ్ము! ఈప్రపంచమున నెవ్వరి కెవ్వరున్నారు? నాకునేనే" అనియూహించుకొని యట్టయెదుటఁ గాచ పాత్రమున నింపఁబడియున్న మద్యమును పానము చేసెను. అందువలన నాతని హృదయకమలము వికసించెను. అప్పుడాతఁ డక్కే పడియుండి కన్నులను మూసికొని గానముచేయుట కారంభించెను.

సుందరిమెలపును ♦ సొలపును వలపు
నందము చందము ♦ నారసి జనులు—

అప్పుడతనిమిత్రు లందఱును వెడలిపోయిరి. కాని నదియందలి నావనుండి క్రిందఁబడిపోయిన తెడ్డుపలకవలెనే యాతఁ డొక్కఁడును కూరుచుండి రసతరంగముల మునిఁగి తేలుచుండెను. రోగరూపంబు లగుమకరతిమితిమింగిలాదు లాజలంబుల దాగికొనియుండెను. అప్పుడు కేవలము మందమారుతమును తెరమబ్బులునుమాత్ర ముండెను. ఆస మయమున గవాక్షమునొద్ద "కరకర" యనుశబ్ద మయ్యెను. కిటికీ తలుపులు తెరవఁబడియెను. ఎవ్వరో వెనుక పొంచుండి చూచుచున్నారని దేవేంద్రుఁడు గ్రహియించి "ఎవరువారు ? దొంగలా?" అనియెను. అందుల కేమియును ప్రత్యుత్తరము రాకుండుటవలన

నాతఁడు లేచి చూచెను. ఒకయువతి పారిపోవుచుండెను. ఆయువతిం జూచి దేవేంద్రుఁడా గవాక్షమార్గమునుబట్టి యావలికురికి యామెను వెంబడించి పరుగెత్తిపోయెను.

ఆకాంత యతిసులభముగా నాతనిచేతులలోఁబడక యుండునట్లు పారిపోవఁ బూసియుండెను. కాని వలయుననియే యామె యతివేగముగఁ బోవుటలేదో, ఆగాఢాంధకారమువలన నాపూవుదోఁటలో నామె దారితప్పియే పోయినదో మేము నిశ్చయించి చెప్పఁజాలము దేవేంద్రున కామె యంతలోనే దొరకిపోయెను. ఆతఁడాచీకటిలో నామె మొగమువంకఁ జూచెను. కాని గుర్తుపట్టలేకపోయెను. మధుపాన మదాతిరేకంబున నాతఁడు వహవ్వా! నీచెట్టుమీఁదినుండి పడిపోయితివి ? ఎవ్వరితరుణీమణివి ?'' అని పలికి మరల ''ఇప్పుడేమైనది ? స్వామీ ! ఈయమావాస్యదినంబున భక్ష్యభోజ్యముల నర్పించి పూజ చేసెదను. ఇటఁ గొంచెమద్యమును స్వీకరించి మఱి పొమ్ము.'' అని చెప్పుచు నాయువతిని బైఠఖానాకుఁ దీసికొనివచ్చి కాచపాత్రమున నించుక మద్యమును పోసి యామెచేతి కిచ్చెను.

ఆయువతియు దాని నందుకొనక పాత్రమును క్రిందఁ బారవైచెను. అంతలోఁ దేవేంద్రుఁడు దీపమును తెచ్చి చూచి 'నీవెవ్వరు? నిన్నెచ్చటనో చూచినట్లున్నది!' అనియెను.

ఆకాంత దొరకిపోయితినని తలంచుకొని 'నేను హీరను అనియెను.

'Hurrah ! Three Cheers to హీరా!' అనిపలికి యాత్రాగుబోతు తూలుచు తుదకు నేలపైఁ బడి యామెకు సాష్టాంగప్రణామమాచరించి లేచి చేతఁ గాచపాత్రమును పట్టుకొని యీవిధముగా స్తోత్రము చేయ నారంభించెను.

నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః
యాదేవీవటవృక్షేషుఛాయారూపేణసంస్థితా

నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమోనమః
యాదేవీద త్తభవనేహీరారూపేణసంస్థితా
నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమోనమః
యాదేవీవృష్కరతటేశూర్పహస్తేనసంస్థితా
నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమోనమః
యాదేవీసదనద్వారేమార్జనీహస్తసంస్థితా
నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమోనమః
యాదేవీమద్గృహేనిత్యపత్నీ రూపేణసంస్థితా
నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమోనమః

హీరయు నంతకుముందు మధ్యాహ్నసమయమున వైష్ణవి వెనుకనే వచ్చి వయిష్ణవియు దేవేంద్రబాబును నొక్క టేవ్యక్తియని బాగుగఁ దెలిసికొని పోయియుండెను. కాని దేవేంద్రుఁడావేషమున నగేంద్రదత్తుని యింటికేల వచ్చెనో తెలిసికొనఁజాలక యాసంగతి తెలిసికొనవలయు ననుసంకల్పముతోడనే, ధైర్యమును వహించి యీసమయమున దేవేంద్రుని మందిరమునకు వచ్చి గవాక్షమునొద్ద నిలువబడి దేవేంద్రునకునుసురేంద్రునకునుజరగినసంభాషణమునాలకించి మనోరథసిద్ధి నంది వెడలిపోవుచుండెను. అప్పుడు దేవేంద్రుఁడామెను వెంబడించి పట్టుకొని వెంటఁబెట్టుకొనిపోయి బైఠకుఖానాయందామెకుఁగూడ మద్యము నొసంగెను. ఆమెదానిని స్వీకరింపక మీరేపానము చేయుడని చెప్పెను. దేవేంద్రుఁడట్లే పానము చేసెను; అప్పటి కాతనికి పానపూర్తి యయ్యెను. మధుపానమదము తలకెక్కి దేవేంద్రుఁడు కూరుచుండఁజాలక క్రమముగాఁ బండుకొనియెను. సమయమును చూచుకొనుచున్న హీరయు లేచి మెల్లగాఁ దనయింటికి బయలుదేరి పోయెను. ఆమె మరునాటియుదయమునఁబోయి సూర్యముఖికి దేవేంద్రునకు హీరావాకు మధ్య యున్న తెలియఁ జేసెను. కుందనం

దిని నిర్దోషురాలని వారుసంభాషించుకొన్నసంగతిమాత్రము తెలుప లేదు. సూర్యముఖయైన నడిగి తెలిసికొనలేదు. హీర యామాటనేల దాచియుంచినదో యాసంగతి మాపాఠకులకు క్రమముగా బోధపడ గలదు-కుందనందిని వైష్ణవితో నేకాంతముగ మాటలాడియుండుటను సూర్యముఖస్వయముగాఁ జూచియుండెను. అందువలన నామె నిశ్చయ ముగఁబాపాత్మురా లేయని తలంచెను. హీర చెప్పినమాటలనువినినతో డనే నీలోత్పలసన్నిభంబులగుసూర్యముఖ కన్నులయందుఁ గెంపుచా యలుదయించెను. ఆమెకపాలమునందలినరములు పొంగిపోయెను కమ లయెల్లసంగతులును వినియుండెను. సూర్యముఖి యప్పుడు కుందనంది నినిపిలిపించెను. ఆమె వచ్చినతోడనే సూర్యముఖి 'కుందా! హరిదాసి వైష్ణవి యెవ్వరో మాకుఁ బాగుగఁ దెలిసిపోయినది, ఆతఁడునీయుపపతి యని తెలియవచ్చినది. నీవెంతటిదానవో కూడఁ దెలిసినది. మేము నీవంటి దుష్టురాలి నింట నుంచుకొనఁజాలము. నీవిప్పుడే మాయింటి నుండి వెడలిపొమ్ము. అట్లు పోవేని హీరాదాసి నిన్ను చీపురుకట్టతో వెడలఁగొట్టఁగలదు' అని చెప్పెను.

ఆమాటలను వినినతోడనే కుందనందిని తనులత ప్రకంపిత మయ్యెను. ఆమె యట్టె నిలువున నేలఁగూలుటం జూచి కమల యామెను పట్టుకొని మెల్లగ నామె శయనమందిరమునకుఁ దీసికొని పోయి యట శయనింపఁజేసి 'కుందా! యజమానురా లేమనిన నను కొనసిమ్ము! ఆమాటలలో నొక్కదానినైన నేను నమ్మఁజాలను' అని యనేకవిధముల సమాధానోక్తులం బలికి యామె నూఱడించెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము

### అ నా థ

గభీరతరం బగు రాత్రిసమయమున నింటిలోనివా రందఱును నిదురించినతరువాత కుందనందిని తాను శయనించియున్న యింటి తలుపులను తీసికొని వెలుపలకు వచ్చి కట్టుబట్టతోమాత్రము సూర్య ముఖమందిరమును వదలి బయలుదేరి పోయెను. భయంకరం బగు నా రాత్రిసమయమున నేకవసనయు నేకాకినియు నగు పదునేడేండ్ల వయసుగల యనాథయువతి యొక్క తెయు సీ యిహసంసారసాగర మున దుమికినది.

కుందనందిని యెప్పుడు నిల్లువిడిచి పోయినదికాదు. ఆరాత్రివేళ నింటిచుట్టును తిరిగితిరిగి నగేంద్రుడు శయనించియుండిన యింటి గవాక్షమునొద్దకు వచ్చి నిలువఁబడియెడు. అట నామందిరాంతర్భాగ మున దీపపువెలుతురు గనబడుచుండెను. ఆవెలుతురుం గాంచి శలభము లాదీపమునొద్దకుఁ బోయి పడవలయు నను నాశతో లోనికిఁ బోవఁ బ్రయత్నించుచుండెను. కాని యీ గవాక్షద్వారమున కడ్డములు వేయఁబడియుండుటవలన వాని కాశాభంగము కాగా నవి యచ్చటనే తిరుగాడుచుండెను. కుందనందిని తన మనసునందు వానికొఱకు పశ్చా త్తాప పడఁజొచ్చెను.

కుందనందిని ముగ్ధనయనయై గవాక్షమునుండి ప్రసరించుచున్న వెలుతురును గాంచుచు నిలిచియుండెను. ఆమె యీ వెలుతురును విడిచి పోవఁజాలకుండెను. ఆ మందిరమునకు ముందుభాగమున పెద్ద పనసచెట్లు రెండు కలవు. కుంద యందొక చెట్టుమొదట గవాక్షమున కెదురుగఁ గూరుచుండెను. రాత్రిగాఢాంధకారము. దశదిశలనంధకా రము వ్యాపించి యుండెను. చెట్టుచెట్టునను మెఱుగుడుబురువులు

మిణుమిణుల వెలుఁగుచున్న [illegible]
మరల నెగడుచుండెను. మరల మఱుఁగుచుండెను. ఆకాశమున నీల
మేఘ మాలికవ్యాపించియుండెను. దానిముందింకను నీలంబును సాం
ద్రంబును నగుకాఱుమబ్బు మలసి యుండెను. ఒకటిరెండుచుక్కలు
మాత్రము మినుకుమినుకుమనుచుండెను. ఒక్కొక్కసారి మబ్బు
మూసికొను చుండెను. ఆయింటిచుట్టును విశాలశాఖాప్రకాండంబు
లచే సమున్నతంబులగు భూమీరుహంబులు తలనెత్తికొని నిశాచర
పిశాచములంబోలి నిలిచియుండెను. కరాళవదనభీకరం బగునాగా
ఢాంధకారంబున వాయు సంచాలనంబునంజేసి యావృక్షములు కుం
దనందినితలపైఁ దమపై శాచిక భాషతో సంభాషించుకొనుచుండెను
పిశాచములుకూడ దారుణంబగు నారాత్రిసమయమున భయముచే
మెల్లగ మాటలాడుకొనుచుండెను. ఒక్కొక్కప్పుడు వాతాహతిచే
నాగవాక్షకవాటములు గోడకుఁ దగిలిన చప్పుడగుచుండెను. నల్లని
గుడ్లగూబ యామందిరమునకుఁ బై భాగమునఁ గూరుచుండి కూయు
చుండెను. ఒక్కొకసారి కుక్కయు దేనినోచూచి పారిపోవుచుండెను
అప్పుడప్పుడు చెట్లమీఁదనుండి యెండుటాకులో కాయలో క్రిందఁ
బడుచుండెను. దూరమునఁ జెట్లయాకులు గలగలఁ జలియించుచుం
డెను. దవ్వులనున్న తాళవృక్షములయందలి గరిగమ్మ మర్మరధ్వ
నులు వినవచ్చుచుండెను. అన్నిటిమీఁదను గవాక్షమునుండి వెలు
తురు ప్రసరించుచుండెను. మిడుతలగుంపు ముందునకుఁ బోయిపోయి
తిరిగివచ్చుచుండెను. కుందనందిని యావంక వీక్షించుచుఁ గూరు
చుండెను.

నగేంద్రుఁడు నిదురనుండిలేచి యాగవాక్షమునకు లోపలను
న్నతెరను విచ్చి యాగవాక్షమును మాటుపఱచెను.

అయ్యో! నిర్దయుఁడా! ఆతెరయట్లే యున్నచో నీకేమినష్ట
ము వచ్చినది? నీవింతరాత్రివేళ లేచుట కేమికారణము? హాయిగ

నీదురిఁ ప్రము! నిద్రలేకపోయినచో నీకు జబ్బు చేయఁగలదు. కుంద నందిని చచ్చినఁ జావనిమ్ము. నీకుమాత్రము జబ్బుచేయఁగూడదు. ఇదియే కుందనందిని మనఃపూర్వకమైన కోరిక—

ఇంతవఱకును వెలుతురు నొసఁగుచున్న గవాక్ష మంధకారమ యమయ్యెను. వెలుఁగువంకనే చూచుచున్న కుందనందిని యప్పుడు కన్నుల నలుపుకొనుచు లేచెను. వెంటనే యామెకంటికగపడిన మా ర్గమునుబట్టి బయలుదేరెను. ఆమె యెక్కడకుఁ బోవుచున్నది. నిశా చరపిచాచములవలె నిలిచియున్న వృక్షము లామెంగూర్చి "నీవెచ్చ టికిఁ బోయెదవు" అని పలుకరించుచున్న వేమోయనునట్లు మర్మర శబ్దములం జేయుచుండెను. తాళవృక్షము "నీవెక్కడకుఁ బోయె దవు" అని యడుగుచున్నట్లు కరకర యని ధ్వనిచేయుచుండెను. గవాక్షములు మాత్రము "పోయినఁ బొమ్ము! నీకుమాత్రము నగేం ద్రునిం జూపఁబోను" అని మౌనభావమును వహించి యుండెను. అయిన నాకుందనందిని—బోధించువారు లేనియాకుందనందిని వెను కకుఁ దిరిగితిరిగి చూచుచుఁ బోవుచుండెను.

కుందనందిని పోయెను. అటనుండి వెడలిపోయెను. ఆకాశతలం బునఁ గారుమబ్బులలముకొనుచుండెను. మేఘములపై మేఘములు బ యలువెడలుచుండెను. మేఘము లన్నియును చేరి యాకాశమునఁ గూ డ రాత్రిగాఁ జేసెను. మెఱపు నవ్వెను. మరల వాయువు గర్జించెను. మేఘముకూడ గర్జించెను. గాలియు, మేఘమునుగూడ నొక్క సారిగా గర్జించెను. "నీవెక్కడకుఁ బోయెదవే!" అని—

రౌద్రచండమారుతములు విజృంభించుచుండెను. మొదట ధ్వని మాత్రము వినవయ్యెను. అనంతరము ధూళి యంతటను క్రమ్ముకొని యెను. తరువాతఁ దరుపత్రములను గదలించుచు రాల్చి చూపుచుఁ బ్రభంజనమే స్వయముగ విచ్చేసెను. తుట్టతుదకు చిటపట చినుకు లును పడనారంభించెను. కుందనందినీ! ఎక్కడకుఁ బోయెదవు?

మెఱుపులవెలుతురునఁ గుందనందిని కాల్త్రోవ ప్రక్కను సామాన్యమైన యొకగృహ మగపడియెను. ఆయింటికి నలువంకలను మంటితో నిర్మించినగోడ యున్నది. గృహమేమో చాలఁ జిన్నది. కుందనందిని యచ్చటకుఁ బోయి ద్వారమునొద్దఁ గూరుచుండి తలుపును చేరఁబడి కూర్చుండెను. ఆమె నెన్ను తగిలినతోడనే తలుపు చప్పుడయ్యెను. గాలియేమో యని యింటివారంతగా లక్ష్యము సేయక యూరకుండిరి. కాని యంతలోఁ గుక్క మొఱిఁగెను. అప్పు డింటిలోనివారు భయపడి తలుపులు తీసికొని వచ్చి చూచిరి. వాన మూలమున నొకయువతీమణి వచ్చి యావాకిటఁ గూర్చుండి యుండెను.

గృహస్థ—అమ్మా! నీవెవ్వరు?

కుందనందిని మాటాడలేదు.

గృహ—ఎవ్వతె వేనీవు?

కుంద—వానమూలమున నిటకువచ్చి కూరుచుంటిని.

గృహ—ఏమి? ఏమి? మరల జెప్పుము?

కుంద—వానవలన నిటఁ గూరుచుంటిని.

గృహ—కంఠధ్వని బోధయైనది. లోపలకు రమ్ము.

కుందనందిని లోపలకుఁ బోయెను. దీపము వెలుగునఁ జూడఁగా నాయింటియామె హీరాదాసి యైయుండెను.

హీర—తెలిసినది. తిరస్కారమును సహింపఁజాలక యిట్లు వచ్చితివి. సరే. నీకేమియును భయము లేదు. నే నెవ్వరితోడను నీసంగతి చెప్పఁదానఁగాను. నాయింటియందే రెండుదినము లుండుము.

---

## పందొమ్మిదవ ప్రకరణము

హీర యింటిచుట్టు నున్నగోడ చాలఁ జిన్నదిగా నుండెను. అదియును మంటిగోడ. ఆగృహమునం దొకచో వంటయిల్లును,

మఱియొక చోట నట్టిల్లును, మఱియొక గదియును కలవు. ముందుభాగమునఁ బూవులతోఁట యున్నది. అందామె యజమానుని యుద్యానవనమునందలి మల్లె, గులాబి, మొదలగు పూలచెట్లకుండ్లు నిలుపఁబడియుండెను. అక్కడనున్న తోటవాఁడే స్వయముగ నాపూలకుండ్ల నెత్తికొనివచ్చి యామె పూవుదోఁటకు జేర్చుచుండెను. అందులకుఁ బ్రతిగా హీరాదాసి యాతనికి స్వయముగ హుక్కానుచేసి యాతఁడు వచ్చినతోడనే కంకణవిలసితంబగు తన కరపంకజముతో హుక్కా నాతని కొసంగుచుండును. తోఁటమాలియు నాహుక్కాను బీల్చి తనయింటికిఁ బోయి రాత్రివేళ దానినిగూర్చి బాగుగ యోచించుకొనుచుండును.

హీరగృహమున నామె మాతామహియు, నామెయుమాత్రమే యుండిరి. మఱి యితరు లెవ్వరును లేరు. హీర యొక గదియందును, నామె మాతామహి మఱియొక గదియందును శయనించుచుండురు. కుందనందినిని లోపలకుఁ దీసికొనిపోయి హీరాదాసి తనయొద్దనే పడక నేర్పఱచి యామెను పరుండఁ జేసెను. కుందనందిని శయనించెను, కాని నిదురమాత్రము చెందలేదు. మరునాఁ డామె యిష్టానుసారముగా ముసలిదానికిఁ దెలియకుండునట్లు కుందనందిని నాయింటియందే యుంచి వెలుపల బీగము వైచికొని హీరాదాసి తన పనిలోనికిఁ బోయెను. మూఁడుజాములైనతరువాత ముదుసలికాంత స్నానమునకుఁ బోయినతోడనే హీర వచ్చి కుందనందినిని స్నానముచేయించి యామె కాహారము నొసంగెను. మరల నదేవిధముగ నామె నా గదియందుంచి వెలుపలఁ దాళము వైచికొని పోయెను. తరువాత రాత్రివచ్చి శయనము నేర్పఱచెను. ఇరువురును శయనించిరి.

ఆ సమయమున వీధితలుపునందలిగొలుసు గలగలమని చప్పుడయ్యెను. హీరాదాసి విని యాశ్చర్యపడియెను. రాత్రివేళ నప్పు

డప్పుడా రక్షకభటుఁడుమాత్ర మప్పుడప్పుడు నిద్రమేల్కాంచుట కలదు. కాని యాతఁడు కదలించునప్పటిశబ్ద మంత మధురముగా నుండుటలేదు. 'తలుపు తీయుము! తీయకున్నచోఁ బగులఁగొట్టెదను.' అనునట్లు గడబిడగా ధ్వని యగుచుండెను. ఇప్పుడో—ఇప్పుడాశబ్దము 'నాహీరామణీ! ఏమి చేయుచున్నావు? చెప్పుము!' అని పలుకుచున్నట్లుండెను. హీర తలుపులు తెరచి చూచెను. ద్వారముకడ నొకయువతి నిలువఁబడి యుండెను. మొట్టమొదట నామె యెవ్వతెయో యానవాలు తెలియ లేదు. కొంతసేపటికి గుర్తించి హీరాదాసి 'ఓగంగాజలా! నీవా? ఏమి నాయదృష్టము! ఇదేమే! కంటిలోఁ నలుసువైపోయితివి! ఎక్కడను కనఁబడుటలేదు.' అనియెను.

గంగాజల పాలును, పెరుగును, నమ్ముకొనుచుండు గోపకాంత. ఆమెయిల్లు దేవీపురమున దేవేంద్రుని యింటిపొరుగుననే యుండెను. ఆమె చాల రసికురాలు. ముప్పదిముప్పదియైదు సంవత్సరముల వయ సుండును. ఆమె నీలిచీరను కట్టుకొనియుండెను. చేతులను వెండికంక ణములుండెను. అధరమునఁ దాంబూలరాగము కలదు. సామాన్య ముగ గౌరాంగి యని చెప్పవచ్చును. మొగముపై నందందుఁ గెంపు చాయలు కలవు. ఆమె నాసికమాత్ర మించుక మొండిగా నుండును. ఆమె కపాలముపై నడుగు గుఱుతుకలదు. వుక్కిటఁ బొగాకునుంచి నమలుచుండెను. ఆగోపయువతి దేవేంద్రునిదాసికాదు. ఆతనియాశ్రితు రాలును గాదు. కాని యాతనిమాటకు జవదాఁటనిదై యుండెను. అనితరసాధ్యంబు లగుకార్యంబుల నామె యాతనికిఁ దోడుపడి కార్య సిద్ధిరొనరించుచుండును. మాలతి యనుపేరుగల యాగొల్లచేడియం గాంచి చతురమతి యగుహీరాదాసి "అక్కా! గంగాజలా! నీవు నాకడపటి కాలమునకు దయచేయుమమ్మా! కాని యిప్పుడెందులకు వచ్చితివి?" అని యడిగెను.

గంగాజల హీరాదాసి చెవియందు మెల్లమెల్లగా 'దేవేంద్ర బాబు నిన్నుఁ బిలిచికొనిరావలయు నని నన్నుఁ బంపి యున్నాఁడు.'' అనిచెప్పెను.

హీరాదాసి మిగుల నుత్సాహముతో నవ్వుచు 'ఏమైనను దొరకి యుండవచ్చును. లాభము లేకయే యుండునా?' అనియెను.

మాలతియు చేతులతో నామెను బట్టుకొని ''లాభమేమున్నది? మరణమే లాభము! నీమనసునందున్నదానికి నీవు చెప్పితివి. ఇప్పుడే బయలుదేరను పోవుదము.'' అనియెను.

హీరాదాసి కర్కడకుఁ బోవలయుననియే యాశ్ర. అప్పుడామె నందనందినిం బిలిచి ''నేను బాబుగారియింటికి మరలఁ బోవలసివచ్చినది. నన్నుఁబిలుచుటకొరకు వచ్చియున్నారు. ఎందులకో యేమో! ఎవ్వరెఱుంగుదురు?'' అని చెప్పి దీపము నార్పివైచి యంధకారమునందే [illegible] దనయుడువులను ధరియించుకొని యాస [illegible] బయలుదేరి పోయెను. అట్లుపోవుచు వారిరువురు నాయం [illegible] నైకకంఠ్యముగ నీక్రిందిరీతిని బాడుచు [illegible]——

[illegible]మందిరముఁ జేరి వెలుఁగొందు ♦ [illegible]కి
ననవరతమును శోషిల్లు ♦ నంబునిధికి——

దేవేంద్రుని [illegible]లోనికి హీర [illegible] తెచ్చిపోయెను. [illegible] ([illegible]) [illegible] రాత్రిగా నింకను మత్తు [illegible] [illegible] హీరా [illegible] తెలివి [illegible] నేను [illegible] [illegible] [illegible] తెలిసికొన [illegible] [illegible] '' అని పలికెను.

హీరా—మీ దర్శనము చేసికొని పోవలయు నని వచ్చి యుంటిని.

దేవేం—(నవ్వుచు) నీవు మిగుల బుద్ధిమంతురాలవు. అదృష్ట వంతుఁ డగుటచేతనే నగేంద్రుఁడు నీవంటిదానిని దాసిగాఁ బడసియు న్నాఁడు. నీవు హరిదాసివైష్ణవిసమాచారమును తెలిసికొనుటకును, నేనెందుకొఱకు వైష్ణవివేషముం దాల్చి దత్తునియింటికి వచ్చుచుం టినో యాసంగతిని గ్రహియించుటకును నాయింటికి వచ్చి యుంటివి. నాఁడువచ్చి యెల్లసంగతులను తెలిసికొంటివి. నేనాసంగతు లేవియును నీయొద్ద దాఁచుట లేదు. నీవు స్వామికార్యమును నెఱవేర్చి నీప్రభువు వలనఁ దగినబహుమానమును బడసితివి. అందులకెంతమాత్రమును సందియము లేదు. ఇప్పుడు నాదొకకార్యమును సాధించి చేకూర్చెద వేని నేనును నీకుఁ దగినపురస్కారముం జేసెదను.'' అనిచెప్పెను.

మహాపాపసాగరనిమగ్నులగు దురాత్ములసంభాషణముంగూర్చి వ్రాసి స్పష్టపఱచుట మిగులఁ గష్టసాధ్యమైనపని. దేవేంద్రుడుహీరకు విశేషధన మొసంగెద నని యాశపెట్టి కుందనందినిని తన కొప్పగింప వలయునని కోరెను. హీరాదాసి యావాక్యమును వినికోపగించు కొని యెను. కమలదళసన్నిభంబు లగునామెనయనములురక్తకాంత్యుజ్జ్వ లము లయ్యెను. ఆమెశ్రవణయుగళమున నగ్నివృష్టి యైనట్లుండెను. అప్పు డామె లేచి ''నేను దాసినని యూహించి మీరిట్లు చెప్ప సాహసించితిరి. స్వామీ! నేనందులకుఁ బ్రత్యుత్తరము నొసంగఁ జాలను. మా ప్రభుండగు నగేంద్రుఁ డందులకు సమాధానము చెప్ప గలఁడు. వారే యందులకుఁ దగినయుత్తరము చెప్పుటకర్హులు.''అని చెప్పి బయలుదేరి పోయెను. దేవేంద్రుఁడు కొంచెమునే పేమియుం దోఁచకుండుటచే భగ్నోత్సాహుఁడై యూరకుండెను. అనంతరము పొట్టపట్టినంతవఱకు రెండు సీసాలబ్రాందిని త్రాగెను. అప్పటి కిం చుక మనసుకుదుటఁబడుటచే రాగము నాలాపించి గానము చేయ నారంభించెను.

## ఇరువదియవ ప్రకరణము

### హీ రా దా సి ద్వే ష ము

హీరాదాసి యుదయముననే లేచి తనపనిలోనికిఁ బోయెను. నగేంద్రదత్తుని మందిరమున రెండుదినములనుండి చాలనల్లరిగా నుండెను. కుందనందిని యెచ్చటను కానఁబడుట లేదు. ఆమె కోపించి యెచ్చటికో లేచిపోయినదని యింటివారందఱును తెలిసికొనిరి. పౌరుగువారల కీసంగతి కొందఱికిఁ దెలియును. కొందఱికిఁ దెలియనే తెలియదు. కుందనందిని యిల్లువిడిచి పోయినదని నగేంద్రునకును తెలిసెను. కాని యెందులకుఁ బోయినదో యాతని కెవ్వరును తెలిపి యుండలేదు. ఆమెతోఁ దానుపలికినపలుకులవలన నామెసందేహించి యెచ్చటికో చెప్పకుండఁ బోయియుండు నని యాతఁ డూహించుకొనియెను. అట్లే యైనచోఁ గమలతోఁ గలకత్తానగరమున కేలపోఁ గూడదు? నగేంద్రుని ముఖమండలము మేఘావృతం బగుచంద్రబింబముం బోలి యుండెను. అతని సమీపమునకు, బోవుట కెవ్వరికిని ధైర్యము లేక యుండెను. సూర్యముఖిదోస మేమియో యదియెవ్వరికిని దెలియదు. కాని యామెతోఁ గూడ నగేంద్రుఁడు మాటలాడుట మానివేసెను. కుందనందినిని వెదకుటకుఁ బ్రతిగ్రామమునకును జనులు పంపఁబడిరి.

సూర్యముఖియును, కోపమువలననో, ఈర్ష్యవలననో, మఱిదేనివలననో, గాని కుందనందిని వెడలిపోవుటంగూర్చి చాలభయపడియెను. కమలమణి దేవేంద్రుఁడు చెప్పినమాటలు నమ్మనర్హములుగావనియు, కుందనందిని దేవేంద్రునియెడల గుప్తప్రణయయేయై యున్నయెడల నదియింటినుండి వెడలిపోవుటకుఁ గారణము లేదనియు కుందనందిని స్వభావమునుబట్టి చూడఁగా నది యంతటికులటగాఁ

దోఁచుట లేదనియు, దేవేంద్రుఁడు కేవలము టక్కరికాఁడగుటవలన మధుపానమదంబున వట్టిదంభములకుఁ దోడుగ నసత్యమైన ప్రవాదముకలిగించెననియు సూర్యముఖికి సకాలముగఁ దెలియఁజేసెను ఈవాక్యముల నాలకించుటచే సూర్యముఖికిఁ బశ్చాత్తాపము గలిగి తననాథున కందువలనకలిగిన విరక్తభావముంగూర్చి మఱింత మనస్తాపముకూడఁగలిగెను. ఆమెయప్పుడు నూఱుసారులు కుందనందిసిని తిట్టెను. వేయిసారులు తన్నుఁదిట్టుకొనియెను. తుద కామెకూడఁ గుందనందినిని వెదకుటకై నలుదిక్కులను సేవకులను బంపించెను.

కమలమణి తాను కలకత్తాకుఁ బోవుప్రయాణము నాఁపివైచెను. ఆమెమాత్ర మెవ్వరిని తిట్టలేదు. సూర్యముఖినైన నాక్షేపింపలేదు. ఆమె తనకంఠమునందలి హారమును దీసి దాని నింటనుండు పరిచారికలందఱకును జూపించి "కుందనందినిని నెవ్వరుతీసికొని వత్తురో వారికీహారమును బహుమానముగ నిచ్చెదను." అని చెప్పెను.

పాపాత్మురాలగు హీరాదాసి యంతయును విని తెలిసికొనియెను. కాని యేమియును చెప్పలేదు. కమలమణి [illegible] చూచి మిగుల నాశపడియెను. కాని యాయాశను తనలోనే యణఁచుకొనియెను. రెండవదినమున [illegible] ముగించుకొని యింటికిఁ బోయి [illegible] బోయిన [illegible] కుందనందినికి భోజనాదిక మొసంగెను. రాత్రి మరల వచ్చి యెప్పటివలె సేవారతపరురాలయ యుండిరి. ఆనాఁటి [illegible] గాని హీరాదాసి గాని నిద్రింపలేదు. కుందనందిని తన [illegible] నెమ్మనమున నూహించుకొనుచు మేలుకని యుండెను. హీరా [illegible] అనుగూర్చి యూహించుకొనుచు జాగరము చేయుచుండెను. [illegible] నలు [illegible] దెలుపదగినదియా? [illegible] యూహించుకొనఁ దగినదే.

ఓ హీరా! ఛీ! ఛీ! చూచుటకు నీవు కురూపిణివి కావు. నీవ యసుమాత్రమో? ఇంకను నీవు చిన్నదానవు. అట్లయ్యును, నీహృదయమునం దంతటి కాపట్యమును దౌష్ట్యమును కానబడుచున్న వేమి? బ్రహ్మ వాని నన్నిటిని సార్థకపఱుపక మోసగించి యున్నాఁడా? అతఁడెల్లరకును మోసము చేయుటయందే యిష్టముకలవాఁడు. హీరా దాసిని సూర్యముఖియున్నస్థితిలో నుంచినచో నప్పు డామెహృదయమునం దంతటి కాపట్యముండునా? ఈవిషయముంగూర్చి హీరనడిగినచో "ఉండదు" అని చెప్పఁగలదు. హీరను హీరయున్నస్థితిలో నుంచుటవలననే యామె హీరయైనది. ప్రపంచమునందలి జనులు దుష్టసహచర్యమున దుష్టులయ్యెదరని చెప్పుచుందురు. దుష్టుఁడు కూడఁ దాను మంచివాఁడనే యనియు, సహవాసదోషమునఁ దాను దుష్టుఁడనై పోయితి ననియుఁ జెప్పుచుండును. జనులెన్నటికిని నైదేడు కాదనియు, నేడైదు కాదనియుఁ జెప్పుచుందురు. అంతియకాక తనకు రెండు చేర్చినచో నేడగుదు ననియు, పరమేశ్వరుఁడు నాకు రెండు చేర్చినచో నేడగుదునుగదా యనియు నైదు చెప్పుచుండును. హీరా దాసియు నట్లే యోచించుచుండెను.

హీర చాలవఱ కాలోచించిచూచెను. ఆయోచనాపరంపరం గూర్చి వ్రాసిముగింపఁజాలము." పరమేశ్వరుఁ డన్నియానుకూల్యములను కటాక్షించి యున్నాడు. నాతప్పువలన వానిని బోగొట్టుకొనఁ గూడదు. ఒకవిధమున నాలోచింపఁగా కుందనందినిని నగేంద్రునింటికిఁ దీసికొనిపోయినచో కమల మణిహారమునిచ్చును. సూర్యముఖియు నేమైననీయఁగలదు. నగేంద్రుఁడు నీయకుండఁడు. మఱియొకవిధమునఁ గుందనందినిని దేవేంద్రునకొప్పఁగించినయెడల నాతడునాకువిశేషధనము నిచ్చును. కాని యామెమాత్ర మచ్చట ప్రాణములతో నిలువఁజాలదు. మంచిది. దేవేంద్రుఁడు కుందనందిని యంతటిసుందరీమణి యని

యేల భావింపవలయును ? నేనిట్లే యెల్లకాలమును శ్రమపడి పొట్ట పోసికొనఁజాలను. నాకును సుఖపడవలయు నను నాశలేదా ? ఆమె దేవేంద్రుని మర్మము నెఱుంగదు. ఆమె సుందరియే కావచ్చును. పంకములేనిచోఁ బద్మము పుట్టనేరదు. కుందనందినియే లేనియెడల దేవేంద్రునకామెపై మోహ ముదయింపదుగదా ! అది వారివారి యదృష్టము ! పోనిమ్ము ! నేనెందులకు కోపమును వహింపవలయును? అయ్యోదేవుఁడా ! ప్రేమ యననేమి ? వట్టినోటిమాట ! కావలసిన వారు ప్రేమించుకొననిమ్ము ! నేనెవ్వరిని ప్రేమించుట లేదు. వైరాగ్యముకూడ నంతే. వైరాగ్యమునకుఁ బోయినచోఁ దుదకు గంగాజలంబుల మునుగుటయే లాభము! దొంగను వెదుకఁబోయి నామనసు తానే దొంగిలింపఁబడిపోయినది ! ఆహా ! ఏమియావదన మండలము ! ఏమి యావిశాలనేత్రములు ! ఏమి యాకంబుకంఠము ! అట్లెవ్వరికి నుండఁబోవు. ఆతఁడు నన్నుఁ గన్నారఁ జూచియుఁ గుందనందినిం దీసికొని రావలయునని వచియించెనుగాదా ! మంచిది. ఎట్లయినఁ గానిమ్ము. ఆత్రోవ సరియైనదిగాదు. ఈజన్మమునందు నాసుఖదుఃఖముల నన్నిటిని పరమేశ్వరుఁడు చూచుకొనుఁగాక ! కుందనందినిని దేవేంద్రునిచేతుల కొప్పగింపఁజాలను. ఆసంగతి జ్ఞప్తికి వచ్చినచో నాయొడలంతయు గడగడ వడఁకుచుండును. ఆతఁడు వైష్ణవియే కానిమ్ము. వాసుదేవుఁడే కానిమ్ము. కుందనందిని యాతని యొద్దకుఁ బోవఁజాలదు. మొదట నామె యేయింటనుండెనో యాయింటికే పోవలయును. కాని యామెమాత్రము పోవుట లేదు. మేమందఱమును చేరి చెప్పినచోఁ బోయినఁ బోవచ్చును. అట్లయినచో నేమగును! సూర్యముఖి కమలమువంటి ముఖము కపిముఖము కాఁగలదు. సూర్యముఖిపై నాకుఁ గోపమెందులకు ? ఆమె నాకెన్నఁడు నపకారము చేసియుండలేదు. ఉపకారమే చేయుచుండెను. అట్టిచో నామె

పైఁ గోపమెందులకు ? హీరకంతమాత్రము తెలియదా ? చెప్పుట యెందులకు ? సూర్యముఖి సుఖవతి. నేను దుఃఖిని అందువలననే కోపము. ఆమె ధనవంతురాలు. నేను నిరుపేదరాలను. ఆమె యధికారిణి. నేను దాసిని. అందువలననే యామెపై నాకుఁ గోపము. దేవుఁడామె నంతటిభాగ్యవతిగాఁ జేసియున్నప్పుండి దామెదోషమేమున్నది ? నేనేలయామె కపకారము చేయవలయును ? ఆవిషయమున నాకుఁ దోఁచిన దేమనఁగా—ఇతరుల కకారణముగ నపకారము చేయుటకే పరమేశ్వరుఁడు నన్ను సృజియించియుండెను. ఇందునాతప్పు మాత్ర మేమున్నది ? నేను కావలయునని కోరి యామె కపకారము చేయుట లేదు. ఆమెకుఁ జెడుగ్గైనచో నాకు మేలు కాఁగలదు. ఇట్టిస్థితిలో నేను చెడుగు చేయఁగూడదా ? తమమేలుకొఱకు కావలసినపనులను విధాయకముగ నెవ్వరు చేసికొనరు ? ఇట్లు బాగుగ నాలోచించి చూడఁగా నెవ్వరివలనఁ నెవ్వరి కేమగును ? నాకిప్పుడు ధనము కావలసియున్నది. పరిచారికత్వమును నిర్వహింపఁజాలను. నాకు ధన మెచ్చటనుండి వచ్చును ? నగేంద్రునియింటి నుండితక్క మఱియొకచోటినుండి రాఁజాలదు. అదియెట్లురావలసి యుండును ? నగేంద్రుని కన్ను కుందనందినిపై బడియుండుట నెల్లరు నెఱుంగుదురు. నగేంద్రుఁడును కుందనందినీమంత్రమునే జపియించుచుండెను. గొప్పవారిమాట మీఁద వారు తమయిచ్చవచ్చినరీతిని చేయఁగలరు. సూర్యముఖి కొఱకు భయపడి వెనుదీయుట సరికాదు. వారిరువురకును పరస్పరమనోవైకర్యము కలుగునేని రాణియగుసూర్యముఖి మొగసిపాటుఁగాఁ గలదు. వారికిఁ బరస్పరమనోవైకల్య ముదయించునట్లు చేయవలయును. అట్లు చేసినచో నగేంద్రుఁడు కుందనందనికి షోడశోపచారములను జేయ నారంభించును. కుందనందినియుఁజాల మంకుపిల్ల. నేనప్పుడు బుద్ధిమతి నయ్యెదను. కుందనందినిని శీఘ్రముగ వశపఱచు

కొని యామెమూలమున నేమికావలసిన దానిని బడయవచ్చును. కుందనందిని యారాధనమున కారంభమైనతోడనే నగేంద్రుఁడామెకు వశంవదుఁడై యుండును. అప్పుడు కుందనందిని నాకు వశవర్తినియై యుండును. అప్పుడు పూజాసాధనము లన్నియును నాచేతిలోనుండును. కానిమ్ము, దుర్గాదేవి యేమి చేయునోచూతము నగేంద్రున కిప్పుడు కుందనందిని నొప్పగింపవలయును. కాన యింతలోఁ ద్వరగా నొప్పగింపఁగూడదు. మొట్టమొదట నామెను కొన్నిదినముల వఱకు నాతనికిఁ గనుచాటుగనుంచి చూడవలయును. విచ్ఛేదమే ప్రథమపాతము. విచ్ఛేదమే యున్నయెడల నగేంద్రునిప్రేమ బాగుగఁ బరిపక్వస్థితి నందఁగలదు. తరువాతఁ గుందనందినినిబయటఁ బెట్టవచ్చును. అంతలోపల సూర్యముఖియును మెత్తఁబడఁగలదు. ఈయవకాశమునసే కుందనందినిని బాగుగ వశపఱచుకొనవలయును. ఇప్పుడు మొట్టమొదట మాయమ్మమ్మ సీయూరినుండి వెడలింపవలయును. అట్లు కానిచోఁ గుందనందినిని రహస్యముగా నుంచుట యసాధ్యము'' అని యావిధముగా నామె యోచించుకొనియెను.

ఇట్లు యోచించి పాపాత్మురాలగు హీరాదాసి తనయుద్దేశము నాచరణములోనికిఁ దీసికొనిరా నారంభించెను. అనేకములగు నెపములను చెప్పి తనమాతామహిని వెంటనే యూరికిఁ బంపించెను. కుందనందినిని యెవ్వరికి నగపడకుండఁ దనయింటియందుంచుకొనియెను. కుందనందినియు నామె యుపచారములవలన సంతుష్టురాలై హీరాదాసివంటివా రితరు లెవ్వరు నుండరనియు కమలమణివైన నంతగాఁ దనస్సు [illegible] లేదనియు భావించుకొనియెను.

## ఇరువదియొకటవ ప్రకరణము

### హీరకలహము—విషవృక్షము కుళము

కుందనందినియేమో స్వాధీనయైపోయినట్లే. కాని సూర్యముఖీ నగేంద్రుల నయనములు విషపూరితములు కాకుండెనేని లాభమేమి యును లేదు. వారిభిన్నహృదయములను ముందుగఁ బ్రహరించుప్రయత్నమున హీరాదాసి ప్రవర్తింప నారంభించెను.

ఒకనాఁడు పాపాత్మురాలగు హీర తనయజమానునియింటికి వచ్చి పనులను చేయుట కారంభించెను. అటఁ గౌసల్య యనుపేరు గల మఱియొక పరిచారిక కలదు. హీరకుఁ దక్కినపరిచారిక లందఱి మీఁద నధికార ముండుటవలనఁ గౌసల్యనామె విశేషము బాధించుచుండెను. అప్పుడు హీర కౌసల్యయొద్దకుఁ బోయి "అక్కా! ఈదినమున నాశరీరమునం దెట్లో యున్నది. నాపనులను నీవు చేసిపెట్టెదవా?" అని యడిగెను. కౌసల్యయు, హీరయనిన భయపడుచుండు కారణమున నామె చెప్పినట్లంగీకరించెను. "అట్లే చేసెదను. ఎల్ల కాలము నొక్కరీతిగనే యుండునా యేమి? తలనొప్పి, కాలునొప్పియు వచ్చుచునేయుండును. అందఱును వచ్చి యింటిపనులను జేసికొనుచుందురు. చేయుటకేమమ్మా? అట్లే చేసెదను." అనియెను. హీరాదాసి యెట్లయినను జగడము పెట్టుకొనవలయు ననునుద్దేశముకలదగుటచేఁ దల నూచుచు "అదియేమే! నన్నట్లుతిట్టుచున్నావు?" అనియెను. కౌసల్య యదరిపడి "నేనెప్పుడు నిన్నుఁదిట్టితినే!" అనియెను.

హీరా—నాసవతి! తిట్టుము! ఎప్పుడా? తలనొప్పి యెవ్వరికే? కాలునొప్పి యెవ్వరికే? నేను చావవలయునేమి? నీవే చావుము! ఎవ్వరికి నెన్నఁడు రానిరోగము నీకేరానీ!

కౌస—కానిమ్ము! రావలసిన యోగమున్నచో నారోగము నిన్నడిగి రాదులే. ఊరక కోపమెందులకే? ఎప్పటికైన నొకప్పటికి

చావుండనేయున్నది, ఆయమధర్మరాజు నిన్నును మఱచిపోఁడు. నన్నును మఱచిపోఁడు.

హీరా.—నీకు సంకటము వచ్చుఁగాక! నీవే నాశనమై పోయెదవు. నీమొగము తగులఁబెట్ట! నీచావు నీవే కొని తెచ్చుకొనుచున్నావు.

కౌసల్య యామాటలకు సహించి యూరకుండలేక పోయెను. తిట్లు తిట్టుటలో నామె హీరకంటెను శతగుణము లధికసమర్థయే ఆమె హీరను వేయివిధముల వర్ణించి తిట్టుచు మఱి యామెనోట మాట రాకుండఁ జేసివైచెను.

హీర యప్పుడు రాణియొద్దకుఁ బోయి మొఱ పెట్టుకొనియెను. ఆమె రాణియొద్దకుఁ బోవునప్పుడు చూడఁగా నామె మొగమునఁ గోపలక్షణము లేవియును గానవచ్చుట లేదు. అప్పుడామెవదనమండలమునఁ జిఱునగవే కానఁబడుచుండెను. ఆమె సూర్యముఖియొద్దకుఁ బోయినతోడనే విలక్షణం బగుక్రోధభావ మామెవదనమున నగపడియెను. అంతియకాక యప్పుడామె సామాన్యముగ నాఁడువాండ్రకుఁ బరమేశ్వరుఁ డొసంగినపరమాస్త్రము నచ్చట బయటికిఁ దీసెను. అనఁగా గోలుగోలున నేడ్చి రోదనధ్వనులతో దేశమునే ముంచివైచెను.

సూర్యముఖి యించుక విచారించి విహితరీతిఁ బరీక్ష చేసి చూడఁగాఁ దప్పు హీరాదాసియందే కానవచ్చెను. అయినను సూర్యముఖి హీరవిన్నపమును మన్నించి కౌసల్యనే యించుక మందలించెను. హీరయంతమాత్రమున సంతుష్టి వహింపఁజాలక యాకౌసల్యను పని లోనుండి తప్పించిననే గాని నేను మీపనిలో నుండజాలనని చెప్పెను.

అప్పుడు సూర్యముఖి హీరయెడల విరక్తయై "హీరా! నీ మొగసిపాటు చాల హెచ్చుగా నున్నది. మొట్టమొదటఁ దిట్టినదానవు నీవు. నేర మంతయును నీదై యుండెను. ఇట్లుండినను నీకోరిక

నగేంద్రుఁడు కనుబొమలు ముడివడఁ గ్రూరదృష్టితోఁ జూచుచు "అదియేమి?" అనియెను.

హీరాదాసి చెప్పవలసినమాటల నన్నిటి నలంకారయుక్తము గాఁ జెప్పివైచెను. "రాణిగారు కుందనందినినిగూర్చి యేమేమో యని యున్నారు. ఆమాటలనువిని కుందనందిని యీదేశమునువిడిచి యెచ్చటికో పోయెను. అందువలన నాకును చాలభయ మగుచున్నది. ఆవిధముగా నన్ననినచో నేనెచ్చటికిఁ బోయి బ్రదుకఁ గలను? మొదట నేనే దూరముగా నుండుట చాలమంచిపని" అనియెను.

నగే—రాణిగారు కుందనందినితో నేమని చెప్పిరి?

హీరా—అవి యన్నియును మీయెదుట మనవి చేయుటకు నాకు సిగ్గగుచున్నది. నేను చెప్పఁజాలను.

ఆమాటలను వినినతోడనే నగేంద్రుని ముగము నల్లవడిపోయెను. అప్పు డాతఁడు హీరతో "ఇప్పుడు నీవు నీయింటికిఁ బొమ్ము రేపు నిన్ను మరలఁ బిలిపించెదను." అనియెను.

హీరకోరిక ఫలియించినది. అందుకొఱకే యామె కౌసల్యతో జగడము పెట్టుకొన్నది.

నగేంద్రుఁ డప్పుడు సూర్యముఖిని బిలిచి 'నీవు హీరను పొమ్మని చెప్పితివా?' అని యడిగెను. సూర్యముఖి 'ఔను. అట్లే చెప్పితిని' అని చెప్పి తరువాత హీరాకౌసల్యావృత్తాంత మంతయును వివరముగాఁ దెలియఁజేసెను. నగేంద్రుఁ డంతయును విని 'వారు చావనిమ్ము. నీవు కుందనందిని నేమంటివి?' అని యడిగెను.

నగేంద్రుఁడు చూచుచుండఁగనే సూర్యముఖి ముఖకమలము వాఁడిపోయెను. అప్పుడు సూర్యముఖి యస్పష్టస్వరముతో 'నేనే మంటిని?' అనియెను.

నగేం—ఏదియో చెడ్డమాట.

సూర్యముఖి కొంతసేపు మౌనమును వహించి యనంతరము "మీరే నాకు సర్వస్వరూపులరు. నాయిహపరములు రెండును మీరే. మీయొద్ద నేల దాఁపవలయును. నేనెప్పుడు నేదియును మీయొద్ద దాఁపలేదు. ఇప్పుడా పరకీయా సమాచారముమాత్ర మేల మరుఁగుపఱుపవలయును. కుందనందినిం గూర్చి యొక చెడ్డమాట యంటిని. మీకుఁ గోపము వచ్చునేమో యని యాసంగతి మీతోఁ దెలుపుటకు సాహసింపలేకున్న దానను. నేనాసంగతి యంతయుం దెలిపెదను. నాయపవాదమును క్షమియింపవలయును" అని పలికి హారిదాసివైష్టవిపరిచయము మొదలుకొని కుందను దిరస్కరించి వెడలఁగొట్టునంతవఱకును విశదముగ నిష్కపటముగఁ దెలిపి 'నేను కుందనందినిని తిరస్కరించి నాగొంతు నేనే కోసికొంటిని. ఆమెను వెదకుటకై నేనును సేవకుల నూఱురికిని బంపితిని. దొరకినచోఁ దీసికొనిరాఁగలరు. నాయీ యపరాధమును క్షమియింపవలయును.' అని వేఁడుకొనియెను.

నగేం—ఇందు నీయపరాధమేమో విశేషముగ లేదు. కుంద నందిని కళంకముంగూర్చి నీవు వినినరీతి నితరులెవ్వరైన వినియున్నచో సంసారిణి యగు నేపతివ్రతయు నట్టిదానిని తనయింట నుంచుకొనఁ జాలదు. కాని యామెవిషయమునం గలిగిన యపవాదము నిజమో కాదో యను విషయముంగూర్చి విచారణచేసినచోఁ జాల బాగుగ నుండును' అనియెను.

సూర్య—అప్పుడు నేనావిషయముంగూర్చి బాగుగ యోచింప లేదు. ఇప్పుడు యోచించుచున్న దానను.

నగేం—ఇప్పుడు యోచించుటవలన నేమిప్రయోజనము?

సూర్య—అప్పుడు నామనసు చెదరిపోయినది.

అని చెప్పి యాసూర్యముఖి—పతిప్రాణయగు నా సాధ్వీమణి నగేంద్రుని చరణకమలమ్ములకడ నిలువునఁ గూలఁబడి యాతని రెండు

చరణములను రెండుచేతులతోడను బట్టుకొని తన కన్నీటితోఁ దడిపి వైచెను. తరువాత నించుక మొగమెత్తి 'మీరు నాప్రాణములకంటె నధికులై యున్నారు. పాపభూయిష్ఠమగు నాయీ మనసునం దేమి యున్నను నేను దానిని మఱుఁగుపఱుపఁజాలను. నాయపరాధమును మీమనసునఁ బెట్టుకొనవలదు' అని వేఁడుకొనియెను.

నగేం—నేను నీకేమియును చెప్పుటలేదు. నేను కుందనందిని యం దనురక్తుఁడనై యుంటినని నీవు సందేహము కలదానవై యుంటివి.

సూర్యముఖి యాతనిపాదములపైఁ దలనుంచుకొని వెక్కి వెక్కి-యేడ్చెను. తరువాత శిశిరసంసిక్తంబగు కమలముంబోలి యతిక్లిన్నమై యున్న ముఖమండలము నెత్తి సకలసంతాపపరిహారియగు ప్రాణేశ్వరుని వదనమండలముం గాంచుచు 'మీతో నేమని చెప్పను? నాకు సంభవించినదుఃఖమునుగూర్చి మీకుఁ జెప్పఁగలను. నేను మరణించినచో మీదుఃఖము మఱింత హెచ్చగు నను నుద్దేశముతో నేను చావక జీవములతో నుంటిని. మఱియొక్కతె మీహృదయమునఁ బాలుపంచుకొనుచున్నదను సంగతి తెలిసినతోడనే నేను మరణించి యుందును. పట్టి మాటలతోఁ జచ్చెద నని చెప్పినంతమాత్రమున నది చావు కానేరదు, నేను యథార్థముగ నిష్కపటముగ నాంతరిక మగుమనసుచేఁ జచ్చిపోవుచుంటిని. మీరునాయపరాధమును మనసునఁ బెట్టికొనఁగూడదని ప్రార్థించుచున్న దానను'' అనియెను.

నగేంద్రుఁడు కొంతసేపటివఱకును సుస్థిరహృదయుఁడై యుండి తుదకొకనిట్టూర్పువిడిచి ''సూర్యముఖి! అపరాధము లన్నియు నాయవియేకాని యిందు నీయపరాధ మేదియును లేదు. నిశ్చయముగ నేను నీయెడల విశ్వాసఘాతుకుఁడనై పోయితిని. యథార్థముగనిన్ను మఱచిపోయి కుందనందినియందు—ఏమని చెప్పుదును? నేననుభవించు

చున్నదుఃఖ మతిదుస్సహమైనది. నీకావిషయముంగూర్చి చెప్పుట యెందులకు? నేను నామనసును స్వాధీనపరచుకొనుటకై ప్రయత్నించుట లేదని నీవు చెప్పియుంటివి. ఏవట్లు భావింపవలదు. నేను విన్నంతగాఁ దిరస్కరించుకొను చుంటినోయట్లు నీవు నన్నుఁ దిరస్కరింప జాలవు. నేను కేవలమును పాపాత్ముఁడను— నామనసు నాకు స్వాధీనపడుట లేదు.'' అనియెను.

సూర్యముఖి యామాటలను విని సహింప లేకపోయెను. ఆమె తనకర కమలముల జోడించుకొని కాతరస్వరముతో ''మీమనసునం దేమియున్న నుండనిండు. అది నాతోఁ జెప్పవలదు. మీకువ్యతిరేకములగు వాక్యములు నామనసునకు శూలములంబోలి యుండును. నానుదుట నేమివ్రాసియుండెనో యదిజరుగక మానదు. నాకట్టిమాటలను వినుట కిష్టము లేదు. అట్టిమాటలు నాకుఁ జెప్పదగినవియును గావు.'' అనియెను.

''సూర్యముఖీ! అట్లు కాదు. ఇంకను నీవు వినవలసిన మాటలున్నవి. ప్రస్తావను వచ్చుటచే నామనసులోని మాటలన్నియును బయటికి వచ్చుచున్నవి— చాల దినములనుండి చెప్పవలయునని యాలోచించు చుంటిని. నేనీసంసారమును పరిత్యజించెదను. మరణింపనుసుమా!—కాని దేశాంతరము పోయెదను— ఈఇల్లు. వాకిలి, సంసారము వీనివలన నాకు సుఖము లేదు. నేను నీవంటిదానికిఁ దగిన భర్తను కాను. నీకన్నులయెదుటనుండి నీకు సంతాపమును కలిగింపఁ జాలను. నేను కుందనందినిని వెదకికొనుచు దేశాంతరము పోయెదను. నీవీగృహమున గృహలక్ష్మివై యుండుము. నీవు నిన్ను విగతభర్తృకగా భావించుకొనుము—నావంటిపామరుఁడు భర్తగా నుండిన సతీమణి విధవగాక సధవ యెట్లగును. నేను పాపాత్ముఁడను, మఱియుఁ బాపాత్ముఁడనై పోవుచున్నాఁడను. నిన్నిఁక మోసగింప జాలను.

నేనన్యగతప్రాణుడనై యుంటిని. ఆసంగతి నీవు బాగుగఁ దెలిసికొనుము. ఇప్పుడు నేను దేశత్యాగినై బయలుదేరెదను. ఒకవేళ నెన్నటికైనఁ గుందనందినిని మఱవఁ గలిగితనేని మరల వెనుదిరిగి యింటికి వచ్చెదను. అట్లుకానిచో నీకును నాకు నిదియే కడపటి సందర్శనము. అని చెప్పెను.

శూలస్వరూపంబు లగునావచనములను విని సూర్యముఖి మఱియేమని చెప్పఁగలదు? కొలఁది నిమిషములవఱకును శిలామయంబగు ప్రతిమవలెఁ గ్రిందికిఁజూచుచు నిలువఁబడియెను. తరువాతభూమిపై బోరగిలఁబడిపోయెను. అప్పుడు నేలపై మోముంచి సూర్యముఖి విలపించినదా? ఘాతుకమృగంబగువ్యాఘ్రము నిలువఁబడి చంపఁబడినజంతువుయొక్క మరణయాతనను గాంచుచున్నట్లే నగేంద్రుఁడు సుస్థిరభావముతోఁ నిలువఁబడి యామె నాస్థితియందుఁ జూచుచుండెను. అప్పుడాతఁడు తనమనసునందు "ఈమె చచ్చిపోవును. అందుల కిదియే సమయమా! పరమేశ్వరునియుద్దేశమెట్లో యట్లు జరుగఁగలదు. నేనేమి చేయఁగలను! పోవుప్రాణము నాయిష్టముబట్టి నిలుచునా? నేనును ప్రాణత్యాగము చేసికొనుటకు సిద్ధముగా నున్నాఁడను. అట్లయినచో నామె బ్రతికి యుండునా?" అని యనుకొనుచుండెను.

కాదు, నగేంద్రా! నీవు మరణించినచో సూర్యముఖి ప్రాణములతో నుండఁజాలదు. అయినను నీవు చచ్చినచో బాగుగ నుండును.

ఒకగంట నేపైనతరువాత సూర్యముఖి లేచి భర్తపాదములను పట్టుకొని "నాదొకభిక్షమున్నది" అనియెను.

నగేం—ఏమది?

సూర్య—ఒకమాసమువఱకును మీరింట నుండవలయును. అంతలోఁ గుందనందిని దొరకకపోయినచో నప్పుడు మీరు దేశాంతరముపోయిన నేనెట్టియభ్యంతరమును చెప్పఁబోనుగాను.

నగేంద్రుఁడు నిరుత్తరుఁడై వెడలిపోయెను. ఆతఁడు తనహృదయమునందు "ఒకమాసముదిలమునవఅను నింటనుండి చూచెదను" అని యనుకొనియెను. సూర్యముఖియు నట్లే గ్రహియించెను. ఆమె యప్పుడాగమనశీలుఁడైన నగేంద్రునియాకారముం గాంచుచు మనసునందు "నాసర్వస్వమా! నీపాదమునందొకముల్లు గ్రుచ్చుకొనినను నేను ప్రాణముల నిలుపుకొనఁజాలను. నీవీపాపాత్మురాలును, నధమాధమురాలును నగుసూర్యముఖకొఱకు దేశమును త్యజించుచుంటివి కాదా? నాశిరోరత్నమా! నీవధికుఁడవా? నేనధికురాలనా?" అని యనుకొనియెను.

---

## ఇరువదిరెండవ ప్రకరణము

హీరాదాసి దాసీపనిపోయెను; కాని నగేంద్రునియింటి సంబంధముమాత్ర మామెకు తప్పలేదు. ఆయింటిసమాచారములను గూర్చి విచారించుటకామె సర్వదా యాత్రముగలదై యుండెను. ఆయింటివారెవరైన నగపడినచో నామె వారిని తనయొద్దఁగూర్చుండఁ బెట్టుకొని సంభాషించుచు సూర్యముఖకిని నగేంద్రునకును గల పరస్పరమనోభావములను గూర్చి తెలిసికొనుచుండెను. ఆయింటివారెవ్వరును దొరకకపోయినచో నేదేనొక నెపము పెట్టుకొని నగేంద్రునియింటికిఁ బోయి యటఁ బరిచారికలుండు మహాలునఁ బ్రవేశించి వారితోఁగూడ సంభాషించుచు సమాచారములను దెలిసికొనుచుండెను.

ఇట్లు కొన్ని దినములు గడచినవి. తరువాత నొకదినమున మేఘుల గర్జలమునకుఁ గారణమయ్యెను.

హీరకును దేవేంద్రునకుఁ బరిచయమైనదినము మొదలుకొని గోపకాంతయగుగంగాజల హీరయింటికి వచ్చుచుఁ బోవుచుండుట తఱచయ్యెను. ఇట్లువచ్చుట హీరకంతగాసిష్టము లేదనుసంగతి గోప కాంత తెలిసికొనియెను. అంతేకాక హీరయింటియందొకగది యెల్ల ప్పుడును బీగము వేయఁబడియుండుటను గోపకాంతకనిపెట్టెను. ఒక నాఁడాకస్మికముగ గోపకాంతవచ్చి చూడఁగా నాగది తాళము వేయఁబడి యుండలేదు. అప్పుడామె యాతలుపు గొలుసునుదీసి తలుపుత్రోసెను. దానికిలోపల గొళ్లెము వేయఁబడియుండెను. అందు మూలమున నాగదిలో నెవ్వరో మనుష్యులుండి యుందురని గోప కాంత తెలిసికొనియెను.

అప్పుడు గోపకాంత హీరతో నేమియుం జెప్పక తన మనసు నందు "ఆమనుష్యులెవ్వరై యుండవచ్చును? ఎవ్వఁడో యొకయుప పతియై యుండవచ్చును." అని యోచించెను. ఉపపతియెవ్వరికో యామెకు బాగుగఁ దెలియును. చాలసేపాలోచించిన తరువాత కుం దనందినియే యాగదియందుండవచ్చునని నిశ్చయించుకొనియెను. కుందనందిని నగేంద్రునియిల్లువిడిచి పోయినసమాచారము జనులకం దఱకును దెలియును. ఆసందేహమును దీర్చికొనుటకై యామెయొక యుపాయమును ఫన్నెను. హీరాదాసి నగేంద్రుని యింటినుండి యొక లేడిపిల్లను దెచ్చి పెంచికొనుచుండెను. అది చాలఁ జంచల యగుటచే దానినామె కట్టివేసి యుంచెను. అప్పుడు గోపకాంత దానికి గడ్డితినిపించుచున్న హీరకుఁ దెలియకుండఁగనే దానికట్టుత్రాడు విప్పివైచెను. ఆలేడిపిల్ల తత్క్షణమే పాఱిపోయెను. హీర దానిని బట్టు కొనుటకై పరువెత్తెను.

హీర వెలుపలకుఁ బాఱిపోయినతరువాత గోపకాంత యొక విధమైన వికారస్వరముతో "హీరా! హీరా! ఓగంగాజలా! అని

కేకలు వేయుచు నేడ్చుటకారంభించి "అయ్యో! మాగంగాజల యిట్లయిన దేమి?" అని కేకలు వేయుచు కుందనందిని యున్న గది తలుపులం దట్టి "కుందా! కుందనందినీ! త్వరగా నీవలకురావే! గంగాజలకేదో యుపాయమైయున్నది." అని యార్తస్వరముతోఁ గేకలు వైచెను. కుందయు వ్యాకులహృదయయై గదితలుపులం దెఱచెను. గోపకాంత యామెంజూచి నవ్వుచు వెడలిపోయెను.

కుంద మఱలఁ దలుపులను మూసికొనియెను. హీర యేమనునో యనుభయముచేఁ గుందనందిని యామె కాసంగతిఁ దెలుపలేదు.

గోపకాంత పోయి దేవేంద్రునకాసంగతిఁ దెలియఁజేసెను. దేవేంద్రుడు తానేస్వయముగ హీరయింటికి బోయి చూచుకొనిరావల యునని నిశ్చయించుకొనియెను. కాని యిప్పుడు తనయింటియందు స్నేహితులకు విందుచేయనిశ్చయించుటచే నాదినమునఁగాక మఱునాఁడు పోవలయునని యనుకొనియెను.

---

## ఇరువదిమూఁడవ ప్రకరణము

కుందనందిని పంజరములోనిపక్షివలె నిరంతరము సంచలించుచుండెను. వేఱు వేఱుదిక్కులనుండి పఱగెత్తుకొనివచ్చుచున్న ప్రవాహములుగల రెండునదులు పరస్పర ప్రతిహతములైనప్పు డాప్రవాహవేగమువలన నుదకముప్పొంగి యెట్లుండునో కుందనందినిహృదయముకూడ నట్లేయుబ్బియుండెను. ఒకవంకసిగ్గు—అవమానము—తిరస్కారము—మొగముచూపుట కుపాయములేదు. సూర్యముఖి తనయింటినుండి వెడలఁ గొట్టినది. ఆలజ్జాప్రవాహముపైఁ బ్రణయ ప్రవాహము వచ్చిపడఁగా వాని పరస్పర ప్రతిఘాతమువలన ప్రణయ

ప్రవాహమే పైకిఁబొంగి మహానదివచ్చి యుపనదిని తనలోఁ గలిపి కొనిపోయినట్లు సూర్యముఖిమూలమునం గలిగిన యవమానము క్రమక్రమముగ లోపింపఁజేసెను. క్రమముగాఁ గుందనందిని సూర్య ముఖినే మఱచిపోయెను. ఎల్లయెడల నగేంద్రుఁడే యామెకన్నుల కగపడుచుండెను. క్రమముగాఁ గుందనందిని "నేనామందిరము నేల విడిచివచ్చితిని? వారేమో రెండుమాటలని నంతమాత్రమున నాకేమి నష్టము కలిగినది? నేనేమో యామందిరమున నున్నప్పుడు నగేం ద్రుని జూచికొనుచుంటిని. ఇప్పుడేమియును జూచుటకాధారము లేదు. మఱల నామందిరమునకు వెనుదిరిగిపోవుదునా ? ఆమె నన్ను వెడలఁగొట్టకుండినచో నట్లేపోవుదును. కాని యొకవేళ మఱల నామె నన్నింటినుండి వెడలఁగొట్టినచో నేమిచేయుదును ? అట్లే వెడలఁగొట్టునా?" అని యీవిధముగా నామె రేయింబవలు చింతించుచుండెను. నగేంద్రునియింటికి మరలఁ బోవచ్చునా కూడదా యనువిషయము నుగురించిన యాలోచనము చిరకాల ముండలేదు. ఒకటిరెండుదినములలోనే స్థిరపడి పోవలయుననుటయేసిద్ధాంతమయ్యె ను—పోకున్నచోఁ బ్రాణములునిలుచుటలేదు. ఒకవేళ పోయినచో సూర్యముఖి తిరిగి వెడలగొట్టునేమోయనుసంశయ మున్స్మృతికిదోఁచు టచే నామెదుర్దశకుఁ దగినట్లామె వెడలిగొట్టినను వెడలిఁగొట్టనిమ్ము— మఱియేమిచేసినను జేయనిమ్ము. తప్పకపోవలయుననియే యామె సిద్ధాంతము చేసికొనియెను.

కాని కుందనందిని మఱల నేమని యాయింటిముంగిటికిఁ బోయి నిలువవలయును? ఒక్కతెయేపోవుటకు సిగ్గు—హీరను వెంటఁబెట్టు కొనిపోయినచోఁ బోవచ్చును. కాని హీర కావిషయమునుగూర్చి నోటితోఁ జెప్పుటయెట్లు ?

కుందనందినిహృదయము ప్రాణాధికుఁడైన నగేంద్రుని జూడ కుండ సహింపఁజాలదు. ఆమె యొకనాఁటిరాత్రి తెల్లవారుటకుముందు

ఒకటిరెండుజాము లుండఁగనే తనశయ్యనుండిలేచి హీర నిద్రించుచుం డఁగాఁ జప్పుడుకాకుండఁ దలుపుతీసి యాయింటివెలుపలకు వచ్చెను. కృష్ణపక్షమునందలి యవశేషక్షీణచంద్రరేఖ యాకాశప్రాంతమున సముద్రమునందుఁబడి బాలికయగు సుందరీమణివలెనే తేలియాడుచుం డెను. రాశీభూతంబగు నంధకారము వృక్షాంతరాళంబుల దాఁగికొని యుండెను. అతిశీతలమందమారుత సంచాలనంబున నామార్గంబునకుఁ బార్శ్వమునందున్న సరోవరమునందుఁ బద్మపత్ర శైవాలంబులచే మాటుపడియున్న జలంబులఁ దరంగములుదయించుటలేదు. అస్పష్టములై కానఁబడుచున్న వృక్షాగ్రంబుల పైభాగంబున నతివినీలంబగు నాకాసమండలము ప్రకాశించుచుండెను. త్రోవ ప్రక్కనుబరుండి కుక్కలు నిదురించియుండెను. అప్పుడు ప్రకృతి సుస్నిగ్ధంబగు గంభీర భావమును దాల్చియుండెను. కుందనందిని త్రోవవెదకికొనుచు సందేహమువలనంగలిగిన మందగమనముతో నగేంద్రునిమందిరమున కభిముఖయై పోవుచుండెను. ఆమెకింటికిఁ బోవలయునని లేదు— కేవలము నగేంద్రుఁడు కంటఁబడినను బడవచ్చుననునుద్దేశముతోఁ బోవుచుం డెను. నగేంద్రునియింటికిఁ బోవుటకుఁ గారణముగపడదు. అంతటి కారణము ఎప్పుడువచ్చునో రానిమ్ము—అంతలోపల నొక్కసారి పోయి చూచినచో నష్టమేమి? కాని యచ్చట నెట్లుదాఁగికొనిచూడ వలయును? కుందనందిని యావిషయముంగూర్చి యోచించియోచించి తుదకుఁ దెల్లవారుటకుముందుగనే గాఢాంధకారమున నింటిచుట్టును దిరుగాడుచున్నచో నగేంద్రుని గవాక్షద్వారమునొద్దనైనను, మేడ మీఁదనైనను, పుష్పోద్యానమునందైనను కాదేనిమార్గమునందైనను, మఱియెచ్చటనైనను జూడవచ్చునని భావించి యామె యంతరాత్రి వేళనే లేచి బయలుదేరెను. నగేంద్రుఁడు ప్రభాత సమయముననే లేచును కాఁబట్టి యప్పుడాతనినొకసారి చూచి తోడనే వెనుదిరిగి రావచ్చునని యామె యూహించుకొనియెను.

ఇట్లామె యాలోచించుకొని మేడయొద్దకుఁ బోయి చూచెను. నగేంద్రుఁడచ్చట లేఁడు. గవాక్షమునొద్దను, పుష్పోద్యానసమీపమునను, మఱియు నితరప్రదేశములం దెల్లయెడలను వెదకిచూచెను. నగేంద్రుఁడు కానఁబడలేదు. అతఁ డప్పటికింకను లేచియుండఁడని యూహించుకొనియెను. ఆతఁడు లేచునంతవఱకు నొక చెట్టుక్రిందకుఁ బోయి కూర్చుందమనితలంచి యామె యట్లుచేసెను.

అచ్చట గాఢాంధకారము. చెట్టుపైనుండి యొక్కొక్కపండు నీటిలోఁబడి బుడబుడశబ్దము చేయుచుండెను. ఆచెట్టుపైనున్న పక్షి ఱెక్కలను పటపట విదలించుకొనుచుండెను. అంలో నాయింటి పరిచారికలు తలుపులను దెఱచిన శబ్దమయ్యెను. తుదకు ప్రభాత కాలసంసూచకంబగు శీతల మందమారుతము వీవనారంభించెను.

కొన్ని పక్షులు స్వరలహరీకల్లోలమున నాకసమును శబ్దాయమానముగఁ జేయుచుఁ గుందనందినితలపైఁ గూయుచుండెను. ఒకచెట్టుపైఁ గోకిల కూయుచుండెను. తుదకుఁ బక్షులన్నియును గలకల రొదసేయ నారంభించెను. కుందనందిని యాశయు లోపించుచుండెను. చెట్టుమొదట నామె కూర్చుండఁ జాలకపోయెను. క్రమక్రమముగా దిశలవెలుతురు లుదయింపసాగెను. ఆమె యింక నక్కడనే యున్నచో నాయింటివా రెవ్వరైనఁ జూచితీరుదురు. అందువలనఁ గుందనందిని యటనుండి వెడలిపోవలయు నని లేచెను. కాని యామెకొక్క యాశమాత్ర మతిప్రబలముగా నుండెను. ప్రభాతసమయమున నగేంద్రుఁడు లేచి యొక్కొక్కప్పు డంతఃపురమునకుఁ జేరియున్న యుద్యానవనమునకు వచ్చి యట వాయుసేవనము చేయుచుండుట కలదు. నప్పుడచ్చట తిరుగుచు నుండిన నుండవచ్చును. ఒకసారి యచ్చటకుఁ బోయి చూడకుండఁ బోవుట కామె కిష్టములేదు. కానియాయుద్యానవనముచుట్టును గోడకట్టఁబడి యుండెను. ద్వారము తెరవకుండ

లోపలఁ బ్రవేశించుటకు వేఱొకమార్గము లేదు. వెలుపల నుండి చూత మనిన నాగోడ మిగుల నెత్తుగా నుండెను. దానితలుపు తెర చియున్నదియో లేదో చూడవలయు నని కుందనందిని యచ్చటకుఁ బోయెను.

పోయి చూడఁగాఁ దలుపు తెరచి యుండెను. కుందనందిని సాహసించి లోపలఁ బ్రవేశించి మెల్లమెల్లగఁ బోయి యొక వకుళ వృక్షముక్రింద నిలువఁబడి యుండెను.

ఆయుద్యానవనము తరులతాదులచేఁ బరివృతమై యుండెను. వృక్షశ్రేణులనడుమ మిగులసాగసైన మార్గము కలదు. అచ్చటచ్చట శ్వేతరక్త పీతనీలవర్ణంబులుగల వివిధ కుసుమగుచ్ఛంబులచే విరాజిల్లు చుండెడు తరులతాదు లాయుద్యాన వనంబునకు విశేషాలంకారము నొసంగుచుండెను. ఆకుసుమంబులపై బ్రభాత మకరందపానాసక్తంబు లగు భ్రమర మక్షికాది కీటంబులు గుంపులుగుంపులై వచ్చిపడు చుండెను. అన్నియునొకచోఁ గూడుకొనుచుండెను. మరల నెగురు చుండెను. ఝుంకారములను చేయుచుండెను. ఒక్కొక్క కీటకమును మనుష్యుల ననుకరించుచున్నట్లు మధువిలసితంబులగు కుసుమంబులపైఁ బడి మకరందరసము నానుచుండెను. చిత్రవిచిత్ర వర్ణములుగల సీతా కోకచిలుక మొదలగు చిన్నకీటకములు వికసితకుసుమంబులపై ఫలం బులవలెఁ గూరుచుండి పుష్పరసమును పానము చేయుచుండెను. వానిలో నొక్కొక్కదాని కంఠమునుండి సప్తస్వర సమ్మిళితంబగు ధ్వని బయలుదేరుచుండెను. ప్రభాతసమయ మందమారుత సంచాల నంబునను, పుష్పమంజరీభరంబు వలనను, చిన్నచిన్నకొమ్మలు తూగి యాడుచుండెను. పూవులులేనిరెమ్మలు చలించుట లేదు. ఏమనిన నవి వినమ్రములై యుండలేదు. కోకిలయొండు వకుళవృక్షంబున గుబ్బు కొమ్మలమాటునఁ దనన్లనియాకారమును మాటు చేసికొని కంఠ స్వరముచే నెల్లరను జయించుచుండెను.

ఉద్యానవనమధ్యంబున శ్వేతశిలావినిర్మితం బగు నొక లతా మండపము కలదు. దాని నవలంబించి కుసుమగుచ్ఛాలంకృతంబులగు వివిధ లతలు వ్యాపించి యల్లిబిల్లిగ నల్లుకొని యుండెను. మంటపముచుట్టును మట్టికుండ్లలోఁ బుష్పసమేతంబు లగు గుల్మంబులు నిలువఁబడియుండెను.

కుందనందిని వకుళవృక్షాంతరాళమునుండి తొంగిచూచెను. ఆ యుద్యానవనంబున దీర్ఘాయతంబును, దేవసదృశంబును నగు నగేంద్రుని మోహనాకార మగపడలేదు. లతామండపమధ్యమునంగూడఁ బరీక్షించి చూచెను. అచ్చట శ్వేతశిలాకుట్టిమతలంబున నెవ్వరో పరుండి యున్నట్లు కానవచ్చెను. ఆవ్యక్తి నగేంద్రుఁడై యుండవచ్చునని, యామె యూహించెను. బాగుగఁ జూచి తెలిసికొందమని యెంచి యా చెట్లచాటునుండి మెల్లమెల్లగ ముందునకుఁ బోయెను. ఆ శయనించిన వ్యక్తి లేచి యీవలకు వచ్చుచుండఁగాఁ జూచెను. నగేంద్రుఁడు కాఁడు. అది సూర్యముఖియై యుండెను.

కుందనందిని భయసంభ్రమములతో వికసించిన యొక మాధవీలతచాటున నిలువఁబడియెను. భయముచే ముందున కడుగు పెట్టలేదు. వెనుకకును పోవఁజాలకపోయెను. అట్లే నిలువఁబడి చూచుచుండెను. సూర్యముఖియు నాయుద్యానవనమునఁ బూవులఁగోయుచు నందందుఁ దిరుగుచుండెను. ఆమె క్రమముగాఁ గుందనందిని దాగియున్న చోటి కభిముఖయై రానారంభించెను. అప్పుడు కుందనందిని దొరకిపోయితి నని యనుకొనియెను. తుదకు సూర్యముఖి కుందనందినిని చూచెను. దూరమునుండి యానవాలు పట్టలేక 'ఎవరమ్మా!' అని పిలిచెను.

కుందనందిని భయముచే మాటలాడ కూరకుండెను. ఆమెకుఁ గాలు కదలకుండెను. సూర్యముఖి క్రమముగా దగ్గఱకువచ్చి చూచునప్పటి కామె కుందనందిని యయ్యెను. అప్పుడామె యాశ్చర్యపడి 'నీవు కుందవుకావా ?' అనెను.

కుందనందినికి నోట మాట వెడలకుండెను. అప్పుడు సూర్యముఖి కుందనందిని చేయి పట్టుకొని కుందనందినీ! రా తల్లీ! సోదరీ! రమ్ము!' ఇఁకముం దెన్నఁడును నిన్ను నేను తిరస్కరింపనమ్మా!' అని పలికెను.

ఇట్లు చెప్పి సూర్యముఖి కుందనందిని చేయిపట్టుకొని యంతఃపురమునకుఁ దీసికొనిపోయెను.

---

## ఇరువదినాల్గవ ప్రకరణము

ఆ రాత్రి దేవేంద్రుఁడు పొట్టనిండ సురాపానము చేసి మారువేషముతో నొక్కఁడే తగిన ప్రయత్నముతో హీరాదాసియింటికి వచ్చి లోపలఁ బ్రవేశించి యంతటను వెదకెను. కుందనందిని యచ్చట నగపడలేదు. హీర తననోటికి జీరచెఱఁగు మాటు చేసికొని నవ్వెను. దేవేంద్రుఁ డతిక్రోధముతో "నవ్వెద వెందులకే?" అనియెను.

హీరా—నీదుఃఖమునుచూచి—పంజరము గంటలిపక్షి పారిపోయినది! నాయింట నెంతవెదకినను గానఁబడదు,

దేవేంద్రుఁడు ప్రశ్నలను వైచి హీరవలన నెల్లసంగతులను గ్రహించెను. తరువాత హీరాదాసి 'నేటియుదయమున వెదకితిని, కుందనందిని నగేంద్రునిమందిరమున నున్నది. ఆమెనిప్పుడు వారెప్పటివలె నాదరించుచున్నారు." అనెను.

దేవేంద్రుఁడు హతాశుఁడై యచటనుండి వెడలిపోవుచుండెను. ఆతనిమనసునం దింకను సందేహము తీరలేదు. హీరసంగతియింకను బాగుగఁ దెలిసికొని పోవలయు నని యాతఁ డాలోచించుకొనియెను.

ఆకాశమునం దొకటిరెండు మేఘములు క్రమ్ముకొనుచుండుటం గాంచి వర్షము వచ్చునేమో యని యనుకొనుచు నటునిటు చూచుచుం డెను. హీరకుఁగూడ నాతఁడచ్చట నించుకసేపు కూర్చుండి యుండ వలయునని యాశకలదు—కాని యామె యాడుఁది—ఆయింటియం దప్పు డామెయొక్క తెయే యుండెను—అందు నది రాత్రిసమయము అగుటవలననామె యాతనిఁ గూర్చుండు మని చెప్పుటకు సాహసింప లేకపోయెను. అట్లు చెప్పినచో నధఃపాతమున కొక మెట్టుదిగినట్లగును. కాని యామె నుదుటివ్రాఁత యట్లే యుండెను. అప్పుడు దేవేంద్రుడు 'మీయింటియందుఁ ద్రాగుటకు మద్యమున్నదా?' అని యడిగెను.

హీరయింటియందు మద్యము లేదు. దేవేంద్రుఁడు 'కొంచెముసేపు మీయింటనుండి వర్షము వచ్చునేమో చూచికొని యనంతరము పోయినచో నెవ్వరైన నేమైన ననుకొందురు?' అని యడిగెను.

హీరా—అనుకొనకుందురా? కాని యట్లనుకొనుటకే కారణము కలదో యది మీరు రాత్రి వేళ నిచ్చటికివచ్చుటచేతనే కలిగినది.

దేవేం—అట్లయినచో నైన దేదో యైనది. నేనుకూరుచుండ వచ్చునా?

హీరాదాసి యామాటలకుఁ బ్రతివచనం బీయలేదు. దేవేంద్రుఁ డట్లే కూర్చుండి యుండెను.

అప్పుడు హీరాదాసి తనమంచముపై నతిపరిష్కృతంబగు శయ్యనేర్పఱచి దేవేంద్రు నందు గూర్చుండఁజేసెను. మఱియు నామె తనపెట్టెలోనుండి వెండికట్టువేసినహుక్కా నుతీసి యందు శీతల జలంబుల నించి సుగంధిసైనతంబాకుగుడిగుడి సిద్ధపఱచి దాసీముఖునా శమును నాతని కొసంగెను.

దేవేంద్రుఁడు తనకంచుకమునుండి యొకబ్రాందిసీసాను తీసి దానిలో నించుకైన జలము చేర్పకయే త్రావి యందువలన రాగ

యుక్తుడై చూడఁగా నప్పుడు హీరాదాసికన్నులు మిగులసుందర ములై యగపడియెను. వస్తుతః హీరాదాసికన్ను లతిసుందరము లైనవి. ఆనేత్రము లతివిశాలములైనవి. నిబిడకృష్ణతారకా సనాథ ములై ప్రదీప్తములై విలోలకటాక్షవిలసితములై యుండెను.

అప్పుడు దేవేంద్రుఁడు "హీరా! నీనేత్రములు మిగులసుంద రములైన నేత్రములు!" అనిపలికెను. హీరాదాసి మృదుమందహాస ముంజేసెను. దేవేంద్రుఁ డచ్చట నొకసారంగ పడియుండుటను చూచి దాని నందుకొని పాడుట కారంభించెను. ఆసారంగ యంత బాగుగలేదు. "దీని నెక్కడఁ గొంటివి." అని ప్రశ్నించెను.

హీరా—ఒకభిక్షుకునియొద్ద వెలకుఁ దీసికొంటిని.

దేవేంద్రుఁడు దానిని వాయించుచు మధురస్వరముతో మధుర భావసమంచితంబు లగు మధురపదంబులను మధురరీతిని గానము చేసెను. కొలఁదిసేపటిలోనే హీరాదాసి సంపూర్ణముగ నొడలు మఱ చిపోయెను. తాను హీరాదాసి ననియు నాతఁడు దేవేంద్రుఁ డనియుఁ గూడ నామె యెఱుంగఁజాలక పోయెను, అప్పుడామె తన హృదయంబున నాతఁడు తనప్రాణేశ్వరుఁ డనియుఁ దానాతనిప్రాణే శ్వరి ననియు పరమేశ్వరుఁ డిరువురను పరస్పర ప్రీతికొఱకు సృష్టించి యుండె ననియు చిరకాలమునుండి యిరువురును చేరి ప్రణయవిశేష మునఁ బరస్పర సుఖానుభవముం గాంచుచున్నట్లును భావించుకొని యెను. ఈవిధముగా మోహాభిభూతయైన హీరమనోభావము లామె నోటినుండియే స్పష్టపడియెను. అర్ధస్ఫుటంబు లగునామె వాక్యముల వలనఁ దెలియఁబడిన మనోభావములం గాంచి దేవేంద్రుఁ డామె తన యందుఁ బ్రాణసమర్పణము చేసికొని యున్నదని గ్రహియించెను.

తనమనోభావము వాక్యములవలన బయటఁ బడినతరువాత నించుక తెలివి తెచ్చుకొనియెను. అప్పుడు హీరతల త్రిరుగ నారం

భించెను. ఆమె యున్మత్తురాలివోలిక వ్యాకుల చిత్తయై "మీరిఁక నాయింటినుండి వేగముగ వెడలిపోవలయును." అనియెను.

దేవేంద్రుఁడదరిపడి "హీరా! అదియేమే?" అనియెను.

హీర—మీరు వేగముగఁ బోవలయును. పోకున్నచో నేనే వెడలిపోయెదను.

దేవేం—అదియేమే? ఇంటినుండి వెడలఁ గొట్టెదవా?

హీర—మీరు పోవలయును. పోవకున్నచో నిరుగుపొరుగు వారిని బిలిచెదను. నన్ను బాడుచేయవలయు ననునుద్దేశముతోవచ్చితిరా?

అప్పుడు హీర పిచ్చిదానివలె వివశయై యుండెను.

దేవేం—స్త్రీచరిత్ర మనునది యిదియేనా?

హీర—(కోపముతో) స్త్రీచరిత్రమా? స్త్రీచరిత్ర మంత చెడ్డది కాదు. మీవంటి పురుషుల చరిత్రమే చాలఁ జెడ్డది. మీకు ధర్మజ్ఞానము లేదు. ఇతరుల క్షేమమునుగూర్చి యాలోచనము లేదు. కేవలస్వసుఖమునుమాత్రమే చూచుకొనుచు సంచరించుచుందురు. నన్నీవిధముగఁ బాడుచేయవలయునని ప్రయత్నించుచుఁ దిరుగుచున్నారు. అట్లే కానిచో నాయింటి కేలవచ్చితిరి? వచ్చి యిచ్చటఁ గూరుచుండు టెందులకు? నన్నుఁ బాడుచేయుటకుఁగాదా? నేను వేశ్యనను నుద్దేశముతోడనేగదా! వచ్చి కూరుచుంటిరి! నేను మీరు తలంచినట్లు వేశ్యను గాను. నిరుపేదరాలను. శరీరకష్టము వలనఁ గాలక్షేపము చేసికొనుచున్నదానను. నాకు వేశ్యనగుటకవకాశము లేదు. గొప్ప యింటి యాఁడుబిడ్డనైనచో నేమగుదునో చెప్పఁజాలను.—

దేవేంద్రుఁడు భ్రూభంగమును చేసెను. దానినిఁజూచి హీర సంప్రీతచిత్తయై మరల మొగమెత్తి దేవేంద్రునివంకఁ జూచుచు

కోమలతరం బగుస్వరంబున "ప్రభూ! నేను మీరూపగుణగణంబులం గాంచి పిచ్చిదాన నై పోయితిని. అంతమాత్రమున నన్నుం గులటగా భావింపవలదు. నేను మిమ్ముం గేవలము చూచుటతోడనే తృప్తివహించియుందును. మీరు నాయింటియొద్దఁ గూర్చుండుట కిష్టము కలదాన నగుటచేతనే యందుల కెట్టి యభ్యంతరమును కలిగింపలేదు. కాని నేనబలను, ఆఁడుదానను. నేనభ్యంతరము కలిగింపఁజాలక పోయినంతమాత్రమున మీరు కూరుచుండుట యుచితమా? మీరు కేవలము మహాపాపాత్ము లగుటవలననే నాయింటికి వచ్చి నన్నుఁ బాడుచేయుటకుఁ బ్రయత్నించితిరి. ఇప్పుడే మీరిటనుండి వెడలి పోవలయును' అనియెను.

దేవేం—హీరా! చాల బాగుగ నున్నది. నీవు మా సమాజమునందుఁ బ్రబంధములను రచియించుటకు సమర్థురాలవు. మా బ్రహ్మసమాజమునకు వచ్చి యొకదినమున మాటలాడుము' అనియెను.

హీరాదాసి—నేనా యా పరిహాసమునకుఁ దగినదానఁగాను. మీకు సరిపడనిదానిని మీరు ప్రేమించినను దానితోఁ బరిహాస మాడుట మంచిదికాదు. నేను ధార్మికురాలను కాను. నేను ధర్మమునకు నా మనసునందుఁ జోటులేదు. కాని నేను కులటనుమాత్రము కానని నిశ్చయముగఁ జెప్పుచున్నదానను నేను మీప్రేమముకొఱకాసించి కళంకమును తెచ్చుకొనఁజాలను. మీరు నన్నుఁ బ్రేమించినచో నప్పుడు నేనీవిధముగాఁ జెప్పుదానఁగాను. నాకు ధర్మజ్ఞానము లేదు. నాకు ధర్మమునందు భక్తియునులేదు. మీ ప్రేమయే యున్నచోఁ గళంకమును త్రృణప్రాయముగఁ జూచుకొందును. కాని మీరుమాత్ర మన్ను ప్రేమించుటలేదు, అట్లుండఁగాఁ గళంకము నేనే సుఖముకొఱకు కొని తెచ్చుకొందును? యువతి యను కాంతామణి చేతికి దొరకినదని నన్నొకవేళ మీరనుసరించిన ననుసరింపవచ్చును.

కాని రేపు మఱచిపోయెదరు. ఒకవేళ నించుక జ్ఞప్తియున్నను నితరుల యొద్ద నన్నుఁగూర్చి మాటలాడునప్పుడు పరిహసించు చుందురు. కావున నేనెందులకు మీకుఁ గట్టుపడవలయును? కాని యెప్పుడు మీరు నన్ను నిశ్చయముగఁ బ్రేమించుచుందురో యప్పుడు నేను మీకు దాసినై మీచరణసేవనము చేయఁగలను' అని చెప్పెను.

దేవేంద్రుఁడు హీరనోటినుండి వెలువడిన యీమూఁడునాలుగు విధముల వాక్యములను విని యామె హృదయభావములను బాగుగఁ దెలిసికొని తనలో 'నీసంగతి తెలిసినది. సమయము వచ్చినప్పుడు నీమూలమున నాకార్యమును నెఱవేర్చుకొందును.' అని యనుకొనుచు వెడలిపోయెను.

కాని దేవేంద్రుఁడు హీరహృదయమును సంపూర్ణముగ గ్రహియింపఁ జాలఁడయ్యెను.

---

## ఇరువదిర్యెదవ ప్రకరణము

రాత్రి యొంటిగంట యయ్యెను. శ్రీశచంద్రుఁడు బైఠకుఖానా యందు లేఁడు, భోజనమైనతరువాత నింటివారును, పరిచారకు లందఱును శయనించి యుండిరి. ఒకకుక్క వాఁకిలియొద్దఁ బరుండి యుండెను. అవకాశము దొరకుటవలన ప్రేమమయి యగు నొకపరిచారిక యొకపరిచారకునొద్దఁ గూరుచుండి తాంబూలమును సేవించుచు నిరువురు నేకాంతముగ సంభాషించుకొనుచుండిరి. కమలమణి తనశయన మందిరమున సూది చేతఁబట్టుకొని యున్నితో నుడుపులను నల్లుచుఁ గూరుచుండి యుండెను. కేశవిన్యాసమును వస్త్రాలంకారములును చెదరి యుండెను. అక్కడ నితరు లెవ్వరును లేరు. ఆమెచిన్నికొమ

నీవు కుందనందినిసమాచారముంగూర్చి వర్తమాన మంపితివి? ఆమె దొరకినది. ఈమాట విని సంతోషింపుము. దేవున కరటి పండ్లర్పింపుము. అంతియకాక మఱియొక సంతోషసమాచార మున్నది. కుందనందినికిని నాప్రాణేశ్వరునకును వివాహము కాఁగలదు. ఆవివాహమును నేనే సంఘటించితిని. విధవావివాహము శాస్త్రములయం దున్నది. అట్లుండఁగా దోషమేమి? ఒకటిరెండుదినములలో వివాహము కాఁగలదు. నీవంతలో రాఁజాలవు. అవకాశమున్నచో నీకు లగ్నపత్రికను పంపెదను. అనుకూలముగ నుండినచో సదస్యమునాఁటికైన రావచ్చును. నిన్నొకసారి చూడవలయునని యున్నది.

కమలమణి కాయుత్తరపుసంగతు లర్థము కాలేదు. తనభర్త యాఫీసునుండి యింకను వచ్చి యుండనందునఁ గొంతసేపు కోపనయై శయనించి యుండెను. భర్త యంతలో వచ్చి భోజనము చేసి శయ్యాగృహంబునఁ బ్రవేశించి సోఫాపైఁ గూరుచుండెను. కమలమణికోపముతో నట్లే పరుండి యుండెను. శ్రీశచంద్రుఁడు హుక్కాను తీసికొని దానిని సాక్షిగా నుంచుకొని "ఓహుక్కా! నీపొట్టనిండ గంగాజల మున్నది. తలపై నగ్నిహోత్ర మున్నది. నీవు సాక్షిగా నుండుము. నాప్రాణేశ్వరి నాపైఁగోపగించి యున్నది. ఇఁకఁ గొలఁదిసేపటిలో నాతో స్వయముగ మాటలాడఁగలదు. అట్లు మాటలాడనిచో నీతలపై మఱింతనిప్పువైచి కూర్చుండెదను" అనియెను. అప్పుడు కమలమణి "ఇంతవఱకు చాలును. ఇంకను హెచ్చయినచోఁ దలతిరిగిపోవును" అని పలుకుచు శయ్యపైనుండి లేచి వచ్చి హాస్యముఖియై సూర్యముఖి పంపిన యుత్తరమును చదివెను.

శ్రీశ—ఇదియేమి? నాతోఁ బరిహాస మాడుచుంటివా?

కమ—ఈయుత్తరమునం దట్లే యున్నది.

రుఁడు మఱిపులిని తనయొద్దనుంచుకొని యాడుకొనుచుండెను. కొలది దూరమునం దొకపిల్లి తనముఖమున విజ్ఞతాలక్షణములను తోఁపించుచు గభీరరాలై కూర్చుండియున్న యాకమలమణిని, ఆడుకొనుచున్న బాలకుని చూచుచుఁ దనలో 'మనుష్యులస్థితిగతు లతిభయంకరము లైనవి. ఎప్పుడునుపువులఁ గుట్టుటయు, మంటిబొమ్మలతో నాడుటయు మొదలగు తుచ్ఛకార్యములయందు వారిమనసు లగ్నమై యుండును. వారికి ధర్మకార్యములయందు బుద్ధి లేదు. పిల్లికి బిచ్చమైనఁ బెట్టరు. వారికాయుద్దేశమే లేదు. మరణానంతరమున వారి గతి యేమగునో?'' అని యను కొనుచు నాచోటినుండి మఱియొక చోటికిఁ బోయెను.

కమలమణి కొంతసేపటికి విసుగుచెంది యున్నియుడుపుల నల్లుటను మానివైచి కుమారునితో నాడుకొనుచుఁ గూరుచుండెను. పిల్లలయాటలు తల్లులకు బాగుగఁ దెలిసి యుండుటవలన దానినిగూర్చి విశేషించి చెప్పవలసినపని లేదు. ఆమెతనకుమారునిగూర్చి 'నీవాఫీసునకుఁ బోవలదు. పోయినచో నేమగును?'' అని యడిగెను. ఆముద్దుబిడ్డఁడు తనతల్లినిఁ గొట్టుచు 'నిన్నుఁ గొట్టుచున్నాను' అనియెను. ఇట్లు సంభాషించుచు నాటలాడుకొనుచుండగా పరిచారిక యొక్కతె కన్నులు నులిమికొనుచు వచ్చి యొకయుత్తరమును కమలమణిచేతికిచ్చెను. కమలమణి యాయుత్తరము నిచ్చి చదువుకొనియెను— ఎపణ్ణాయె మరలఁ జదివెను. మఱియొక సారికూడఁ జదువుకొని మౌనయయ్యెను. ఆయుత్తరమునం దిట్లున్నది.

''ప్రియతమా! నీవు కలకత్తానగరమునకు వెడలిపోయిన తరువాత నన్ను మఱచిపోయితివి. అట్లు కానిచో నొకయుత్తరమైన వ్రాయుట లేదేమి? నీక్షేమసమాచారములనుగూర్చి వినుటకుఁ గుతూహలురాలనై యుందు నని నీవెఱుంగవా?

శ్రీశ—అట్లయినచో నిజమే యైయుండును.

కమ—నిజమే యైనచో సూర్యముఖికిఁ గష్టమే.

శ్రీశచంద్రుఁడు వ్యాకులహృదయుఁడై "నాకేమియు బోధపడుట లేదు—నగేంద్రున కొకయుత్తరము వ్రాయుదునా ?" అనియెను.

కమలమణి యందుల కంగీకరించెను. శ్రీశచంద్రుఁడు పరిహాసముగ నగేంద్రున కొకయుత్తరము వ్రాసెను. ఆయుత్తరమునకుఁ బ్రత్యుత్తర మీవిధముగా వచ్చెను.

"నాప్రియసహోదరా! నన్నారక యాక్షేపింపవలదని నిన్నుఁ బ్రార్థించుటవలన నేమిప్రయోజనమున్నది ? తిరస్కారార్హుఁడు ముఖ్యముగఁ దిరస్కరింపఁబడవలసినదే. నేను వివాహము చేసికొనియెదను. అట్లు చేసికొనకున్నచో నేనున్మాదగ్రస్తుఁడ నగుదును. అట్లగుట కేమియు నభ్యంతరము లేదు.

ఇంతవఱకు వ్రాసినతరువాత నిఁక విశేషముగ వ్రాయవలసిన యవసరము లేదని తోఁచుచున్నది. ఆవిషయమున నీవును వ్యతిరేకముగఁ జెప్పవలసినమాట లేవియు నుండవు. ఒకవేళ నీవట్లు వ్యతిరేకముగఁ జెప్పినచో నందులకుఁ బ్రత్యుత్తరము నిచ్చుటకు సిద్ధముగా నుంటిని.

కొందఱు విధవావివాహము హిందూధర్మశాస్త్రమునకు విరుద్ధమని చెప్పుదురు. అందులకుఁ బ్రత్యుత్తరముగ విద్యాసాగరమహాశయులు ప్రబంధమును రచియించి యుండిరి. అంతటి శాస్త్రవిశారదుఁడగుమహామహోపాధ్యాయుఁడే విధవావివాహము శాస్త్రసమ్మతమని చెప్పుచున్నప్పుడు మఱియితరు లెవ్వరది యశాస్త్రీయ మైనదని చెప్పఁగలుగుదురు ? ఒకవేళ నది శాస్త్రసమ్మతమైనదే యైనను నందులకు సంఘము సమ్మతింపదనియు, నేనావివాహము చేసికొన్నచో సంఘము

నుండి బహిష్కరింపఁబడుదు ననియు నీవందువేని నేనందులకుఁ బ్రత్యుత్తరమిచ్చెదను. ఏమనిన—నేనే సంఘము నై యుండఁగా నాకు సంఘచ్యుతి యనిన నెట్టిది? గోవిందపురమున నన్ను బహిష్కరించుట యెవ్వరితరమగును ? అయినను మీవంటివారికి సమాధానముకొఱకు నేనావివాహమును రహస్యముగా నుంచెదను. సామాన్యముగ నాసంగతి యెవ్వరికిని తెలియఁబోదు.

నీవాయాక్షేపణము చేయుటలేదు. నీవు చెప్పునది. యేమనిన—కళత్రము జీవించియుండఁగా ద్వితీయవివాహముఁ జేసికొనుట నీతివిరుద్ధమని చెప్పెదవు? అది యెట్లు నీతివిరుద్ధమగును? నీవానీతిని నాంగ్లేయులవలన నేర్చుకొని యుంటివి. అట్లే కానిచో నీభారతవర్షమున నామాట యెన్నఁడును లేదు. ఇంగ్లీషువారు చెప్పినంతమాత్రముననే యది భ్రాంతిరహితమైన నీతియా! వారిబైబిలునందు మోజసనునాతఁడు చెప్పినంతమాత్రమున నది యింగ్లీషువారి కాచార మయ్యెను. వారిలో నట్టిసంస్కార మున్నది. కాని నీకునునాకును 'మూసాగారి వాక్యమే యీశ్వరవాక్యము కాఁజాలదు. నీవును దాని నంగీకరించియే చెప్పవలయును. కాని యొక్కపురుషునకు రెండువివాహములు నీతివిరుద్ధమని మఱి యే కారణమునఁ జెప్పగలవు.

నీవు పురుషున కిరువురుభార్య లుండినచో నొకయువతి కిరువురుభర్త లేలయుండఁగూడదని యందువు. ఒకయువతి కిద్దరు పతులుండినచో ననేకానిష్టములు కలవు. బిడ్డలకుఁ దండ్రియే పోషకుఁడై యుండును. తండ్రియే తెలియఁబడక పోయినప్పుడు సంఘమునకు విఘ్నపాటు కలుగును. కాని పురుషునకు రెండువివాహము లైనను బిడ్డకుఁ దల్లియెవ్వరో తెలియకుండదు. ఈవిధముగా ననేకోక్తులను దెలుపవచ్చును.

బహుజనుల కనిష్టకారణమైన దేదియో యదియే నీతివిరుద్ధమైనది. నీవు పురుషునకు రెండువివాహములగుట నీతివిరుద్ధమని

చెప్పినచో నది చాలమందిజనుల కనిష్టదాయకమని తోఁపవలసి యుండును.

ఇంటియందుఁ గలహాదులకుఁ గారణ మగునన్న మాటమాత్ర మునిజమని నీవొక యుక్తి చెప్పుదువు. అందులకు నేనొక యుక్తి చెప్పెదను. నాకు సంతానము లేదు. నేను మరణించినచో నావంశ ముపేరు లేకుండఁబోఁగలదు. ఈవివాహామువలన సంతానము కలుగుటకవకాశ మున్నది. ఇది యుక్తి కాదా?

కడపటిమాట యేమనిన—సూర్యముఖకి ప్రేమమయియైన ప్రాణేశ్వరికి సపత్నీసంకటము నేలకలిగింపవలయును? అదియొక ప్రబలమైన యాక్షేపణయే. కాని సూర్యముఖి యీవివాహామువలన దుఃఖిత యగుట లేదు. సూర్యముఖియే యీవివాహప్రస్తావము నెత్తియామెయే నాకీప్రవృత్తి కలిగించినది. ఆమెయే యీకార్యము నకుఁ గర్త్రిణియైయున్నది. ఇట్లుండ మఱియెవ్వరాక్షేపింపగలరు?

మఱి యేకారణమున విధవావిహావాము నిందనీయమైనది?

---

## ఇరువదియాఱవ ప్రకరణము

---

కమలమణి యాయుత్తరమును జదివి "ఏకారణమువలన నింద నీయమగునో? జగదీశ్వరుఁడే యెఱుంగవలయును. కాని, ఇదియేమి భ్రాంతి! పురుషున కేమియును దెలియనట్లు కాన్పించుచున్నది. ఏమైనఁ గానిండు. మీారు సిద్ధముకావలయును. మనము గోవిందపురమునకుఁ బోవలయును" అనియెను.

శ్రీశ—నీవు వివాహామును నిలిపెదవా?

కమ—అట్లుకాదు. నాయన్నయెదుటఁ బడి చచ్చెదను.

శ్రీశ—అది జరగదు. క్రొత్తవదినెగారి ముక్కును కోసికొని రావచ్చును. నవ్వుము. అట్లేచేయుము.

ఇద్దఱును గోవిందపురమునకుఁ బోవుటకు సంసిద్ధులైరి. మఱు నాఁడు పడవపై బయలుదేరి యథాకాలమున గోవిందపురమునకు వచ్చి చేరిరి.

ఇంటికిఁబోయి చేరుటకు ముందుగ దాసీజనమును, ఊరిలోని స్త్రీలను జూచిరి. అనేకులు కమలమణిని పడవనుండి పిలిచికొనిపోవుటకై వచ్చియుండిరి. పెండ్లియైనదో లేదో యను సంశయమును దెలిసికొనుటకై భార్యాభర్తలిరువురు నాతురపడుచుండిరి. కాని యిద్దఱిలో నెవ్వరును నావిషయమై యెవ్వరినడుగ లేదు—లజ్జాకరమైన యామాటను నోరువిప్పి యెవ్వరినడుగనగును ?

కమలమణి యతి వ్యస్తచిత్తయై యంతఃపురమునఁ బ్రవేశించెను. సతీశుఁ డామెతోరాలేదు—వెనుకనుండెను. ఆమె యాతని మఱచిపోయెను. ఇంటిలోఁ బ్రవేశించి యించుకయును ధైర్యము లేనిదై యొకదాసినిగూర్చి 'సూర్యముఖి యెక్కడనున్నది ?' అని యామె యడిగెను. మనస్సులో వివాహము జరగిపోయినదనియు—సూర్యముఖి చచ్చిపోయిన దనియు—ఎవ్వరైనఁ జెప్పిపోవుదురను భయము హెచ్చు కాఁజొచ్చెను.

దాసి యొకతె 'సూర్యముఖి శయ్యాగృహమునం దున్నది' అని చెప్పెను.

కమల వేగముగా నక్కడకుఁ బోయెను. పోయి చూడఁగా నక్కడ నెవ్వరు నగపడలేదు. ఒక ముహూర్తపర్యంతము నటునిటు చూచెను. తుదకు లోపల ద్వారము మూయఁబడియున్న గవాక్షము క్రింద నధోవదనయై యొకస్త్రీ కూర్చుండియుండుటను జూచెను. ఆమె ముఖము కనఁబడలేదు. అయినను కమల యామెయే సూర్య

ముఖియని తెలిసికొనియెను. సూర్యముఖి కమల యడుగులచప్పుడును విని లేచివచ్చి యామె పార్శ్వమున నిలుచుండెను. వివాహమైనదో లేదో యని యడుగుటకుఁ గమలమణికి నోరురాలేదు. సూర్యముఖి భుజమూలము లెత్తుగఁ గానవచ్చుచుండెను. ఆమె యా దేవదారు సదృశ దేహతరువు ధనుస్సువలె వంగిపోయి యుండెను. ఆమె ప్రఫుల్ల పద్మపలాశ నేత్రములు గుంటలుపడి పోయియుండెను. ఆమె యాపద్మ సదృశముఖము దీర్ఘాకృతిగాఁ గానవచ్చుచుండెను. వివాహ మైనదని కమల తెలిసికొని 'ఎప్పుడుజరగినది?' అని యడిగెను. సూర్యముఖి 'నిన్న' యని చెప్పెను.

ఇద్దరు నక్కడఁ గూర్చుండి మౌనముగా నేడువనారంభించిరి. ఆ యిద్దఱిలో నెవ్వరును మాటాడలేదు. సూర్యముఖి కమలతొడపైఁ దలనుంచుకొని యేడువ నారంభించెను. కమలమణి కన్నీ రామెతలపై ప్రవహించుచుండెను.

కమ.—నీవు సుఖపడితివా?

సూర్య.—నామాట నెందులకడిగెదవు? నేనెవ్వతెను? నడచుచున్నప్పుడు వారి కాలికి ముల్లుగ్రుచ్చుకొనకుండ నానాలుకనడ్డముగా నెందులకుఁ బఱుపనైతినని వ్యసనపడుచుంటిని.

ఇట్లుచెప్పి సూర్యముఖి క్షణకాలమూరకుండెను. ఆమె కన్నీటిచే నామెకట్టుకొనినబట్ట తడిసిపోయెను. పిమ్మట ముఖమునెత్తి "కమలా! ఏదోదేశమున నాడుపిల్లలుపుట్టినచోఁ జంపివేయుదురఁట! అదేదేశము?" అని యడిగెను.

ఆమె మనోభావమును దెలిసికొని కమల "ఆఁడుదై పుట్టినంత మాత్రమున దోషమేమి? వారివారియదృష్టమునందున్నంతజరగును" అనియెను.

సూర్య.—నాకంటె నదృష్టశాలిను లెవ్వరు? ఇంతటిస్వామి యెవ్వరికిలభించును? రూపము, ఐశ్వర్యము, సంపద మొదలగు

వానితోఁ బ్రయోజనము లేదు. వారివలె గుణపరిపూర్ణులైన స్వామి మఱెవ్వరికున్నారు? నాయదృష్టము బలమైనది. అయినను నిర్లైంగులకు జరగినదో గోచరించుట లేదు.

కమ—అదియు నదృష్టమే.

సూర్య—అయినచో జ్వాలవలన మనసు దహించుకొని పోవుట యెందులకు?

కమ—నీవు నీస్వామియాహ్లాదపరిపూర్ణమైన ముఖమును జూచి సుఖించుచున్నానని చెప్పుచుంటివి—అయినను జ్వాలవలన మనసు మండిపోవుచున్నదనియుఁ జెప్పుచుంటివి—రెండును నిజమైనమాట లేనా?

సూర్య—రెండును నిజమైనవియే. నేను వారిసుఖమునందు సుఖవంతురాలనై యుంటిని. కాని, నన్ను వారు కాలితోఁ దన్ని వైచిరి. కాలితోఁ దన్నితినని వారికెంతసంతోషము—

సూర్యముఖికి ముందు మాటరాలేదు—కంఠరోధమయ్యెను—కన్నులశ్రుజలప్రపూర్ణములయ్యెను. కాని. సూర్యముఖి యసంపూర్తి వాక్యమునందుమర్మమును కమలమణి సంపూర్ణముగా గ్రహించి "వారు నిన్ను కాలితోఁ దన్నిరని నీకాంతరికజ్వాలహత్తి యున్నది. అట్లున్నను "నేనెవ్వరు?" అని చెప్పుటయెందులకు? నీ యంతఃకరణమునందు "నేను "అనునది నిండియున్నఁ దనికనఁబడుచున్నది. అట్లైకానిచో నాత్మవిసర్జనము చేసియున్న నీ వనుతాపపడుట యెందులకు?" అనియెను.

సూర్య—అనుతాపపడుట లేదు. మంచిపనినే చేసియుంటిని. అందులకు సంశయములేదు. కాని,.మరణమునందు యాతన యున్నట్లేయున్నది. మరణము మంచిదని నామరణమును నేనే దెచ్చికొంటిని. ఆమరణసమయమునందు యాతనకొఱకు నీ ముందేడువరాదా?

సూర్యముఖియేడ్చెను, కమలమణి యామెముఖమును దన హృదయమునఁ జేర్చి పట్టుకొనియెను. మాటలవలన నభిప్రాయము లన్నియు వ్యక్తపడుటలేదు. మనస్సునందే పరస్పరసంభాషణము జరుగుచుండెను. కమల తన మనసున సూర్యముఖి యెంతటిదుఃఖినియై యుండెనో తెలిసికొనియెను. సూర్యముఖి తనమనంబున, కమల తన దుఃఖములను దెలిసికొన్నదని గ్రహించెను.

ఇద్దఱును రోదనమును నిలిపి కన్నీటిని దుడిచికొనిరి. సూర్యముఖి తనవిచారమును విడిచి మఱియొక ప్రస్తావము నెత్తెను. బిడ్డయగు సతీశచంద్రుని బిలిపించి యాతని నాదరించి యాతనితో మాటాడెను. కమలతో సతీశచంద్రులనుగూర్చి సంభాషించెను. సతీశునకువిద్య నేర్పించుట ఆతనిపెండ్లి, మొదలగు ననేకములగు సంతోషకర విషయముగూర్చి సంభాషణము జరిగెను. ఈవిధముగా రాత్రి చాలసేపు ప్రసంగము జరగినపిమ్మట సూర్యముఖి కమలను స్నేహపూర్వకముగా నాలింగనముచేసికొని తరువాత సతీశుని తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని యాతనిముఖమును ముద్దుపెట్టుకొనియెను. పిమ్మటవారిద్దఱును వెడలిపోవుచున్నప్పు డడ్డగించుట కసాధ్యముగా సూర్యముఖి కన్నులనుండి మరలఁ గన్నీరు ప్రవహింప నారంభించెను. రోదనముఁజేయుచు నామెసతీశు నాశీర్వదించి, బిడ్డా! నీవు నీమేనమామగారి రీతి నెయ్యుఁడయగుణములు గలవాఁడవగుము. అంతకంటె హెచ్చుగనేమని నిన్నాశీర్వదింతును?' అనియెను.

సూర్యముఖి యీమాటలు స్వాభావికమైన తనమృదుస్వరముతోడనేచెప్పెను. కాని, యామెకంఠస్వర మించుకమార్పునొందుటనుజూచి కమలచకితయై "వదినే! నీమనస్సులో నేమున్నది? చెప్పఁగూడదా?" అనియెను.

సూర్య—ఏమియును లేదు.

కమ—నాయొద్దదాపవలదు.

సూర్య—నీకుఁ జెప్పనిమాటయేమియును లేదు.

అప్పుడు నగేంద్రుఁడు బైఠఖానాయందుగూర్చుండి 'కుందా! నాకుందా!' అని యనుకొనుచుండెను. శ్రీశచంద్రుఁడు వచ్చిపార్శ్వమునందుఁ గూర్చుండెను. వారిద్దఱికిని బాగుగ సంభాషణము జరగలేదు. నగేంద్రుఁడు తనమనస్సునందు 'సూర్యముఖియే ప్రయత్నించి యీపెండ్లిచేసినది, నాయీసుఖమునకు మఱెవ్వరి యాక్షేపణముండును?' అనియనుకొనుచుండెను.

---

## ఇరువదియేడవ ప్రకరణము

ప్రదోషకాలమున బరస్పరమును మాటలాడుకొనుచున్నప్పుడు సూర్యముఖి కమలమణితో నగేంద్రునకును కుందకును జరిగిన వివాహవృత్తాంతమంతయు వివరముగాఁ జెప్పెను. విని కమలమణి యాశ్చర్యపడి "ఆపాడుపెండ్లి నీప్రయత్నమూలముననే జరగినట్లయినది' అనియెను.

సూర్యముఖి నవ్వి "నేనెవ్వరు ?"—మృదువైనక్షీణమైన నవ్వు—వర్షము. కురిసినవెనుక నాకాశప్రాంతమునందు భిన్నమైన మేఘమునుండి వెలువడుమంచువలెనున్న నవ్వును నవ్వి "నేనెవ్వరు? పోయి మీయన్నగారినొకసారి చూచిరమ్ము — ఆముఖమునందు నిండియున్న యాహ్లాదమునుజూచిరమ్ము — అప్పుడు, వారెంతటి యానందముతోసుఖులై యున్నారోబోధపడునువారంతటిసుఖవంతులై యుండుటను జూచుటచే నాజన్మము సార్థకమగుటలేదా ? నేనేసుఖాశక్తై వారినసుఖులుగాఁ జేయుదును ? వారొక నిమిషమసుఖులైనచో

నేను ప్రాణమును విడుటకుఁగూడ సంసిద్ధురాలనై యుంటిని— అట్టివారు రేయుంబవలు మర్మాంతికముగా నసుఖులై యుండుటను జూచితి. వారు సకలసుఖములను విడిచి దేశత్యాగులు కావలయు నని ప్రయత్నముచేయుచుండిరి. అట్లయినచో నాసుఖమేమి మిగిలి యున్నట్లు ? నేను "ప్రభూ ! మీసుఖమే నాసుఖము. మీరు కుందను వివాహముచేసికొనవచ్చునేని—నేను సుఖినయ్యెదను" అని చెప్పితిని. వారు పెండ్లిచేసికొనిరి" అని చెప్పెను.

కమల స్వస్థచిత్తయై తనశయనమందిరమునకు వెడలిపోయెను. కాని, సూర్యముఖి యామెకుఁ దెలుపకుండ నొకమాటను దాచి పెట్టెను. అది కమలకు వెలుగువచ్చినమీఁదటఁ దెలియవచ్చెను తెల్లవారినపిమ్మటఁ గమల సూర్యముఖిని జూచుటకై యామె శయ్యా గృహమునకుఁ బోయెను. సూర్యముఖి యక్కడఁ గనఁబడలేదు. వేసినప్రక్క వేసినట్లే యుండెను. దానిపై రాత్రి యెవ్వరును బరు న్నట్లే కనఁబడలేదు. దానిపై నొక యుత్తరము మాత్రముండెను. ఆయుత్తరమును జూచినతోడనే యామె మనసేమోవ్యాకులపడఁ జొచ్చెను. సూర్యముఖి యెక్కడకో వెడలిపోయినదని తెలిసికొని యెను. ఆయుత్తరమును విప్పి చదువుట కిష్టము కలుగలేదు. దానిని చేతియందుంచుకొనియెను. తుదకుఁ దలపై చేతినుంచుకొని ప్రక్కపైఁ గూర్చుండి యుత్తరమును జదివి "నేను పిచ్చిదానను. నిన్నరాత్రి యామెను విడిచి వెళ్లునప్పుడు మనస్సునకు గోచరించుచున్నను, తెలిసికొనలేకయే పోయితిని." అని యనుకొనియెను. దగ్గరనిలుచుం డిన సతీశుఁడు తల్లిచేతితోఁ దలనుపట్టుకొని యుండుటను జూచి యేడువఁదొడఁగెను.

---

# ఇరువదియెనిమిదవప్రకరణము.

దుఃఖప్రవాహముయొక్క ప్రథమవేగము శాంతించిన తరువాత కమలమణి యాయుత్తరమును విప్పి చదువుకొనియెను. ఆయుత్తరముపై పేరునుబట్టి చూడఁగా నదికమలమణికే వ్రాయఁబడియుండెను. ఆయుత్తరమునం దిట్లు వ్రాయబడియుండెను.

"ఎప్పుడు నాప్రాణేశ్వరుని నోటినుండి నావలనఁ దనకు సుఖముకలుగుట లేదనియు, తాను కుందనందినికొఱకు తనప్రాణములనైన విడువఁదలఁచుకొని యుంటిననియుఁ బలుకఁబడిన మాటలను వినియుంటినో యప్పుడే నాహృదయమునందుఁ గుందనందిని దొరకినచో నామెచేతికి నాస్వామి నొప్పగించివైచి వారిని సుఖవంతులుగాఁ జేయవలయు ననియు, కుందనందినికి నాప్రాణేశ్వరుని దానముచేసి నేనిల్లు విడిచి బయలుదేరి పోవలయు ననియు సంకల్పించుకొని యుంటిని.

నేను మొన్నటిదినమున వివాహమైనతోడనే యారాత్రి యిల్లువిడిచి పోవలయు ననుకొంటిని. కాని నాస్వామి సుఖముకొఱకు ప్రాణములనైన విడువసిద్ధముగనున్న నేను నాప్రాణేశ్వరుని యాసుఖము నొకటిరెండుదినములు కన్నారఁ జూడవలయు నని యాశపడితిని. అంతియకాక నిన్నొకసారి చూచిపోవలయు ననికూడఁ గుతూహలము కలదు. అందువలన నిన్నొకసారి రమ్మని నీకు జాబువ్రాసి యంపితిని. నాకు నీవు తప్పక వచ్చెదవను ధైర్యముకూడఁ గలదు. ఇప్పటికారెండాశలును తీరిపోయినవి. నాప్రాణాధికుఁడు సుఖియై యున్నాఁడు. ఆసుఖమును నేను కన్నారఁ జూచితిని. నీయొద్దఁగూడ సెలవుతీసికొనినట్లే యైనది. కావున నిప్పుడు బయలుదేరితిని.

నీవీయుత్తరము చదువుకొనునంతలోనే నేను చాలదూరము పోయియుందును. ఇల్లువిడిచి వెడలిపోయెదనని నీకుఁ దెలిపినచో

నీవునన్ను విడువఁజాల వనుచు నుద్దేశము వెడలిపోయినపుడు నీతోఁ జెప్ప మానితిని. నిన్నిప్పుడు ప్రార్థించున దేమనఁగా—నీవు నన్ను వెదకింప కుండవలయును. ఇదియే నాప్రార్థనము.

మరల నిన్నుఁజూచెదనను ధైర్యము నాకు లేదు. కుందనం దినియున్నంతవఱకు నేనీ దేశమున వచ్చుదానఁ గాను—మఱియును నేనుండుచోటు మీకుఁ దెలియఁబోదు. నేనిప్పుడు వీథులవెంబడిని దిరుగుభిక్షుకురాలను. ఆవేషముతోడనే నేనెల్ల దేశములను తిరిగెదను. నేనుభిక్షవలననే కాలక్షేపము చేసికొనుచుందును. కావున నెవ్వరును నన్ను గుర్తింపఁజాలరు. నేను వెడలిపోవునప్పు డొకించుక ద్రవ్యము తీసికొని పోవలసినదే. కాని నాకా యిష్టములేదు. నాస్వామినే త్యజించిపోవుచున్న దానికి ధన మెందులకు ?

నాకొఱకు నీవొక్క కార్యము నిర్వహింపవలయును. నాప్రాణేశ్వరుని చరణకమలములకుఁ గోటిప్రణామములని నామాటగ విన్నపము చేయవలయును. నేనుబయలుదేరునప్పుడు ప్రాణేశ్వరునకుజాబు వ్రాయవలయునని ప్రయత్నించితిని. కాని యట్లు వ్రాయుటకు సాధ్యము కాలేదు. కన్నీటిమూలమున నక్షరము లగపడుట లేదు—కాగిత ముకూడఁ దడిసిపోయినది. దానిని చించిపారవైచి మరల వ్రాసితిని. మరలఁ జించివైచితిని. కాని నేను మనవి చేసుకొనవలసిన సంగతు లెన్నియనియుత్తరమున వ్రాసి ముగింపఁగలను? మాటలాడుటకై ననుసందర్భపడక పోవుటవలన నుత్తరమునైనను వ్రాయఁజాలక పోయితిని. నీవుబాగుగ నాలోచించి నేనువారిపైఁ గోపగించి పోవుట లేదని నాప్రాణేశ్వరున కెట్లు చెప్పవలయునో యట్లు చెప్పవలయును. నాకు వారిపైఁ గోపములేదు. నేనెప్పుడును వారిపైఁ గోపగింపలేదు. ఎప్పటికిని గోపగించుదానఁ గాను. నామనసునం దెవ్వరిని జ్ఞప్తిఁ దెచ్చికొన్నంతమాత్రమున నా కానందము కలుగునో యట్టివారిపైఁ

గోపగించుట యెట్లు? వారిపై నాకుఁ గల ప్రేమ మతినిశ్చలమైనది. ఈమట్టి మట్టిలోఁ గలసిపోవునంతవఱకు నాభక్తి యట్లే నిశ్చలమై యుండును. ఏమనిన — వేలకొలఁదిగల వారి సుగుణములను నే నెప్పటికిని మఱవఁజాలను. అన్నిసుగుణములు మఱియెవ్వరికిని లేవనియే నేను వారికి దాసినై యుండును. ఒక్కదోషమునకుఁగాను వారి గుణసహస్రమును మఱచిపోయినచో నేను వారిదాసినగుటకు యోగ్యురాలనే కాను. నేనీ జన్మమునందు వారియొద్ద సెలవుగైకొనుటను బట్టియే నే నెంతటిదుఃఖముతో సర్వత్యాగిని నైపోయితినో తెలియఁగలదు.

నీయొద్దఁ గూడ నిఁక నీజన్మమున సెలవు తీసికొనియెదను. నీ భర్తయును, నీ కుమారుఁడును చిరంజీవులై యుండవలయు నని యాశీర్వదించుచుంటిని. నీవును చిరసుఖవతివై యుండుము. నీస్వామి ప్రేమమునుండి యెప్పుడైన నీవు మోసగింపఁబడుట తటస్థించు నేని నీ యాయుష్యమప్పుడే ముగియుఁగాకయని యాశీర్వదించు చుంటిని. అయ్యో! నాకట్టి యాశీర్వాదము నెవ్వరును చేయకపోయిరి?

---

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము

విషవృక్షముయొక్క యేబీజము నాటినది మొదలుకొని ఫలోదయమువఱకును, మఱియు ఫలానుభోగమువఱకును, వ్యాఖ్యానము చేయుటకు మేము ప్రవృత్తులమై యుంటిమో యావృక్షముయొక్క బీజ మెల్లరియింటిముంగిటియందును నాటఁబడియుండెను. అరివర్గముల ప్రాబల్యమే యావృక్షమునకు బీజము. అది ఘటనాధీనమై యందఱియిండ్లను మొలకవేయబడి యుండెను. రాగద్వేషములచే

స్పృశియింపఁబడని హృదయముగల మనుజుఁ డెవ్వఁడును లేఁడు. జ్ఞానులైనవారియందును సామాన్యముగ నరివర్గములచేఁ జలియింపఁ బడని వారు చాలఁ దక్కువగా నుందురు. ప్రతిమనుజునకును గల భేద మేమనిన—ఎవ్వఁ డతి క్రూరమై సముద్ధతం బగు స్వభావము గల మనోవ్యాపారమును శాంతింపఁజేసికొనకుండునో యట్టివానికొఱకు విషవృక్షబీజము నాటఁబడినట్లగును. చిత్తసంయమనాభావమే యా బీజమున కంకురము. అందుమూలముననే యావృక్షము విస్తరించుట. ఆవృక్షము మిగుల బలమైనది. ఒక్కసారి దాని మొదలు బలపడినచో నిఁక దానికి నాశము లేదు. దానికాంతియో! మిగుల సుందరమై నేత్రానందకరముగ నుండును. వివిధవర్ణములుగల దాని పల్లవము లను, వికసించిన కుసుమమంజరులను దూరమునుండి కాంచినచో నతి రమణీయములుగా నుండును. కాని దాని ఫలముమాత్రము విషమయమైనది. దానిని దినువారు చచ్చెదరు.

క్షేత్రభేదమువలన విషవృక్షమునుండి నానావిధంబు లగు ఫలంబు లుదయించుచుండును. పాత్రవిశేషమువలన నావృక్షమునందు రోగశోకాదులను నానావిధఫలసముదాయములు ఫలియించును. చిత్త మును స్వాధీనపఱచుకొనవలసినచో నుందావిషయమునఁ బ్రవృత్తి కలుగవలయును. పిమ్మటఁజిత్తమును వశపఱచుకొనుసామర్థ్యముండ వలయును. ఆసామర్థ్యము ప్రకృతిజన్యమైనది. ప్రవృత్తి యనునది విద్యాశిక్షణమువలనఁ గలుగఁదగినది. ప్రకృతి శిక్షపై నధీనపడి యుండును, అందువలనఁ జిత్తసంయమనమునకు శిక్షయే మూలమై నది. కాని గురూపదేశమాత్రమే శిక్ష యని తలంపఁగూడదు. అంతః కరణము శిక్షింపఁబడవలయునేని దానికి దుఃఖభోగమే ముఖ్య శిక్షయైయున్నది.

నగేంద్రున కాదుఃఖభోగమనుశిక్ష కాలేదు. పరమేశ్వరుఁ డాతనిని సకలసుఖములకు నధీశునిగాఁజేసి భూలోకమునకుఁ బంపి

యుండెను. మనోహరమైన రూపము—విపులమగు నైశ్వర్యము—నిరోగమగు శరీరము—స్నేహమయియై మహాపతివ్రత యగు భార్య—సామాన్యముగ నివియన్నియు లభియించునదృష్ట మొక్కనికిఁ గలుగుటరుదు. నగేంద్రున కొక్కనికిమాత్రమే యివి యన్నియును లభియించెను. ముఖ్యముగా నగేంద్రుఁ డాతనిస్వభావ గుణాగణంబుల వలనను, పవిత్రచరిత్రమువలనను చిరసుఖవంతుఁడై యుండెను. ఆతఁడు సత్యవాదియు, ప్రియంవదుడు నై యుండెను. పరోపకారియు న్యాయనిష్ఠుడుగూడ నై యుండెను. దాతయయ్యును మితవ్యయుఁడై యుండెను. స్నేహశీలుఁ డయ్యును కర్తవ్యకార్యస్థిరసంకల్పుఁ డై యుండెను. ఆతఁడు తనతల్లిదండ్రులు జీవించియున్నప్పుడు వారియెడల భక్తికల్గి వారికిఁ బ్రియంబుల నాచరించుచుండెడివాఁడు. ఆతఁడు భార్యయం దత్యంతానురక్తుఁడు. బంధుహితకారి. భృత్యులయెడలఁ గృపాపరుఁడు. ఆశ్రితప్రతిపాలకుఁడు. శత్రువివాదశూన్యుఁడు. మంత్రాలోచనవిశారదుఁడు. కార్యాచరణమునందు సరళహృదయుఁడును, సంభాషణావసరంబున వినమ్రుఁడును, రహస్యమునఁ గేవల వాఙ్మయుఁడు నై యుండెను. అంతటి యుత్తమచరిత్రునకు విశేషసుఖము నొసంగుటయే పరమేశ్వరునిబహుమానము—నగేంద్రునకు బాల్యమునుండియు సౌఖ్యమే లభియించి యుండెను. ఆతనికి తనదేశమున సన్మానమును, విదేశములయందు యశస్సును నిండి యుండెను. అనుగతులగుసేవకులను, ప్రజలును నాతనియెడల భక్తికలవారై యుండిరి. ఆతనికి సూర్యముఖియందు నిశ్చలంబును నపరిమితంబునుఁ నకలుషితంబును నగు ప్రేమముకలదు. ఆతనిజీవితమునం దంతటిసుఖమే లేకపోయినయెడల నంతటిదుఃఖము కలుగనేరదు.

మనుష్యుఁడు కేవలము దుఃఖియే యైనచో నాశకు లోఁబడఁ జాలఁడు. ఆతని కేదిలేకపోవునో దానియం దాతనికి లోభ ముద

యించును. కుందనందినిని లుబ్ధలోచనములతోఁ జూచుటకుముందు నగేంద్రుఁడెన్నఁడును లోభపీడితుఁడు కాలేదు. ఏమనిన—ఆతని కేదియును లేదనుమాటయే లేదు. ఒకటి కావలయు నని యాతఁడు కోరి యుండ లేదు. అన్నియు నాతని కేయుండెను. అందువలన లోభసంయమనముకొఱకు కావలసిన మానసిక శిక్ష యాతనికిఁగాలేదు. అందువలననే యాతఁడుతనచిత్తమును వశపఱచుకోవలయు నని ప్రయత్నించినను సమర్థుఁడు కాఁజాలఁడయ్యెను. అవిచ్ఛిన్నం బగుసుఖమే దుఃఖమునకు మూలము. మఱియును మొదట దుఃఖమే లేనియెడల సుఖస్థాయియైయుండ నేరదు.

మేము నగేంద్రునియందు దోషము లేదని చెప్పుట లేదు. ఆతనిదోషము గురుతరమైనదియే. అందులకుఁ దగినప్రాయశ్చిత్తము కూడ గురుతరమైనదియే. ప్రారంభ మయ్యెను.

---

## ముప్పదియవ ప్రకరణము

సూర్యముఖి యగపడకుండఁ బోయిన దన్నసమాచారమింటి వారికిఁ దెలియవచ్చినతోడనే దిక్కుదిక్కులకును పరిచారకు లామెను వెదకుటకై పోయిరని చెప్పవలసినపని లేదు. నగేంద్రుఁడు నలుదెసలకును మనుష్యులను పంపించెను. శ్రీశచంద్రుఁడును పంపెను. కమలమణికూడఁ బంపించెను. పెద్దపెద్దపరిచారికలు మంచినీళ్ళబిందెలను వదలి బయలుదేరిరి. హిందూస్థానీయు లగుద్వారపాలకులు పెద్దపెద్ద యంగీలనుధరించి పాదరక్షలుచటచటశబ్దము సేయుచుండ బల్లెములను చేఁబూని బయలుదేరిరి. పరిచారకులు తువాళ్ళను భుజములపై వైచుకొని నడికట్టులను బాగుగఁబిగించుకొని రాణిగారినితీసికొనివచ్చుటకై

బయలు దేరిపోయిరి. బంధువులు కొందఱు బండ్లు చేసికొని పెద్దపెద్ద రాజమార్గములను బట్టి పోయిరి. కొందఱు జనులు చెట్లక్రిందఁ గూరు చుండి సభలు చేసి తాంబూలములను సేవింప నారంభించిరి. గొప్ప వారు బంగారుశోభవంతులముంగిటిళ్ళయందును, శిఖరములయందును, దేవాలయములయందును "న్యాయకచాకచి" మొదలగుబిరుదులు గలభట్టాచార్యులు పాఠశాలలయందును, నట్టిపోలికగల యితరస్థల ములయందును, వెదకుచుఁ జర్చింప నారంభించిరి.

స్త్రీలు, ముసలివారలును, యౌవనవతులును, వందఱును స్నానఘట్టములు మొదలగుచోట్లుఁ బంచాయితీలను నారంభించిరి. పిల్లవాండ్రలోఁ జాలగందరగోళముగానుండెను. చాలమంది పిల్లలు పాఠశాలకు సెలవిచ్చెద రనుధైర్యముతో నుండిరి.

మొట్టమొదట శ్రీశచంద్రుఁడు నగేంద్రునకును, కమల మణి కిని సమాధానవచనములం దెలుపుచు నామె చాలదూరము పోయి యుండదనియు ఒకటిరెండుమైళ్ళదూరము పోయి యెచ్చటనో కూరు చుండి యుండుననియు, త్వరలోనే దొరకవచ్చుననియు వారలకు ధైర్యము కలిగించుచుండెను—కాని రెండుమూఁడుగంటల సేపైనది ఇంకను సూర్యముఖి దొరకలేదు, ఆమెసమాచారముకూడఁ దెలియ లేదు. నగేంద్రుఁడు స్వయముగా నెండలో నామెను వెదకుటకు బయలుదేరెను. కొంతదూరమువఱకు పోయి యెండకు సహింపఁ జాలక "నే నూరక యేల వెదకవలయును? ఇంతలోపల నామె యింటికిఁ దీసికొనిరాఁబడి యుండవచ్చును." అని యోచించి వెనుదిరిగి యింటికి వచ్చెను. అట్లు వచ్చిచూడఁగా సూర్యముఖిజాడ యేమియును దెలియనే లేదు. ఆతఁడు మరల బయలుదేరెను. తిరిగి యింటికి వచ్చెను. ఇట్లు చేయుటలోనే సంధ్యాకాలమగు చుండెను.

మొత్తముమీఁద శ్రీశచంద్రుఁడు చెప్పినమాట నిజమే. సూర్యముఖి యెన్నఁడును నిల్లువిడిచి వెడలినది కాదు. ఎంతదూరము నడువఁ గలదు? ఇల్లువిడిచి రెండుమైళ్ళదూరముపోయి యట నొక సరోవర పార్శ్వమున నున్న మామిడితోఁటలోఁ బండుకొనియెను. అంతఃపురమునకుఁ బోవుచు వచ్చుచున్న పరిచారకుఁ డొక్కఁడు వెదకుచుఁ బోయి యచ్చటకు వచ్చి చూచి సూర్యముఖి నానవాలు పట్టి "అమ్మా! మందిరమునకు దయచేయుఁడు." అనియెను.

సూర్యముఖి మాటలాడలేదు. పరిచారకుఁడు మరల "దయచేయవలయును. ఇంటియం దెల్లరు వ్యస్తచిత్తులై యున్నారు." అనియెను. సూర్యముఖి కోపదృష్టితో "నాకుఁ జెప్పుటకు నీవెవ్వరు?" అని గద్దించి పలికెను. పరిచారకుఁడు భయపడి యల్లే యూరక నిలువఁబడియెను. అప్పుడు సూర్యముఖి "నీవిచ్చట నింకను నిలిచి యుందువేని నేనీపుష్కరిణీజలంబులఁ బడియెదను." అనియెను.

పరిచారకుడు చేయునదిలేక పరువెత్తుకొనిపోయి నగేంద్రునకీ సమాచారముం దెలియఁజేసెను. నగేంద్రుఁడు పల్లకిం దీసికొని స్వయముగ బయలుదేరెను. కాని, యచ్చట సూర్యముఖి యగపడ లేదు. అందందు వెదకి చూచెను. కాని దొరకలేదు.

సూర్యముఖి యటనుండి లేచి పోయి మఱియొక వనమునఁ గూరుచుండెను. అచ్చట నొక ముదుసలియామె యామెం జూచెను. ఆముదుకి పుల్లల నేరికొనుటకై యచ్చటకు వచ్చియుండెను. సూర్యముఖిసమాచారముం దెలిపినవారికి బహుమానము దొరకుననువర్తమానము నాముదుసలి వినియున్న కారణమున నామె సూర్యముఖింజూచి "అమ్మా! నీవెవ్వరు? మా రాణివికావా తల్లీ?" అనియెను.

సూర్య—నేను కానే తల్లీ!

ముదు—ఔనమ్మా! నీవే మారాణివి.

సూర్య—మీరాణి యెవ్వరమ్మా?

ముదు—నగేంద్రబాబుగారి యింటియజమానురాలు.

సూర్య—నాయొద్ద నేమైన మంచిభూషణము లున్నవా? ఇట్టి నేను మీబాబుగారియింటి యజమానురాలి నెట్లగుదును?

ముదు—అది నిజమే.

ముదుకి విశేషించి యెఱుంగని కారణమున వేఱొకయడవికిం బోయెను. ఇట్లే యాపగలంతయు వ్యర్థముగఁ గడచిపోయెను. రాత్రి కూడ నేమియుఁ గార్యసిద్ధి కాలేదు. కాని వెదకుటలో మాత్రము లోపము జరగుట లేదు. వెదకుటకుఁ బోయినవారిలోఁ బురుషులెవ్వరును సూర్యముఖి నెఱుఁగరు. వారు చాలమంది నిరుపేదరాండ్రగు యువతులను నగేంద్రునియొద్దకుఁ దీసికొని వచ్చుచుండిరి. మర్యాదగలయింటియాఁడువాండ్రదోంటిగా స్నానఘట్టములయొద్దఁగాని రాజమార్గములయందుఁగాని, యగపడినచోఁ వారిని పల్లకులలోఁ గూర్చుండఁబెట్టుకొని తీసికొని వచ్చుచుండిరి. ఇదివఱ కెన్నఁడును పల్లకి నెక్కియెఱుంగనివారిదేసమయమని కాసైనఁ గర్చుకాకుండఁ బల్లకులపై నెక్కి కూర్చుండుచుండిరి.

శ్రీశచంద్రునకు గోవిందపురమునఁ జాలదినము లుండుట కవకాశముగ లేదు. అతఁడు కలకత్తానగరమునకుఁ బోయి యట వెదక నారంభించెను.

కమలమణిమాత్రము గోవిందపురముననే యుండి సూర్యముఖి నిగూర్చి వెదకించుచుండెను.

---

# ముప్పదియొకటవ ప్రకరణము

కుందనందిని యేసుఖమునకై యాశపడుచుండెనో యాసుఖమును పొందఁగలుగుదు ననునాశయామెకు వదలిపోయినను తుదకామె యాసుఖమునే పొందఁగలిగెను. ఆమె యిప్పుడు నగేంద్రునకు భార్యయైనది. వివాహమైనదినమునఁ గుందనందిని తనమనసులో "ఈసుఖమునకుఁ బారము లేదు. దీనికి మితిలేదు." అని యనుకొనియెను. అప్పుడామెకు హృదయపరితాపమంకలుగ "అనాధనగునన్ను సూర్యముఖి కాపాడి రక్షించినది—ఆమెరక్షింపకపోయినచో నేమగుదును?—ఇప్పుడామె నాకొఱకిల్లు విడిచి పోయినది. నేను సుఖవతిని గాక చచ్చిపోయిననే బాగుగ నుండును." అనియనుకొనియెను. అప్పుడు "సుఖమునకు మితి యున్నది" అని తెలిసికొనియెను.

ప్రదోషసమయమున నగేంద్రుఁడు శయ్యపై బరుండి యుండెను. కుందనందిని యాతనితలయొద్దఁ గూరుచుండి విసనకఱ్ఱతోఁ విసరుచుండెను. ఇరువురును మౌనభావముతోనుండిరి—అది సుఖలక్షణముకాదు. అచ్చట నితరులెవ్వరును లేరు. అయినను వారిద్దఱును మౌనముతో నుండిరి. సంపూర్ణసుఖమున్నయెడల వారట్లుండఁజాలరు.

సూర్యముఖి వెడలిపోయినదిమొదలుగ వారి కాసంపూర్ణసుఖము వదలిపోయెను. కుందనందిని నిరంతరము తనమనసునందు "నేనేమిచేసినచో నెప్పటివలె నుండును?" అని యనుకొనుచుండెను. ఇప్పుడామాటలు తమంతటతామే నోటినుండి వెలువడియెను.

నగేంద్రుఁ డించుక విసిగికొని "ఎట్లున్నది? ఎట్లుకావలయును? నన్నుఁ బెండ్లి చేసికొంటి నని నీకనుతాపము కలుగుచున్నదా?" అని యడిగెను. ఆమాటలవలనఁ గుందనందినికి మనోవ్యధ కలిగెను. అప్పుడామె "మిమ్ము చేపట్టి సుఖపడుదు ననునాశ నాకు లేదు. నేనిట్లు

చెప్పుటయు లేదు నేను "ఏమిచేసినచో సూర్యముఖి మరలవచ్చును" అనునుద్దేశముతో నట్లంటిని." అనియెను.

నగేం—ఆమాట నీనోటితోఁ బలుకవలదు. నీనోటినుండి సూర్యముఖిపేరు వినవచ్చినచో నాకు మిగుల మనోవ్యధగా నుండును—నీమూలముననే సూర్యముఖి నన్నుఁ ద్యజించి వెడలిపోయినది.

ఆసంగతి కుందనందినియే యెఱుంగును. కాని యామాట నగేంద్రుఁ డనుటవలన నామెకుఁ జాల విచారము కలిగెను. అప్పు డామెతనలో "ఇదియేమి? తిరస్కారమా? నేను మందభాగ్యురాలను. కాని నేనెట్టిదోషమును చేసినదానను గాను. సూర్యముఖియే యీపెండ్లిచేసినది." అని యనుకొనియెను. ఆమె యేమియును మాటలాడక యల్లే విసరుచుండెను. కుందనందిని చాలసేపు మౌనమై యుండుటను చూచి నగేంద్రుఁడు "మాటలాడవేమి? కోపమా?" అనియెను.

కుంద—లేదు.

నగేం—"లేదు." అని చెప్పి మఱల నూరకుంటివేమి? నీకు నాయందు విశ్వాసము లేదా?

కుంద—ఏల విశ్వాసము లేకుండ నుండును ?

నగేం—ఉన్నది, లేదు, అని చెప్పుట పిల్లలను మఱపించు మాటలవంటివి. కుందనందినీ! నీవు నన్నెప్పుడును ప్రేమించుటయే లేదని తోఁచుచున్నది.

కుంద—మనసారఁ బ్రేమించుచుంటిని.

నగేంద్రున కాసంగతి తెలిపినను దాని నాతఁడు తెలిసికొనలేదు. కుందనందినియు సూర్యముఖికంటెఁ దక్కువగాఁ బ్రేమించుట లేదు. ఆమె ముగ్ధ. భీరుస్వభావము కలది. సరియైనమాటలనే యెఱుంగదు. నగేంద్రునిమాటల కేమనగలదు? కాని నగేంద్రుఁ

డట్లు తలంపఁజాలక "సూర్యముఖియే నన్ను మనసారఁ బ్రేమించుచున్నది. వానరకంఠమునకు హారము వేయవచ్చునా?— దానికినుపగొలుసే తగినది" అనియెను.

ఆమాఁట విని కుందనందిని దుఃఖము నాఁపికొనఁజాలక పోయెను. మెల్లమెల్లగ లేచి వెలుపలకుఁబోయెను. ఆమెతోఁగూడ నేడ్చువారెవ్వరును లేరు. కమలమణి వచ్చినది మొదలుగ నామెయొద్దకుఁ బోవుటలేదు. కుందనందిని యీవివాహమునకుఁ దానే ముఖ్యాపరాధిని నని తలంచి సిగ్గుచే కమలమణికి మొగము చూపింపజాలక యామెయొద్దకుఁ బోవుట మానుకొనియెను. కుందనందిని తనప్రయాణమునందు నైరాస్యమును చూపినదినమున కమలమణి యామె దుఃఖమునకు దుఃఖించి కన్నీరు తుడుచుటను జ్ఞప్తికిఁ దెచ్చికొని కుందనందిని కమల యొద్దకుఁ బోయెను. కమలమణి కుందను చూచి యప్రసన్నవదనయై యామె వచ్చుటను చూచి యాశ్చర్యపడి యేమియు మాటాడ కూరకుండెను. కుంద యామెవద్దకుబోయి సమీపమునఁ గూరుచుండి యేడువ నారంభించెను. కమలమణి మాటలాడ లేదు. అందువలనఁ గుందనందిని తనంతట తానే యూరకుండెను. కమలమణి యేదోపనియున్నదని చెప్పి లేచి బయలుదేరిపోయెను.

కుందనందిని "అంతసుఖమునకు నంతమున్నది!" అని తెలిసికొనియెను.

---

## ముప్పదిరెండవ ప్రకరణము

### విషవృక్షఫలము

నగేంద్రుఁడు హరదేవఘోసాలునకొకయుత్తరము వ్రాసెను. అందిట్లున్నది—ఇదివఱకు నేనుచేసిన పనులలోకెల్లఁ గుందనందినిని

పెండ్లిచేసికొనుటయే మిగులభ్రాంతిమూలకమైనపని' యని వ్రాయుచున్నాఁడను. అది సత్యమే యని నామనఃపూర్వకముగ నంగీకరించెదను. నేనట్టికార్యమును చేసి సూర్యముఖిని పోఁగొట్టుకొంటిని. సూర్యముఖ వంటిభార్యను బడయుట కెంతయో యదృష్టము కావలయును. గనులయం దందఱును వెదకి రత్నములకొఱకు ప్రయత్నింతురు. కాని 'కొహీనూరు' అనురత్న మొక్క యదృష్టవంతునకుమాత్రమే లభియించునుగాని మఱియందఱకునది లభియింపఁదగినది కాదు. సూర్యముఖియే యాకోహినూరురత్నము. కుందనందిని యేగుణవిశేషము వలన నాయెస్థానమును పూర్ణముగా నలంకరింపఁగలదు?

అట్లుండఁగాఁ గుందనందినిని నేనేల యాయెస్థానమునం దుంచితిని? భ్రాంతి—అది కేవలము భ్రాంతియే! ఇప్పటికిఁ గన్నులఁ దెరచితిని. కుంభకర్ణునకు నిద్రాభంగమగుట యాతని మరణముకొఱకే—నాకును మరణముకొఱకే యామోహనిద్రనుండి మెలకువకలిగినది. ఇప్పుడు మరల సూర్యముఖి నెట్లు పడయఁగలుగుదును?

నేను కుందనందిని నేల పెండ్లియాడితిని? నేనామెను ప్రేమించుచుంటినా? ప్రేమించి యుంటిని—ఆమెకొఱ కున్మత్తుఁడనై పోయితిని—అందువలన నాప్రాణము మీఁదికే వచ్చుచున్నది. ఇప్పుడు బాగుగ నాలోచించి చూడఁగా నదియంతయును పైపైచూపులవలన మాత్రము కలిగినప్రీతివిశ్వాస మనియే తోఁచుచున్నది. అట్లే కానియెడల వివాహమై యిప్పటికిఁ బదునేనుదినములైనఁ గాలేదు. ఇంతలోపలనే యామెను ప్రేమించితి నెందులకు? ప్రేమించుచుంటి నెందులకు? అని యీవిధముగా యోచించుకొనుచుంటిని. కాని నాప్రాణేశ్వరి యగుసూర్యముఖి యెక్కడకుఁ బోయినదో? ఆమె యెట్లు దొరకఁగలదు? ఎంతయో వ్రాయవలయు నని యనుకొంటిని. కాని యిప్పుడిఁక వ్రాయఁజాలను. చాలకష్టముగాఁ దోఁచుచున్నది' అని.

హారదేవ ఘోషాలుని ప్రత్యుత్తరము.

నాకిప్పు డంతయును దెలిసిపోయినది. నీవు కుందనందినిని ప్రేమింపకుండుట లేదు. ఇప్పటికిని ప్రేమించుచునే యున్నావు. కాని యది పైపైచూపులవలనం గలిగిన ప్రేమ యని నీవు వ్రాసినమాట నిజము. కాని నీకు సూర్యముఖియం దున్న ప్రేమము ప్రగాఢమైనది —కేవలము రెండుదినములవఱకుమాత్రము కుందనందిఛాయ వలన నా ప్రగాఢస్నేహము మరుగుపడి పోయినది. సూర్యముఖిని పోగొట్టు కొన్నతరువాత నా ప్రేమను మరల నీహృదయమునం దొక్కసారిగా విజృంభించినది. సూర్యదేవుఁ డాకాశమున మేఘములచేఁ గప్పఁబడ కున్నంతవఱకు మన మాతనికిరణములచే సంతప్తులమయ్యెదము. అట్టిసమయమున మనము మేఘమే చాల మంచిదని యెంచి దానినే కోరుకొనుచుందుము. కాని యాసూర్యుఁ డస్తంగతుఁడై పోయినప్పుడుమాత్రము సూర్యదేవుఁడే సర్వజగత్తునకును చక్షుస్వరూపుఁ డని తప్పక మనకు బోధపడును? సూర్యదేవుఁడు లేక పోయినచో జగమంతయు నంధకారమయమే.

నీవు నీహృదయమును దెలిసికొనఁజాలక యంతటి గురుతర భ్రాంతిమూలకం బగు కార్యమును చేసియుంటివి. కావున నేను నిన్ని విషయమున నంతగాఁ దిరస్కరింపఁజాలను. ఏమనిన—నీకాసమయమునం గలిగినభ్రమ తనంతటఁ దానే వదలిపోవుట యసంభవము. మనోభావము లనేకము లుండును. జను లాభావముల కన్నిటికిని ప్రేమ యనియుఁ బ్రణయమనియుఁ జెప్పుచుందురు. కాని మనసు యొక్క యేయవస్థయందు, మఱియు నేభావమునందు మన మన్యుల సుఖముకొఱకు స్వసుఖమును తృణప్రాయముగ విసర్జించుటకు మన యంతన మనమే సంసిద్ధులమై యుందుమో, యా మానసికావస్థ యట్టి భావముమాత్రమే యథార్థప్రేమమని చెప్పవచ్చును. 'మన

యంతన మనమే సంసిద్ధుల మయ్యెదమో' అని పైని వ్రాసినదాని కర్థ మేమనిన—ధర్మజ్ఞానముచేఁగాని, కాదేని, పుణ్యాపేక్షచేఁ గాని యట్లు విసర్జించుటకు సిద్ధపడినచో నది యథార్థప్రేమము కాఁజాలదు—యథార్థప్రేమమునం దెట్టికోరికయు నుండఁగూడదు. ఆ మనోభావము తనకుఁ దానే కలుగవలయును. ఇతరుల సుఖముకొఱకు స్వసుఖమును వదలుకొనుటకుఁ బ్రతీకారాపేక్ష లేకుండఁ దనకుఁ దానే యది స్థిరపడి యున్నచో నట్టి మానసికావస్థయే ప్రేమయని చెప్పవలయును. అందువలన సుందరియగు యువతీమణియొక్క మోహనాకారముఁ జూచి దాని ననుభవింపవలయునను నుద్దేశమువలనం గలిగినయాసక్తి అనఁగా నట్టియాశ ప్రేమయని గణించుటకు వలనుపడదు. ఆఁకలిచేఁ దపియింపఁబడుచున్న యాతనికిఁ భోజనముపైఁ గలిగినయాత్రము 'ప్రీతి' యని యెట్లు చెప్పఁగూడదో యట్లే కామాతురుఁడగు నాతనికిఁ జిత్తచాంచల్యమువలన రూపవతిపైఁ గలిగిన మోహముకూడఁ 'బ్రీతి' యని చెప్పుటకు వలనుపడదు. అట్టి చిత్తచాంచల్యమును గూర్చి మన యార్యకవులు మదనబాణజన్యం బగు నొకానొక వికారమని వర్ణించియున్నారు. మానసికవృత్తులచేఁ గల్పింపఁబడిన యేయవతారము వసంతసాహాయ్యమున మహాదేవుని తపోభంగము చేయుటకుఁ బోయియుండెనో, యేయవతారముయొక్క పరమానుగ్రహమువలనఁ గావ్యములందుఁ గవులచే 'కురంగము కురంగిమనోహరాంగకముల గోకుచున్నట్లును, కరి, కరిణికి మృదుమృణాలములఁ దెచ్చి యిచ్చుచున్నట్లును వర్ణింపఁబడియుండెనో యవియన్నియును పైని చెప్పినరీతిని రూపజన్యమోహమాత్రములే యైయున్నవి. ఆప్రవృత్తి పరమేశ్వర ప్రేరితమైనదియే. అట్టిదానివలనఁ గూడ నీప్రపంచమునం దనేక ఫలసాధనములు కలవు. అది సర్వప్రాణులనుగూడ ముగ్ధులగాఁ జేసివైచును. కాళిదాసుఁడు, జయదేవుఁడు, బైరను మొదలగువా

రట్టి కావ్యములకుఁ గర్తలు. విద్యాసుందరుఁ డనుకవి దానిని వ్యంగ్యముగాఁ జెప్పియున్నాఁడు. కాని యదిమాత్రము యథార్థప్రేమముగాఁ బరిగణింపఁబడదు. ప్రణయము-వలపు-అనునది బుద్ధివృత్తి మూలకమైనది. ప్రణయాస్పదం బగు వ్యక్తియొక్క గుణము లన్నియు నట్టి బుద్ధివృత్తులచేతనే పరిగృహీతములగుచుండును. హృదయ మాగుణగణముల వలననే ముగ్ధమై తుదకు వానిచే నాకర్షింపఁబడి సంచలించును. అప్పుడే యాగుణముల కాధారమై యున్న వ్యక్తితోఁ గలయుట కాశయు, నా వ్యక్తియం దొకవిధమైన భక్తియు నుదయించును. అందులకు ఫలముగా సహృదయత్వముదయించి తుద కాత్మవిస్మృతి కలిగి యన్యుల సుఖముకొఱకు స్వసుఖమును విడువవలయు నను భావ ముదయించును. అదియే యథార్థప్రేమము. వాల్మీకి, షేక్స్పియరు మొదలగువా రట్టి ప్రేమమునుగూర్చి వ్రాసిన కవులు, ఆ ప్రేమము రూపవీక్షణమాత్రమునఁ గలుగునది కాదు. మొట్టమొదట బుద్ధిద్వారమున గుణగ్రహణము; గుణగ్రహణాంతరమున సమాగమకాంక్ష; ఆ సమాగమకాంక్ష సఫలమైనచో సంసర్గము, ఆసంసర్గఫలమే యథార్థమైనప్రేమము. ప్రణయమే యున్నయెడల నాత్మవిసర్జన ముండితీరవలయును. నేనట్టి దానినిమాత్రమే ప్రణయమని చెప్పెదను. భార్యాభర్తలయొక్క ప్రణయ మటువంటి దనియే నాబుద్ధికిఁ దోఁచుచున్నది. అన్యవిధంబగు ప్రణయము యొక్క మూలముకూడ నిట్టిదనియే తోఁచుచున్నది. కావున స్నేహమనునది యేకకారణమువలననే జనియించుట లేదు. కాని యెల్లకారణములును బుద్ధిమూలకము లైనవియే ఒకపక్షమున నాలోచించి చూడఁగా బుద్ధివృత్తిమూలకంబు లగు కారణంబులవలనం గలిగిన ప్రణయమే తక్క మఱియేదియును చిరస్థాయియై యుండదని తోఁచుచున్నది. రూపజన్యంబగుమోహ మట్టిది

కాదు. రూపసందర్శనమువలనం గలిగినచిత్తవికారము లన్నియును మొట్టమొదటఁ దేజోవంతములై యుండినను క్రమక్రమముగా వాని తీక్ష్ణత తగ్గిపోవుచుండును, అనఁగాఁ గ్రమక్రమముగా వానికిఁ బరితృప్తి కలుగుచుండును, గుణజన్యంబగు ప్రేమమునకుఁ బరితృప్తియే లేదు. ఏమనిన—రూప మొక్కటియే—అది నిత్య మొక్కరీతినే వికసించుచుండును. గుణమో?—అది దినదినమును క్రొత్తక్రొత్త విషయంబులఁ గ్రొత్తక్రొత్తరీతులచే విరాజిల్లుచుండును. ప్రణయ మనునది రూపసందర్శనమువలనను కలుగును. గుణానుభవంబునను కలుగును. ఏమనిన—ఆరెంటివలననుగూడ సంసర్గాభిలాషముదయించును—రూపమును, గుణమునుకూడ నొక్కచోటనే చేరియుండినచోఁ బ్రణయ మతిశీఘ్రముగ నుదయించును. కాని, సంసర్గఫలంబగు ప్రణయ మొక్కసారి బద్ధమూలమైనచో ననఁగా నేరు నాటుకొనినచో రూపముండిన నుండవచ్చును; లేకున్న లేకపోవచ్చును ఒకరూపవంతుఁడు కురూపిణియందుఁగూడ స్నేహమయుఁడై యుండుటయే యందులకుఁ దగిన యుదాహరణమైయున్నది.

గుణజన్యంబగు ప్రణయమే చిరకాలస్థాయి యైనది. అందులకెంతమాత్రమును సందేహములేదు. కాని గుణమునుగూర్చి తెలిసికొనవలసినచోఁ గొంతకాలము కావలసి యుండును. కావున గుణజన్యంబగు ప్రణయ మొక్కసారిగ నాకస్మికముగ బలపడనేరదు. క్రమముగా వృద్ధిచెందుచుండును. కాని రూపజన్యంబగు మోహ మొక్కసారిగా సంపూర్ణబలకలితమై బయలుదేరును. కాని గుణజన్యం బగుప్రణయశక్తి యతిదుర్దమనీయమై మిగిలిన యెల్లమనోవృత్తులను మూలసహితముగఁ బెల్లగించి వైచును. అది "సామాన్యమైన మోహమా? చిరస్థాయియగు ప్రణయమా?" యనువిషయముంగూర్చి తెలిసికొనుటకు శక్తియే యుండదు. ప్రణయ మను

నది చిరకాలస్థాయి యైనదని చెప్పవచ్చును. నీవుకూడ నట్లే గ్రహించి యుంటివి—రూపజన్యంబగు మోహప్రభావమువలన సూర్యముఖియందు నీకుఁ గలచిరస్థాయియగు ప్రణయము నీకన్నుల కదృశ్యమైపోయినది. అది నీకు భ్రాంతిమూలమునం గలిగినది—భ్రాంతియనునది మనుజునకు స్వభావసిద్ధమైనది. కావున నిన్ను నేనీ విషయమునఁ దిరస్కరింపఁజాలను—కాని నీకించుక యుపదేశించెదను. అందుమూలమున సుఖవంతుఁడ వగుటకై ప్రయత్నించుకొనుము.

నీవు హతాశుఁడవు కావలదు. సూర్యముఖి తప్పకుండ వెనుకకుఁ దిరిగి రాఁగలదు—ఆమె చాలదినములు నిన్నుఁ జూడకుండనుండఁజాలదు. ఎన్నినాళ్ళవఱకు నామె వెనుదిరిగి రాకయుండునో యన్ని నాళ్లవఱకును నీవు కుందనందినియెడలఁ బ్రేమమును చూపుచుండుము నీయుత్తరమునుబట్టి చూడఁగా నామెయును గుణహీనురాలు కాదని తెలియవచ్చుచున్నది. రూపజన్యం బగుమోహముదూరమైనతోడనే స్థాయియైనప్రణయము ప్రకాశింపఁగలదు. కావున నామెవలననె నీవు సుఖివి కావచ్చును. నీజ్యేష్ఠభార్య దొరకకపోయినచో నామెను క్రమముగ మఱచినను మఱవవచ్చును. కుందనందియు నిన్ను విశేషముగఁ బ్రేమించుచున్నది. ఏమనిన—మనుష్యునకుఁ బ్రీతి వలననే నిర్మలంబును నవశ్వరంబును నగుసుఖము లభియించుచున్నది. ప్రీతియే మానవజాత్యున్నతికి ముఖ్యోపాయము—మనుజులు పరస్పర ప్రీతి కలవారే యైనచోఁ బ్రపంచమునం దనర్థములు కలుగుటకుఁ గారణమే యుండదు.''

నగేంద్రుని ప్రత్యుత్తరము.

''నీయుత్తర మందినది. మానసికక్లేశముచే నింతవఱకును బ్రత్యుత్తరము వ్రాయఁజాలకపోయితిని. నీవు వ్రాసినసంగతు లన్ని

యును బోధపడినవి. నీయుపదేశము పరమోత్తమంబగు నుపదేశమని గ్రహియించితిమి. కాని నేనింటనుండి నామనసును సిద్ధపఱచుకొనఁజాలను. నాసూర్యముఖి నన్ను విడిచి పోయి యొక నెలదినము లైనది. ఆమెసమాచార మేమియుఁ దెలియుటయే లేదు. ఆమె యేత్రోవను పోయినదో నేను నాత్రోవనే పోవలయునని యుంటిని. నేను గృహము త్యజించిపై చెదను. ఆమెను వెదకుచు దేశదేశములను దిరుగుచుండెదను. దొరకినచో నామెను వెంటఁ బెట్టుకొని యింటికి వచ్చెదను. దొరకనిచో నిఁక నా కింటియాశ లేదు. కుందనందినితో సంసారము చేయుచు నింటియందుండఁజాలను. ఆమె నాకంటికి శూలమువలె నగపడుచున్నది. పాప మామెదోష మేమియును లేదు. దోషమంతయును నాదియే—కాని నేనామె మొగముఁ జూచి సహింపఁజాలను. మొట్టమొదట నేనామె నేమియు ననుట లేదు—ఇప్పుడు నిత్యము నామెనుజూచివిసిఁగికొనుచున్నాడను—ఆమెయేడ్చుచుండెను.—నేనేమిచేయుదును ? నేనిల్లువిడిచి పోవుచున్నాఁడను. త్వరలోనే వచ్చి నిన్నుఁ జూడఁగలను. నిన్నుఁ జూచినతరువాతనే మఱియొకచోటికిఁ బోయెదను.''

నగేంద్రుఁ డుత్తరమున వ్రాసినయట్లే చేసెను. రాజ్యాంగవిచారణమంతయుమంత్రికొప్పగించియిల్లువిడిచి దేశాంతరముపోయెను. కమలమణి యంతకుఁ బూర్వమే కలకత్తాకుఁ బోయెను. అందువలన నీగ్రంథమునందుఁ బేర్కొన్నవారిలోఁ గుందనందిని యొక్కతె మాత్రమే నగేంద్రునియింట నిలిచియుండెను. హీరాదాసి యామె యుపచారముల కేర్పడి యుండెను.

నగేంద్రునిమందిరమంతయు నంధకారమయమయ్యెను. బహుదీపసముజ్జ్వలమై, బహుజనసమాకీర్ణమై మనోహరసంగీతస్వరప్రపూర్ణమై యుండు నాట్యశాల నాటకానంతరమున నంధకారమయమై

జనశూన్యంబగువిధంబున నుండెను. బాలకులు చిత్రప్రతిమల నుంచు కొని యొకనాఁ డాడితరువాత వానినివిరిచి పారవేసినప్పు డవి మంటి లోఁగలసిపోవ వానిపైఁ బచ్చికమొలచినవిధంబునఁ గుందనందిని చెడి పోయిన చిత్రప్రతిమవలె నగేంద్రపరిత్యక్తయై విశాలాంతఃపురమధ్యం బునఁ నిరాధారురాలై పడియుండెను. దావానలము ప్రజ్వరిల్లి యరణ్యమునుదరికొని కాల్చునప్పుడుకులాయసహితంబుగమహీరుహ ములు కాలిపోయినతరువాతఁ బిల్లలకాహారమునకై పోయినతల్లిపక్షి వచ్చి తనకులాయమగపడకుండుటచే నాదగ్ధారణ్యముచుట్టు నాకాశ మార్గమున మంటలాకారముగఁ దిరుగాడుచుండునట్లే నగేంద్రుఁడు సూర్యముఖిని వెదకుచు దేశదేశములఁ దిరుగుచుండెను. అనంత మగు మహాసముద్రము నందలి యగాధసలిలాంతరాళమునం బడి ము నిఁగి కన్నుల కగోచరమైపోయిన చింతామణివలెనే సాధ్వీమణియగు సూర్యముఖి దుష్ప్రాపణీయయై కన్నుల కగపడకుండఁ బోయెను.

---

## ముప్పదిమూఁడవ ప్రకరణము.

### ప్రణయచిహ్నము.

నూలుబట్టమడతయం దగ్నిస్ఫులింగము పడినపోలిక సమవిర హితంబగు దేవేంద్రుని మోహనాకారము హీరాదాసి యంతఃకరణ మునంబడి పొరపొరయును గాల్చివేయుచుండెను. హీరకు గలధర్మభీ తియు, లజ్జయు ననేక పర్యాయములా ప్రణయ ప్రవాహమునం బడి తేలిపోవుట కారంభించెను. కాని ప్రణయవిహీనంబును, విషయాస క్తంబుననగు దేవేంద్రుని చరిత్ర మామెకు స్మృతికిఁ దోఁచినతోడనే యామెధర్మభీతియు, లజ్జయు నెప్పటియట్లు నిలువబడుచుండెను.

హీర చిత్తమును స్వాధీనపరచుకొనుటయం దసాధారణ సామర్థ్యము కలది. అంతవిశేషముగ నామెకుధర్మభీతి లేకపోయినను దనకుఁగల శక్తివలన స్వధర్మంబగు సతీత్వమును సంరక్షించుకొనుట కామె సమర్థురాలై యుండెను. ఆశక్తి ప్రభావము వలననే దేవేంద్రుని యెడలఁ దానుచూపు చుండుననురాగ మపాత్రునియెడ నుపయోగిం చినట్లయినదని గ్రహియించి దాని నెట్లైన శాంతింపఁజేసికొను చుండెను. చిత్తమును స్వస్థపఱుచు కొనుటకు దాసివృత్తియే పర మోపాయమని తలంచి మరల నామె తనపనిలోఁ బ్రవేశింపవలయు నని నిశ్చయించు కొనియెను. సర్వదా పరులయింటిపనుల నిర్వ హించుటయం దాశక్తయైయున్నచో మనస్సున కితర ప్రకృతికలు గును కావున నిష్ఫలంబగు నయ్యనురాగ వృశ్చికదంశన స్వరూ పంబైన యనలజ్వాలను మఱచి పోవచ్చును. ఆమెయుద్దేశమున ననుకూలముగా నగేంద్రుఁడు గోవింద పురము విడిచి దేశాం తరముపోవునప్పుడు హీరాదాసి యాతనియొద్దకుఁ బోయి మునుపటి వలెనే తాను పరిచారికగా నుండెద నని మనవిచేసికొనియెను. అప్పు డాతఁడు కుందనందిని యభిప్రాయమును దీసికొని హీర నామెకుప చారములు చేయుచుండుటకు దాసిగా నియమించెను.

హీర—మరలఁ దాసీత్వము నంగీకరించుట కిందొక కారణము కలదు. పూర్వము ద్రవ్యమునందలియాశచేఁ గుందనందిని నగేంద్రు నకుఁ బ్రియతమురాలు కాగలదని తలంచి హీర యామెను ముందు గనే వశపఱచుకొనుటకుఁ బ్రయత్నించుటయే కాక నగేంద్రునిద్రవ్య మింతయును కుందనందినిచేతికి దొరకు ననియు, కుందచేతికి దొరకుట తనకు దొరకుటయే యనియు భావించుకొనియెను. ఆమెయూహించిన విధమునఁ గుందనందిని నగేంద్రునకు గృహిణియైనది. కాని ధనవిష యమున మాత్రమామెను విశేషాధికారము కలుగలేదు. కాని హీర

కిప్పుడు ద్రవ్యమునం దంతయాశయును లేదు. ఆమె యాయోచననే వదలు కొనియెను. కుందవలన నేమియును దొరకుట లేదు. ఒకవేళ దొరకినను దానినామె విషమువలెఁ జూచుచుండెను.

హీరాదాసి నిష్ఫలమైపోయినతన ప్రేమమువలనం గలిగినపరితాపము నెట్లులైన సహింపఁగలిగిన దయ్యెను, కుందనందినిపై దేవేంద్రునకుఁ గలిగినయనురాగము జూచి సహింపఁజాలనిదై యుండెను. నగేంద్రుఁడు కుందనందిని నింటియందుంచి దేశాంతరము పోవునని వినినప్పుడు హరిదాసివైష్ణవిసంగతి జ్ఞప్తికి వచ్చుటచే హీరకు మిగుల భయము కలిగెను. ఆమె హరిదాసివైష్ణవి వచ్చుచు బోవుచుండు మార్గమునకడ్డముగఁ గంచెలువేయుటకును కుందనందినికిఁ గావలియుండుటకును మరల దాసీత్వమునఁ బ్రవేశించెను.

హీర కుందనందిని క్షేమమును గోరి యట్లు యోచింప లేదు- ఈర్ష్యాపరవశయై కుందనందినిని పాడుచేయవలయు ననియే యట్టిప్రవృత్తి కలదయ్యెను. నగేంద్రునిభార్యయగు కుందనందినిని దేవేంద్రుఁడు చూచినచో బలవంతముగ వశపఱచుకొను ననుభయముచే నామెను కాచికొని యుండెను.

హీరయే కుందనందినిపరితాపమునకుఁ గారణురా లయ్యెను. కుందనందినియుఁ గ్రమక్రమముగ నాలోచించుకొనఁగా హీరకు మొదటివలెఁ దనపైఁ బ్రేమయున్నట్లు తోఁచుట లేదు. ఆమెదాసియై వచ్చినది మొదలుగఁ దనపై శ్రద్ధ యెంతమాత్రమును చూపక తిరస్కరించి యవమానపఱచుచున్నట్లు కుందగ్రహించెను. కుందనందిని యతిశాంతస్వభావురాలు. హీరదురాచరణముచేఁ బీడితయయ్యెను. ఆమె నేమియు ననుట లేదు. కుందనందిని శీతలప్రకృతి కలది. హీర యుగ్ర ప్రకృతి కలది. కుందనందని ప్రభుపత్నియయ్యెను. నామె తనదాసియొద్ద దాసియైయుండెను. హీ-

దాసియో? రాణికి రాణియై యుండెను. ఇంటియందున్న యితర పరిచారికలు కుందనందినికష్టమును చూచి సహింపఁజాలక హీరను గదముచుండిరి. కాని హీరనోటిముందర నెవ్వరును నిలువఁజాలక పోవుచుండిరి. దివాను సంగతుల నన్నిటిని తెలిసికొని హీరాదాసిని పిలిపించి "నీవీయిల్లు విడిచి పొమ్ము. నిన్నుఁ బనిలోనుండి తగ్గించితిని." అని చెప్పెను. అందుల కామె కన్నులెఱ్ఱజేసికొని 'పనినుండి తప్పించుటకు నీవెవ్వరు? ప్రభువువారు నాకీపని నొసంగియున్నారు. మరల ప్రభువువారు పొమ్మనినఁదక్క నేను విడిచి పోవుదానఁగాను. నన్నుఁబొమ్మని చెప్పుటకు నీకెంతయధికార మున్నదియో నిన్నుఁబొమ్మనుటకు నాకు నంతయధికారమే యున్నది,' అని ప్రత్యుత్తర మిచ్చెను. ఆమాటలు విని యసమానభయంబున మంత్రి విశేషించి మాటలాడలేదు. హీర తననోటిపొగరువలననే పనిలో నిలిచి యుండెను. హీరను లొంగఁదీయుట సూర్యముఖికిఁదక్క నితరుల కెవ్వరికిని సాధ్యము కాదు.

ఒకదినమున హీర యంతఃపురమునొద్దనున్న పుష్పోద్యానము నందలి లతామండపమున నొక్కతెయుఁ బరుండి యుండెను. రాజును, రాణియు, మందిరమును వదలిపోయినది మొదలుగ నాలతామండపమునకు హీరయే యధికారిణి యైయుండెను. అప్పటికి సాయంకాలము దాఁటినది. ఆకాశమునఁ బూర్ణచంద్రుఁడు ప్రకాశించుచుండెను. ఆయుద్యానవనంబునఁ బ్రకాశమానంబుల్గగు తరుపత్రములలో నాచంద్రకిరణమాలికలు ప్రతిఫలించుచుండెను. లతాపల్లవముల సందులనుండి చంద్రకిరణములు దూరివచ్చి క్రిందిశ్వేతశిలాకుట్టిమంబునఁ బడి సమీపమునందలి పుష్కరిణిలో బ్రదోషసమయశీతలమారుతసంచాలనంబునఁ జలియించియున్న నిర్మలజలతరంగములపై నాట్యము చేయుచుండెను. ఉద్యానవనపుష్పసుగంధముచే

నాకాశమండల మున్మాదకరమై యుండెను. ప్రకృతియందలి మఱి యేయితర పదార్థము నంతమనోహరముగ లేదు. ఆసమయమునహీర యాకస్మికముగ నాలతామండపమున నొకపురుషమూర్తిం గాంచెను. ఆమూర్తి దేవేంద్రుఁడై యుండెను. ఆతఁ డప్పుడు మారువేషమును ధరించి యుండలేదు పూర్వరూపముతోడనే వచ్చి యుండెను.

హీరాదాసి విస్మితయై "మీకార్యము మిగుల దుస్సాహస మైనది. మఱియెవ్వరిచేనైనఁ జూడఁబడియుండినచో దెబ్బలను తిని యుందురు." అనియెను.

దేవేంద్రుఁడు "హీరయుండఁగా నాకేమిభయము?" అని పలుకుచు నామెపార్శ్వమునఁ గూరుచుండెను.

హీర చరితార్థయయ్యెను. కొంతసేపైన తరువాత నామె "నీవిక్కడ కెందులకు వచ్చితివి? నీవెవ్వరిని చూడవలయునని వచ్చి యుంటివో యామెను చూడఁజాలవు" అనియెను.

దేవేంద్రుఁడు "చూచితిని. నీకొఱకే వచ్చియుంటిని." అని యెను. హీర యాకపటవాక్యములవలన మోసపోక నవ్వుచు "నా యదృష్టము సరిపడినది కాదు. అదియెట్లున్న నుండనిమ్ము. నాయ దృష్టము సుముఖమైనచో మిమ్ములను నిష్కంటకముగఁ గన్నారఁ జూచి నామనసును తృప్తిపఱచుకొందును. మన మేకాంతస్థలమునకు బోవుదము. ఇక్కడ కొందఱెవ్వరైన రాఁగలరు." అనియెను.

దేవేం—ఎక్కడకుఁ బోవుదము?

హీర—నిర్భయమైన స్థలమునకు—మీనికుంజ వనమునకుఁ బోవుదము.

దేవేం—నాకొఱకు నీవు భయపడనక్కఱలేదు.

హీరా—నీకొఱకు భయపడవలసినపని లేకపోయినను నా కొఱకైన భయపడవలయును. నీప్రక్కను కూరుచుండియున్న నన్నెవరైనఁ జూచినచో నప్పుడు నాగతి యేమికావలసి యుండును?

దేవేంద్రుఁడు సందేహముతో "అట్లయినచో నడువుము! మీయింటి క్రొత్తరాణితో నొక్కసారి మాటలాడి పోఁగూడదా?" అనియెను.

హీర యామాటవిని దేవేంద్రునిపై నీర్ష్యానలకషాయితంబు లగుకటాక్షవీక్షణములఁ బ్రసరింపఁజేసెను. దేవేంద్రుఁ డాకటాక్షము లను గ్రుడ్డివెన్నెలలోఁ జూడలేకపోయెను.

హీర—ఆమెను చూచుట యెట్లు?

దేవేంద్రుఁడు వినయముతో 'నీవు దయ చూపినచో నన్ని కార్యములును సిద్ధింపఁగలవు' అనియెను.

హీర—నీవిచ్చటనే జాగరూకుఁడవై యుండుము. నేనామె నిచ్చటికిఁ దీసికొనివచ్చెదను.

ఇట్లు చెప్పి హీర లతామండపమునుండి వెడలిపోయెను. ఆమె యట్లు కొంతదూరము పోయి యొక చెట్టుచాటున నిలువఁబడియెను. అట నామె కంఠము రుద్ధమై కన్నుల నశ్రుజలంబులు పొంగిపొరల నారంభించెను. తరువాత నటనుండి బయలుదేరి మందిరము లోనికిఁ బోయెను. కాని కుందనందిని యొద్దకుఁ బోలేదు. ద్వారమునొద్దకుఁ బోయి ద్వారపాలకులతో 'మీరు వేగముగ రండు! పూవులతోఁట లోని దొంగ వచ్చియున్నాఁడు' అని చెప్పెను.

అప్పుడు నలువురు ద్వారపాలకులు వెదురుకఱ్ఱలం దీసికొని యంతఃపురము లోపలినుండి పూవులతోఁటలోనికిఁ బరుగుపరుగునఁ బోయిరి. దేవేంద్రుఁడు దూరమునుండియే వారిని చూచి లతా మండపమునుండి క్రిందికి దుమికి యతివేగముగఁ బారిపో నారం భించెను. ద్వారపాలకు లాతని వెంబడించిపోయిరి. దేవేంద్రుఁడు చేతికి దొరకినను వారాతనిఁ బట్టుకొనలేదు. కాని దేవేంద్రుఁడు మాత్రము బహుమానము నందుకొనకుండఁ బోలేదు. వలమై కఠినం

బగు వెదురుకఱ్ఱరుచి యాతనికి బోధపడినదో లేదో మాకుఁ దెలియదు. కాని ద్వారపాలకులు 'బానిసకొడుకా!' అని కేకలువైచుచు సంభాషించుకొనుట మా చెవులఁ బడియెను. అంతియేకాక దేవేంద్రుని పరిచారకుఁ డొకఁడు వానియింట మద్యమును ద్రావి మఱునాఁడు తన యుపపత్నితో మాటలాడుచున్నప్పుడు 'ఇప్పుడు మాప్రభువు వారికిఁ దలయంటుచుండఁగా నాతని వెన్నుపై నల్లగాఁ గములియున్న దెబ్బ యొకటి యగపడినది' అని చెప్పుచుండుటను వింటిమి.

దేవేంద్రుఁ డింటికిఁ బోయి రెండు విషయములను గూర్చి నిశ్చయించుకొనియెను. మొదటిది—హీర యున్నంతవఱకుఁ దాను నగేంద్రుని యింటికిఁ బోకుండ నుండుట. రెండవది—హీరకుఁ దగిన ప్రతీకారము చేయుట. ఈ విషయములం గూర్చి స్థిరమైనసంకల్పము కలవాఁడై యుండెను. తుదకాలమున హీరకు సంపూర్ణమైన ప్రతిఫలము నొసంగెను. హీర చేసిన కొలఁదిపాపమునకు గొప్పశిక్షయే యయ్యెను. హీర తుదకుఁ బొందినశిక్షను చూచి దేవేంద్రుని రాయివంటి హృదయమే పగిలిపోయెను. దానినిగూర్చి విశేషముగ వర్ణింపవలసిన పని లేదు. తుదకు సంక్షేపముగఁ జెప్పెదము.

---

## ముప్పదినాలుగవ ప్రకరణము

వర్షాకాలము—మిగుల దుర్దినముగా నుండెను—పగలంతయును వర్షమే. ఒక్కసారియైన నాదినమున సూర్యుఁడగపడ లేదు. ఆకాశమంతటను మేఘము లావరించుకొనియుండెను. అప్పుడు కాశికిఁబోవు మార్గమునఁ గ్రొత్తగా మట్టిబాట వేయఁబడి యుండెను. త్రోవయంతయు బురదచే జారుచుండెను. జనులెవ్వరును, దారిని నడుచుటలేదు

ఆవర్షమునఁ దడియుచు నెవ్వరు ప్రయాణముచేయుదురు ? ఒక్కఁడు మాత్ర మప్పుడాదారిని పోవుచుండెను. ఆతని వేషముబట్టి చూడఁగా బ్రహ్మచారియై యుండెను—ఆతఁడు కావివసనములను దాల్చియుండెను. కరమున రుద్రాక్షమాలిక—మొగమునఁ జందనతిలకము—జటాడంబర మేమియును లేదు. మోటుదనముగలకుంతలములుకలవు. అందందుఁ గొన్ని నరసి యుండెను. ఒకచేత నొకఛత్రమును, మఱియొకచేతఁ గమండలమును కలవు—ఆబ్రహ్మచారి యావర్షమునఁ దడియుచు నాత్రోవను బోవుచుండెను. పగలే యంధకారముగా నుండెను. మార్గమధ్యమునందే రాత్రికూడ నయ్యెను. జగమంతయు మషీమయమైనట్లుండెను. త్రోవను మెరకపల్లము లేవియుఁ గపడుట లేదు. అయినను నాపథికుఁడు పోవుచునే యుండెను. ఆతఁడు సంసారము నెఱుఁగని బ్రహ్మచారి—అతనికివానయననేమి ? ఎండయననేమి ? వెలుఁగు, చీఁకటి, సుపథము, దుష్పథము—అన్నియు నొక్కటే.

చాలరాత్రియైనది. భూమి మషీమయమై యుండెను. ఆకాశముఖంబునకుఁ గృష్ణావకుంఠనము వేయఁబడియున్నట్లుండెను. వృక్షశిరోమాలిక లాగాఢాంధకారమున స్తూపాకృతులఁ గానవచ్చుచుండెను. అందందవకాశస్థలంబులఁ దరుపత్రములు రేఖాకృతిం గానవచ్చుచుండెను. చినుకులు పడుచునే యుండెను. ఒక్కొక్కసారి మెఱపు తళతళలాడుచుండెను. ఆవెలుతురువలనఁ జీఁకటిమఱింతయతిశయించుచుండెను. చీఁకటిలో మెఱపులవెలుతురున జగమంతయు నెంతభయంకరముగా నుండునో యంతటిభయము కేవలగాఢాంధకారమునఁగూడ నుండదు.

ఆయంధకారమునఁ బోవుచున్నబ్రహ్మచారి యాకస్మికముగ మార్గమధ్యమున "అమ్మా!" అనుశబ్దమును సూచించు నొకదొడ్డ నిట్టూర్పును వినియెను. ఆశబ్దము విజాతీయమైనదిగా నుండెను.

అయినను మనుష్యకంఠమునుండి వెలువడినట్లే తోఁచెను. ఆశబ్దమతి మృదులమై యతిశయదుఃఖమువలన వెలువడినట్లు బోధ యయ్యెను. అప్పుడాబ్రహ్మచారి మార్గమధ్యమున నిలువఁబడిపోయెను. మఱల మెఱపు మెఱయుటకై కనుపెట్టుకొని యుండెను. ప్రతినిమిషమున నది మెఱయుచునే యుండెను. ఆమెఱపుల వెలుతురునఁ బరీక్షించి చూచెను. త్రోవప్రక్క నేదియోయొకపదార్థము పడియున్నట్లుకాన నయ్యెను. ఎవ్వఁడో మనుష్యుఁడు పడియుండవలయునని తోఁచెను. మఱియొకసారి మెఱసినతరువాత నావ్యక్తి మనుష్యుఁడే యని నిశ్చయముచేసికొని "త్రోవలోఁ బడియున్నవారెవ్వరు?" అని యడిగెను. ప్రత్యుత్తరము రాలేదు. మరల బిగ్గరగా నడిగెను. అస్ఫుటం బగునొకస్వరము వినవయ్యెను. బ్రహ్మచారి ఛత్రకమండలములఁ గ్రిందనుంచి యచ్చటకుఁ బోయి తడవి చూచెను. కొలఁదిదూరము ననే కోమలమైన యొకమనుష్యదేహ మాతనిచేతికి దగిలెను. "నీవెవ్వరు?" అని కేశబంధమునఁ జేయుంచి చూచి "హా! దుర్గా! ఈమెయెవ్వతెయో స్త్రీ!" అని యనుకొనియెను.

పిమ్మట బ్రహ్మచారి ప్రత్యుత్తరము నిరీక్షింపక చేతనశూన్యయైయున్న యాకాంత నెత్తికొనియెను. ఛత్రకమండలము లచ్చటనేపడియుండెను. బ్రహ్మచారి రాజమార్గమును వదలి యడ్డత్రోవనుబట్టి బయలుదేరెను. ఆతని కావనమునందలి ప్రదేశము లన్నియును తెలియును. ఆతఁడంతబలవంతుఁడు కాఁడు. అయినను చచ్చుచున్న యాకాంత నొకచిన్నబిడ్డపోలిక నెత్తికొని కష్టతరంబగు నడ్డత్రోవనుబట్టి పోయెను. పరోపకారియుఁ పరులదుఃఖమునకు దుఃఖించువాఁడును నగునాతఁ డట్టిసమయమునఁ దనశరీరబలాభావమును లెక్క సేయఁడు.

బ్రహ్మచారి యూరుముందరకు వచ్చియొకపర్ణకుటీర ద్వారమునొద్ద నిలువఁబడి 'అమ్మా! హరమణీ! తలుపుతీయుము. అని కేక

వైచెను. లోపలినుండి యొకస్త్రీ 'వినఁబడినది. మీరెప్పుడు దయ చేసితిరి?' అని యడిగెను.

బ్రహ్మ—ఇప్పుడే వచ్చితిని. వేగముగాఁ దలుపు తీయుము. చాలఁ దొందరగానున్నది.

హారమణి వచ్చి తలుపు తీసెను. బ్రహ్మచారి దీపమును వెలిఁగింపు మని యామెతోఁ జెప్పి తా నెత్తికొని వచ్చిన కాంతను లోపల నెమ్మదిగాఁ గ్రింద దింపెను. హారమణియు దీపమును వెలిగించి మరణావస్థలో నున్న యాకాంతయొద్దకువచ్చి బాగుగఁ బరీక్షించి చూచుచుండెను.

ఆస్త్రీ వయసు చెల్లినదై యుండలేదు. కాని యీయవస్థలో నామెవయ సింత యని నిర్ణయించుటకు వలనుపడకుండెను. ఆమెశరీరమంతయును శుష్కించి సాంఘాతికరోగలక్షణము లగపడుచుండెను. పూర్వము మంచిదినములలో నామె సౌందర్యవతియే యైయుండవచ్చును. కాని యిప్పుడు సౌందర్యచిహ్నముకూడ నగపడుటలేదు. కట్టినబట్ట తడిసి యతిమలినమై చినిగియుండెను. తలవెండ్రుకలు జడకట్టుకొనియెను—ఎన్నడో తైలసంస్కృతములై యున్నట్లుండెను. కనుగ్రుడ్లు లోపలకుఁ బోయెను. కన్నులుమూసికొనియెను. ఊపిరిమాత్రము చలించుచున్నది. స్మృతి తప్పిపోయినది. మృత్యువు సమీపించి యున్నట్లుండెను.

అప్పుడు హారమణి "ఆమె యెచ్చట నగపడినది?" అని బ్రహ్మచారి నడిగెను.

బ్రహ్మచారి యెల్లసంగతులను సవిస్తరముగఁ దెలియఁజేసి "ఈమెకిప్పుడు మరణము సన్నిహితమైనట్లు తోఁచుచున్నది. కొంచెము కాచినచో బ్రదికినను బ్రదుకవచ్చును. నామాటవిని యట్లు చేయుమా!" అని చెప్పెను.

హారమణి యాబ్రహ్మచారివాక్యముల ననుసరించి యామె తడిబట్టలను తీసి పారవైచి తనచీరకొకదానిని కట్టి నిప్పుచేసి దాని మూలమున నామెయాపాదమస్తకమును కాచెను. అప్పుడు బ్రహ్మచారి 'ఈమెకు అన్న సంకటము కలిగినట్లు తోఁచుచున్నది. పాలున్నచోఁ గొంచెము తెచ్చి యిమ్ము!' అనియెను.

హారమణి యట్లే పాలుతెచ్చి కాచి త్రాగించెను. పొట్టలోఁ గొంచెముపాలు చేరినతోడనే యామె కన్నులను తెరచెను.

హార—అమ్మా! నీవెచ్చటనుండి వచ్చితివి.

స్త్రీ—నేనిప్పు డెచ్చట నుంటిని?

బ్రహ్మ—నీవు మార్గమధ్యమున మరణావస్థలోఁ బడియుంటివి. నేను చూచి నిన్నుఁ దీసికొని వచ్చితిని. నీవెక్కడకుఁ బోవలయును?

స్త్రీ—చాలదూరము.

హార—నీచేతులను గాజులున్నవి. నీవు ముత్తైదువవేనా?

రోగవతియగునా స్త్రీ బొమలు ముడివైచుకొనియెను. హారమణియప్రతిభయయ్యెను.

అప్పుడు బ్రహ్మచారి "అమ్మా! నిన్ను మేమేమని పిలువవలయును? నీపేరేమి?" అనియెను.

అయనాథ యువతియుఁ గొంచెము వెనుకముందుఁ జూచి "నాపేరు సూర్యముఖి!" అనియెను.

---

## ముప్పదియైదవ ప్రకరణము.

సూర్యముఖి జీవించు ననునాశ లేదు. బ్రహ్మచారి యామె రోగమును తెలిసికొనఁజాలక మరునాఁడు వైద్యశాస్త్రమునందు

మహాపండితుఁడై యాగ్రామమునఁ బ్రఖ్యాతి వహించియున్న యొక వైద్యునిఁ బిలిపించి రోగి నాతనికిఁ జూపించెను. వైద్యుఁడు బాగుగఁ బరీక్షించి "ఈమె కుబ్బసవురోగమున్నది. దానిపై జ్వరమువచ్చినది. ఈరోగ మేమో ప్రబలమైనది. జీవించినను జీవింపవచ్చును." అని చెప్పెను.

వారివారి సంభాషణము సూర్యముఖి చెవిని పడలేదు. వైద్యుడగురామకృష్ణరాయులు వాదితో నౌకయౌషధము చెప్పెను. రోగి యనాథ యని తెలియుటవలన నాతఁడు పారితోషకముమాట యెత్తనేలేదు. రామకృష్ణరాయులు ధనాశాపిశాచావేశితుఁడు కాఁడు. ఔషధము నిచ్చి బయలుదేరిపోయెను. బ్రహ్మచారియు హరిమణిని వేఱొకనసికిఁ బంపి పిమ్మట నాతఁడు సూర్యముఖియొద్దకు వచ్చి కూరుచుండి యామెతో మాటలాడుట కుద్యుక్తుఁడై యుండెను.

సూర్య—మీరు నాకొఱ కింతశ్రమ యేలపడవలయును? మీరు నాకొఱకు శ్రమపడుటవలనఁ బ్రయోజనము లేదు.

బ్రహ్మ—నాకేమిశ్రమయున్నది? ఇదియే నాపనియై యున్నది. నాకెవ్వరును లేరు. నేను బ్రహ్మచారిని. పరోపకారము చేయుటయేనాకావశ్యకధర్మ మైయున్నది. ఇప్పుడు నీవు దొరకక నీవంటివారుమఱియెవ్వరు దొరకినను నేను వారి కుపకారము చేయవలసినదే.

సూర్య—అట్లయినచో నన్నిక్కడ విడిచిపెట్టి మఱియెవ్వరికైన నుపకారము చేయుటకుఁ బోఁగూడదా? ఇతరుల కెవ్వరికైన నుపకారము చేసిన నది సార్థకమగును. నాకుపకారము చేయుట నిరర్థకమే.

బ్రహ్మ—ఏమది?

సూర్య—నేను బ్రదికియున్నచో నాకెట్టిలాభమును లేదు. మరణమే నాకు మంగళకర మైనది. నేను నిన్నటిరాత్రి పడిపోయి

నచోటనే మరణింతునుగదా యని చాల నాశపడితిని. మీ రేలనన్ను బ్రదికించితిరి?

బ్రహ్మ—నీకంతటిదుఃఖ మేల కలిగినదో నాకుఁ దెలియ లేదు. కాని యెంతటిదుఃఖ ముండినను నాత్మహత్య చేసికొనుట మహాపాతకము. ఎప్పుడుఁగూడ నాత్మహత్య చేసికొనవలదు. ఆత్మ హత్య పరహత్యవలెనే పాపకరమైనది.

సూర్య—నేనాత్మహత్య చేసికొనుటకుఁ బ్రయత్నింపలేదు. నామృత్యువు నన్నుఁ దనంతటఁదానే సమీపించినది. అందువలన నేనుమరణింతునుగదాయను ధైర్యముతో నుంటిని. కాని మరణము నందును నాకానందము లేదు.

మరణమునందుఁగూడ నానందము లేదని చెప్పునప్పుడు సూర్యముఖకంఠము రుద్ధమై కన్నీరు కాలువలై ప్రవహింపజొచ్చెను.

బ్రహ్మ—మరణింపవలయు నని చెప్పునప్పుడెల్ల నీకన్నుల నుండియశ్రువుల వెడలించుచుంటివి. అయినను చావునే కోరుకొను చుంటివి. తల్లీ! నన్నునీబిడ్డనుగా భావించుకొనుము. నాయందుఁ బుత్రవాత్సల్యము నుంచి నీమనసునందలిసంగతి యేమో తెలియఁజే యుము. నీదుఃఖమును నివారింపఁజేయుట కుపాయ మేమైన నున్న యెడలఁ జేసెదను. ఆసంగతి నీవలనఁ దెలిసికొనవలయు ననియే హార మణినవ్వాలకుఁ బంపియుంటిని. ఇప్పు డిచ్చట నెవ్వరును లేరు నీమా టలనుబట్టి చూడఁగా నీవు గొప్పయింటి యాఁడుబిడ్డవని తోఁచుచు న్నది. అది నాయొద్దఁ జెప్పఁగూడదా? నన్ను నీతనయునిగ భావించు కొని చెప్పుము.

సూర్య—(కన్నీరు నించుచు) ఇప్పుడు మరణావస్థలో నున్న దానను. ఇంకను సిగ్గుపడు టెందులకు? నాహృదయమునందలి దుఃఖ ము సామాన్యమైనది కాదు. మరణించునప్పుడు నాప్రాణేశ్వరుని

మొగము చూడకుండఁ బోవలసివచ్చెనుగదా యనువిచారము హెచ్చయియున్నది. మరణమునందే నాకు సుఖమున్నది. కాని నాథుని మొగము చూడకుండ మరణించినచో నట్టిమరణమున నాకు దుఃఖమేయుండును. ఈసమయమునందు వారి నొక్కసారి చూడగలిగితినేని నాకు మరణమే సుఖకరమైన దగును.

బ్రహ్మ—(కన్నులు తుడిచికొని) నీస్వామి యెచ్చటనున్నాఁడు? నిన్నాతని యొద్దకుఁ దీసికొనిపోవుటకు వలనుపడదు. ఆతఁ డీసమాచారమును విని రాగలఁడని తోఁచునేని నేనాతని నీసంగతులం దెలుపుచు నుత్తరము వ్రాసెదను.

అప్పుడు రోగక్లిష్టయైయున్న సూర్యముఖి వదనముహర్షవికసిత మయ్యెను. మరల నామె నిరుత్సాహయై "వారు వచ్చిన రావచ్చును. కాని వచ్చెదరో, రారో నేను చెప్పఁజాలను. నేనువారి యెడల మహాపరాధమును చేసి యుంటిని. అయినను వారు నావిషయమున దయామయులై యున్నవారు. క్షమించినను క్షమింపవచ్చును. కాని వారు చాలదూరమునం దున్నారు. నేనన్నిదినములవఱకును జీవించియుండఁగలనా?" అనియెను.

బ్రహ్మ—వారెంతదూరమునందున్నారు?

సూర్య—హరిపురమండలమున

బ్రహ్మ—సరియే. అంతవఱకును నీవు జీవించి యుండగలవు

ఇట్లు చెప్పి యాబ్రహ్మచారి లేఖనసామగ్రిందీసికొని వచ్చి సూర్యముఖి చెప్పినవిధమున నుత్తరమును వ్రాసెను.

ఉత్తరము—"నేను మీకపరిచితుఁడను. బ్రాహ్మణుఁడను—బ్రహ్మచర్యాశ్రమమునం దుంటిని. మీరెవ్వరో నేనెఱుంగను. శ్రీమతి సూర్యముఖి మీధర్మపత్ని యనిమాత్ర మెఱుంగుదును. ఆమె యీమధురపురమున నతివిషమరోగగ్రస్తయై హరమణి యను

నొక వైష్ణవియింటఁ బడియున్నది. ఆమెకుఁ దగినచికిత్స జరగుచునే యున్నది. కాని జీవించుననునాస లేదు. ఆసమాచారము తెలియుటకే మీకీయుత్తరము వ్రాసితిని. ఆమె తనమరణకాలమున నొక్కసారి మీసందర్శన మాచరించి మఱి ప్రాణములను విడువవలయునను కోరికతో నున్నది. మీకామెయపరాధమును క్షమింపవచ్చునేని వేగముగ నిచ్చటకు మీరు దయచేయవలయును. నేను సూర్యముఖిని నాతల్లిపోలికఁ జూచుకొనుచున్నవాఁడను ఆమెపుత్రునివలెనే యామెయాజ్ఞను శిరసావహించి యీయుత్తరము వ్రాసితిని. స్వయముగా వ్రాయుట కామెకు శక్తి లేదు.

మీకు రావలయు నను నుద్దేశ మున్నయెడల రాణిగంజిమార్గముగా రావలయును. రాణిగంజియందు విచారించి శ్రీమాన్ మాధవచంద్రగోస్వాములను చూచినచో మధుపురమునకుఁ బోవుమార్గమును వారు చూపెదరు. వచ్చెదరేని త్వరలో రావలయును. ఆలస్యము చేసినచో లాభము లేదు—

ఆశీర్వాదశ్శ్రీశివప్రసాదశర్మణః

ఇట్లుత్తరమును వ్రాసి పైపేరేమని వ్రాయవలయు నని సూర్యముఖి నడిగెను. సూర్యముఖియుహరిమణి వచ్చినతరువాతఁ దెలిపెద నని చెప్పెను.

హరమణి వచ్చినతరువాత "నగేంద్రనాథునకు" అనిపైవిలాసము వ్రాసి బ్రహ్మచారి యాయుత్తరము నచ్చటికి సమీపమునందున్న లేఖాప్రేషణాలయము (పోష్టాఫీసు) నకుఁ బంపించెను.

బ్రహ్మచారి యుత్తరము నంపుటకుఁ బోయినతరువాత సూర్యముఖి కన్నీరు నించుచు చేతులు జోడించుకొని యూర్ధ్వముఖియై పరమేశ్వరు నుద్దేశించి త్రికరణశుద్ధిగా "పరమేశ్వరా! నీయునికి నిజమే యగునేని నేను చిరకాలమునుండి నాస్వామిచరణములు

దక్క వేఱొక యవలంబనము లేని పతిభక్తికలదాననయి యుండు నేని నాయుత్తరము సఫలమైనదగునుగాక. ఇహలోకమునఁ బుణ్య మనునది యుండునేని, తత్పుణ్యఫలస్వరూపమున నాకు స్వర్గము వలదు. మరణకాలమున నా ప్రాణేశ్వరుని మొగ మొకసారి చూచి చావవలయు ననుకోరిక తక్క నాకు మఱియెట్టికోరికయును లేదు.'' అని ప్రార్థించెను.

కాని యాయుత్తరము నగేంద్రున కందలేదు. అది గోవింద పురము చేరుటకు ముందే నగేంద్రుఁడు దేశాంతరమునకుఁ బోయి యుండెను. కావున నాయుత్తర మాతనిమంత్రికిఁ జేరెను.

నగేంద్రుఁడు పోవునప్పుడు తనమంత్రితోఁ దానొకస్థలమునకు జేరినతోడనే యుత్తరము వ్రాయుదుననియు నంతవఱకును తనపేరున వచ్చినయుత్తరముల నన్నిటినిఁ దీసికొనియుంచి తనయుత్తరముచేరిన తోడనే వానినన్నిటినిఁ దనకుఁ బంపవలయు ననియు జెప్పి పోయియుం డెను. ఆతఁడు పాట్నానగరమునఁ బడవయెక్కి కాశికిఁ బోవుచుఁ దన మంత్రికుత్తరము వ్రాసెను. అందువలన నాతఁడు కాశీనగరము చేరి యుత్తరము వ్రాయువఱకును మంత్రి నిరీక్షించి యుండెను. బ్రహ్మ చారి యుత్తరమునుకూడఁ దన పెట్టెలో భద్రముగా నుంచు కొనియెను.

యథాకాలమునకు నగేంద్రుఁడు కాశీనగరమును చేరి మంత్రి కుత్తరమును వ్రాసెను. మంత్రి నగేంద్రున కాతని యుత్తరములఁ బంపించెను. నగేంద్రుఁ డాయుత్తరమును (బ్రహ్మచారి వ్రాసిన దానిని) చదివి యందలి యభిప్రాయములను గ్రహియించి తలపైఁ జేతులుంచుకొని కాతరహృదయుఁడై 'హా పరమేశ్వరా! మఱియొక ముహూర్తమువఱకును నాకుఁ జైతన్యము కలిగియుండనిమ్ము' అని ప్రార్థించెను. ఆ ప్రార్థనమును పరమేశ్వరుఁ డాలకించెను. ముహూర్త

కాలమువఱకు నగేంద్రునకుఁ జైతన్యముండినది. అతఁడు కార్యదర్శిం బిలిచి 'ఈరాత్రియే నేను రాణిగంజికి బయలుదేరెదను. ఎంతధనము వ్యయమైనను నాప్రయాణమునకుఁ దగిన ప్రయత్నమును చేయ వలయును' అని చెప్పెను.

కార్యదర్శి యందులకుఁ దగిన యేర్పాటుల నొనరింపఁబోయెను. నగేంద్రుఁడు దుఃఖవేగమున నేలపైఁ నిలువునఁ గూలఁబడి మూర్ఛితుఁ డయ్యెను.

ఆరాత్రియే నగేంద్రుఁడు కాశీనగరమును వదలి బయలు దేరెను. ఆహా! భువనసుందరం బగునో వారాణసీనగరమా! ఏసుఖ పురుషుఁ డట్టి శారదరాత్రులయందు కన్నులపండువై యొప్పుచున్న నిన్ను విడిచిపోవుట కిష్టపడఁగలఁడు? రాత్రిసమయము—చంద్రుఁ డగపడుట లేదు. ఆకాశమున వేలకొలఁది నక్షత్రములు మినుకుమినుకున మెఱయుచుండెను. భాగీరథీ నదీమధ్యంబున నావపైనుండి యేదిక్కుఁ గాంచినను మిలమిల మెఱయు నక్షత్రమాలికలే అనంతతేజముతో ననంతాకాశమున ననంత కాలమునుండియుఁ బ్రజ్వరిల్లుచున్న నక్షత్ర ములే. అవి సర్వదా మెఱయుచునే యుండెను. విరామము లేదు. భూతలమో? అదియును రెండవ యాకాశముం బోలియుండెను. నదీ హృదయము కూడ నీలాంబరమువలె నతి నీలంబై యుండెను. నదీ తీరమునందును, సోపానములందును, సమున్నతపర్వతశ్రేణీ సన్నిభంబు లగు సౌధపంక్తులయందును, వేనవేలు దీపములు చుక్కల వలె మెఱయుచుండెను. మేడలపై మేడలు—మఱియు వానిపైఁ గూడ నంతస్తులు. అనంతం బగు నాప్రాసాదశ్రేణి దీపమాలికా విరాజితమై యుండెను. స్వచ్ఛంబును నిర్మలంబును నగు నదీజలం బులఁ బ్రతిబింబితం బగు నాకాశము—ఆనగరము—అన్నియు జ్యోతి ర్బిందుమయంబులై యుండెను. అంతయుం గాంచి నగేంద్రుఁడు

కన్నుల మూసికొనియెను. పృథ్వీసౌందర్యముం గాంచి యప్పు డాతఁడు సహింపఁజాలకపోయెను. అప్పుడాతఁడు తన హృదయంబున శివప్రసాద బ్రహ్మచారియుత్తరము చాల నాలస్యముగఁ దనకుఁ జేరినదని యనుకొనియెను. అప్పుడు సూర్యముఖి యెచ్చట నున్నది ?

---

## ముప్పదియాఱవ ప్రకరణము

### హీరాదాసివిషవృక్షము మొగ్గఁదొడిగినది.

ఏదినమున ద్వారపాలకులు వెదురుకఱ్ఱలఁ జేబూని దేవేంద్రుని నుద్యానమునుండి తరిమివైచిరో యాదినమునుండియు హీర తనలోఁదాను నవ్వుకొనుచుండెను. కాని తరువాత నామెయందులకు దగినరీతిని పశ్చాత్తాపపడియెను. ఆమె తనలో—నాతని నవమానించితి ననియు, నది సరియైనపని కాదనియు, నాతఁడందుకొఱకు తనపైఁ గోపగించి యుండు ననియు, నాతనిహృదయమునఁ దనకుఁ దగినతావొసంగుట లేదనియుఁ దనయాశ యంతయు నిష్ఫలమై పోయినదనియు భావించుకొనియెను.

దేవేంద్రుఁడును హీరకెటులైనఁ దగినశిక్ష చేయవలయునను దుర్బుద్ధితో నాతనియభిలాషము సిద్ధించుటకుఁ దగినప్రయత్నములను చేయుచుండెను. ఆతఁడొకనాఁడు గోపకాంత యగుమాలతీగంగాజల నుపిలిపించి హీరాదాసిని తనయొద్దకుఁ దీసికొని రమ్మని చెప్పెను. హీరాదాసి యొకటిరెండుదినములవఱకు నించుక యనుమానపడుచుఁ దరువాత నొకదినమున దేవేంద్రునియింటికిఁ బోయెను. దేవేంద్రుఁ డప్పుడు కొంచెమైన కోపమును చూపియుండలేదు. వెనుకటిసమాచారమునుగూర్చి ప్రస్తావించుట కవకాశముకూడ నీయలేదు. ఆసం

గతినేయెత్తక యామెకుఁ గర్ణరసాయనముగ సంభాషింప నారంభించెను. సాలెపురుగు తనహారముకొఱకు వలను పన్నునట్లే దేవేంద్రుఁడు హీరకొఱకు కపటజాలమును పన్న నారంభించెను. హీర యాతనిపలుకులకు ముగ్ధయై కన్నులుమూసికొనిపోవ నావలోఁ బడియెను. ఆమె దేవేంద్రునిమధురాలాపములను లుబ్ధహృదయయై యాతని కపటాచరణమువలన మోసపోయెను. అదియే ప్రణయమనియు, దేవేంద్రుఁడే ప్రణయముంజూపు నాయకుఁ డనియు భావించుకొనియెను. హీర మిగులఁజతురమతి. కాని యామెబుద్ధిమాత్రము ఫలోపదాయక మైనదికాదు. ప్రాచీనకవిచంద్రు లేశక్తినిగూర్చి జితేంద్రియుఁ డగుమృత్యుంజయునితపస్సును భంగముచేయఁజాలినంతటిబలమైనదని కీర్తించి యుండిరో యట్టిశక్తిప్రభావమువలననే హీరబుద్ధి లోపించిపోయెను.

దేవేంద్రుఁడు కేవలమువట్టిమాటలను మాని తంబురఁ దీసికొని సురాపానమదసముత్సాహమున సంగీతమును పాడ నారంభించెను. గానవిద్యానిధియగు దేవేంద్రుఁడు గంధర్వగ్రామమున నుచ్చకంఠస్వరముతోఁ బాడినసుధామయం బగుసంగీతము నాలకించి హీరాదాసి యొక్క సారిగ నొడలు మఱచిపోయెను. ఆమెహృదయము చంచలమై మనసు దేవేంద్రునిప్రేమవలన ద్రవీభూతమయ్యెను. అప్పుడామె కన్నులకు దేవేంద్రుఁడే సర్వసంసారసుఖాదారు: డనియు సర్వార్థసారసంధాయకుండనియు, రమణీమణులకు సర్వాదరణీయుఁ డనియు తోఁచెను. అప్పుడు హీరకన్నులనుండి ప్రేమపూరితంబు లగునశ్రుజలధారలు ప్రవహింప నారంభించెను.

దేవేంద్రుఁ డప్పుడు తంబురను క్రిందనుంచి తనయుత్తరీయాంచలముతో నామెకన్నులను దుడిచెను. తత్క్షణమే హీరాదాసియొడలంతయుఁ బులకిత మయ్యెను. దేవేంద్రుఁడు మద్యపానమదోద్దీపితుఁడై

హాస్యరసగర్భితం బగుసరససంభాషణమున కారంభించెను. ఒక్కొక్కసారి యథార్థప్రేమము కలవానివలెనే స్నేహపూరితంబు లగు నస్పష్టాలంకారములు గల పలుకులఁ బలుకుచుండెను. అందువలన జ్ఞానహీనురాలును, సంస్కరింపఁబడిన వాక్చాతుర్యముకలదియు నగు హీర తనమనంబున నదియే స్వర్గసుఖమని తలంచుకొనియెను. హీర యంతటి స్వర్గసుఖమనుమాట యెన్నఁడును వినియుండలేదు. ఆమె నిర్మలచిత్తయై యుండి సత్సంగమువలనఁ బరిశుద్ధురాలే యైనచో నదియే నిశ్చయముగ నరకమని బాగుగ గ్రహించి యుండును. తరువాతఁ బ్రేమపూరితవచనములు వెలువడియెను—దేనిని ప్రేమమని చెప్పెదరో యట్టి దానిని దేవేంద్రుఁ డెఱుఁగనే యెఱుఁగఁడు. ఒకవిధముగా హీరయే యాసంగతి నెఱింగినదని చెప్పవచ్చును. కాని దేవేంద్రుఁ డావిషయముంగూర్చి ప్రాచీనకవులు చర్వితచర్వణముగఁ జెప్పియున్న వాక్యములను వినియుండెను. హీరాదాసి యనిర్వచనీయం బగు ప్రేమమహిమముం గూర్చినమాటల నాతనినోటనుండి విని దేవేంద్రుఁడె యమానుషచిత్తసంపన్నుఁ డని భావించుకొని యాపాదశిరఃపర్యంతమును ప్రేమరసార్ద్రయైపోయెను. అప్పుడు దేవేంద్రుఁడు వసంతోదయసమయము నందలి భ్రమర ఝంకారముం బోలిన స్వరముతో సంగీతము నారంభించెను. హీరాదాసి కప్పుడు దుర్దమనీయం బగు ప్రణయరసస్ఫూర్తి యుదయింప నామె దేవేంద్రుని కంఠస్వరముతో స్త్రీజనసులభం బగు తన కంఠస్వరముం గలిపి గానము చేయ నారంభించెను. అట్లు గానముచేయుటకు దేవేంద్రుఁ డామెను ప్రేరేపించెను. హీరాదాసియుఁ బ్రేమరసార్ద్రచిత్తంబున సూర్యరాగరంజితంబు లగు కమలంబులం బోలి కన్నుల నలవరింపఁ జేసి చిత్రచిత్రితంబులవలె నున్న భ్రూలతలచే విలసిల్లు ముఖమండలమును ప్రఫుల్లముగఁ జేయుచుఁ బ్రస్ఫుటస్వరంబున గానముచేయ

నారంభించెను. చిత్తస్ఫూర్తివలన నామె కంఠమునుండి యుచ్చస్వరము వెలువడియెను. హీర పాడినపాట ప్రేమరస ప్రపూర్ణమై యుండెను—ప్రేమభిక్షాపరిపూర్ణమైనది.

పాపమయమై యున్న యామండపమునందుఁ గూరుచుండి పాపాంతఃకరణములు గలవా రిరువురును పాపాభిలాషకు వశీభూతులై చిరపాపరూపం బగు చిరతరప్రేమమును పరస్పరము వినిమయము చేసికొనిరి. చిత్తమును స్వాధీనపఱచుకొనుట హీరకు బాగుగఁ దెలిసి యుండెను. కాని యప్పు డామె కావిషయమునఁ బ్రవృత్తి కలుగక పోవుటచే శలభముం బోలి యనలముఖంబునఁ బ్రవేశించెను. మొట్ట మొదట దేవేంద్రుఁడు ప్రణయవిహీనుం డని యామెకుఁ దెలియ వచ్చుటచేఁ దన చిత్తమును మరలించుకొనుట కామె ప్రయత్నించెను—కొంతవఱకా ప్రయత్నమున గృతార్థురా లయ్యెను. ఎంత వఱ కామె యట్టి స్థిరభావముతో నుండెనో యంతవఱకు నామె కృతార్థురా లయ్యెను. ఎట్లనిన—మొట్టమొదట దేవేంద్రుఁడు తన సమీపమునకు వచ్చినను నవ్వుచు నవ్వుచు నాతనిప్రేమమును దాను స్వీకరించినను, మనోనిశ్చయము కలదగుటచే నప్పు డామె యాతనిని వెనుకకుఁ బంపించి తానుబోయి యన్యగృహంబునఁ బరిచారికాత్వము నంగీకరించి చిత్తస్థైర్యము కలిగించుకొనియెను. కాని యిప్పుడు మాత్రము దేవేంద్రుఁడు యథార్థప్రణయశాలియే యని భావించుటచేఁ దత్కారణమునఁ దన హృదయమును మరలించుకొనుటకుఁ ప్రయత్నింపలేదు. అట్లు ప్రయత్నింపక పోవుటచేతనే యామె వృక్షము నుండి యామెకుఁ భోగ్యం బగు ఫలము ఫలియించుట కవకాశ మబ్బెను.

కొందఱుజను లిహలోకమునం జేసినపాపమున కిహలోకము ననే దండనయగుట కన్నుల కగోచర మని చెప్పెదరు. అది నిజ,మో

కాదో, యామాట యటుండనిండు! చిత్తమును వశపఱచుకొనుట యందుఁ బ్రవృత్తిలేనివాడిలోకమునందే విషవృక్షఫలము ననుభవింపకుండఁ దప్పిపోఁజాలఁడని మీరే తెలిసికొనఁగలరు.

---

## ముప్పదియేడవ ప్రకరణము

వర్షాకాలము గడచెను. శరదుదయ మయ్యెను. సస్యములు ఫలవంతము లయ్యెను. సరోవరములు సరోజమాలికా విరాజితము లయ్యెను. ప్రభాతసమయమునఁ జెట్లయాకులనుండి మంచుబిందువులు పడుచుండెను. సంధ్యాసమయమునఁ బూవుగుత్తులపైఁ బొగక్రమ్ముకొనినట్లు మంచుగవిసియుండెను. అట్టి శరత్కాలమునఁ గార్తిక మాసమునం దొకనాఁటి ప్రభాతకాలమున మధుపురమార్గమును బట్టి యొకపల్లకి పోవుచుండెను. అది క్రమముగా నాయూరియొద్దకు వచ్చెను. అది పల్లెటూరుకావునఁ బల్లకినిఁ జూచి పిల్ల లెల్లరును నాట విడిచి యాపల్లకి కిరువంకలను వరుసలుతీరి నిలిచియుండిరి. ఊరిలోనియాఁడువాండ్రు పెద్దవారలను, చిన్నవారలను, యువతులును, వృద్ధస్త్రీలును, నందఱును తమతమభుజంబులపై జలకలశంబుల నుంచికొని యట్లే నిలువఁబడి చూచుచుండిరి. యౌవనవతులగు రమణీమణులు మేలిముసుంగుల నించుక యోర చేసికొని వీక్షించుచుండిరి. సస్యంబులఁ గోతకోసికొను చున్నరయితులు తమచేతులయందుఁ గొడవళ్ళ నుంచుకొని శిరంబులకు గుడ్డలఁజుట్టుకొని నోరు తెరచికొని యబ్బురముగఁ గనుఁగొనుచుండిరి. గ్రామస్థులగుబుద్ధిమంతు లొక్కచో జేరి కూర్చుండి యుండిరి. పల్లకితలుపులనుండి పాదరక్షాలంకృతం బగునొకపాదమగపడుచుండెను. అందఱు నెవ్వరో దొరగారు వచ్చి యుండిరని నిశ్చయించుకొనిరి.

నగేంద్రుఁడు పల్లకినుండి దిగియెను. ఆపల్లెటూరివారైదాఱుగు రాతనికి సలాముచేసిరి. ఏమనిన నాతడు షరాయి తొడిగికొనియుండెను. తలపైఁ గుళ్ళాయి కలదు. కొందఱు దొరగారువచ్చిరనియు మఱికొందఱు జమీందారుఁ డెవ్వఁడో యైయుండు ననియు నూహించుకొనిరి.

నగేంద్రుఁడు తన్నుఁ జూచుచుండువారిలో నొక ముసలివానిం బిలిచి శివప్రసాదబ్రహ్మచారింగూర్చి యడిగెను. ఆముసలివాఁ డామాటను విని యేదియో హత్యనేరము జరగియుండునని యనుకొని నిజము చెప్పిన నేమినష్టము కలుగునో యనునుద్దేశముతో "అయ్యా! నేను వృద్ధుఁడను. నాకంతవఱకెట్లు తెలియును?" అని చెప్పెను. అప్పుడు నగేంద్రుఁడు సంపన్నులనెవ్వరినైన నడిగినఁగాని కార్యసిద్ధి కాదని తలంచి యాగ్రామమునం దొకపెద్దమనుష్యునియింటికిఁ బోయెను. ఆయింటియతఁడు వైద్యుఁడగు రామకృష్ణరాయతేయై యుండెను. ఆగృహాధికారి యెవ్వఁడో జమీందారుఁడు తనయింటికి వచ్చె నని యెంచి యొకకుర్చీ తీసికొనివచ్చెను. దానిపై నగేంద్రుఁడు కూరుచుండి బ్రహ్మచారి విషయమై యాతని నడిగెను. రామకృష్ణుఁడు బ్రహ్మచారి యిచ్చట లేఁడని చెప్పెను. నగేంద్రుఁడతి వ్యాకులహృదయుఁడై "ఆతఁడెచ్చటి కేగినాఁడు?" అని యడిగెను.

రామ—ఆసంగతి తెలుపుటకు వలనుపడదు. ఆతఁడెచ్చటికిఁ బోవునో యాతనికే తెలియదు. అంతియకాక యాతఁడొక చోట నుండువాఁడు కాఁడు. ఎప్పుడు నూరూరు తిరుగుచుండువాఁడు.

నగేం—మరల నెప్పుడు వచ్చును? ఆసంగతి నెఱిఁగినవారిచ్చట నెవ్వరైన నున్నారా?

రామ—ఆతనివలన నాకును గొంతపని కావలసి యున్నది. నేను నాతనిరాకకై నిరీక్షించుచున్నాఁడను. ఆతఁడెప్పుడువచ్చునో యెవ్వరికిని తెలియదు. ఎవ్వరును చెప్పఁజాలరు.

నగేంద్రుఁడు విషణ్ణుఁడై మరల "ఆతఁ డిచ్చటనుండి బయలు దేఱిపోయి యెన్నిదినములైనది?" అని యడిగెను.

రామ—ఆతఁ డిచ్చటికి శ్రావణమాసమునందు వచ్చి భాద్రపదమాసమున మరల నెచ్చటికో పోయెను.

నగేం—మంచిది. ఈగ్రామమునందు వైష్ణవి యగుహారమణి యిల్లెచ్చట నున్నది? ఆయిల్లెవరైనఁ జూపఁగలరా?

రామ—హారమణియిల్లు మీరు వచ్చినమార్గమునందే యున్నది. ఆయిల్లిప్పుడు లేదు. ఆయింటిపై నిప్పుపడుటచే నది కాలిపోయినది.

నగేంద్రుఁడు రెండుచేతులతోడను తనతలను పట్టుకొనిగద్గద స్వరముతో "హారమణి యెచ్చట నున్నది?" అని యడిగెను.

రామ—ఆసంగతి యెవ్వరికిని తెలియదు. ఇల్లు కాలిపోయిన నాఁటిరాత్రి యామె యెచ్చటికో పోయినది. ఆమె తనయింటికిఁ దానే నిప్పుపెట్టుకొని యిల్లువిడిచి యెచ్చటికో పారిపోయినదని కొందఱు చెప్పుదురు.

నగేంద్రుఁడు భగ్నస్వరముతో "ఆమెయింటియం దప్పుడు మఱియెవ్వరైన నాఁడువాండ్రున్నారా?" అని యడిగెను.

రామ—లేరు—శ్రావణమాసమునం దేదేశమునుండియో యొక కాంత రోగపీడితయై యచ్చటికి వచ్చియుండెను. ఆమె నా బ్రహ్మచారియే తీసికొనివచ్చి యాయింటియం దుంచెను. ఆమెపేరు సూర్యముఖి యని వినియుంటిని. ఆమెకు మూఁడునెలలు జబ్బు కుదిరినది. అప్పుడు—

నగేంద్రుఁడు తొందరతో "సరే. అప్పు డేమిజరగినది?" అనెను,

రామ—అప్పుడు—హారమణియిల్లు కాలిపోయినప్పు డామెయును కాలిపోయినది.

నగేంద్రుఁ డాకుర్చీనుండి క్రిందఁ బడపోయెను. తలపైఁ బెద్ద దెబ్బ తగిలినది. ఆదెబ్బచే నాతఁడు మూర్ఛపోయెను. రామకృష్ణ రాయ లాతనికి చికిత్స చేయుచుండెను.

బ్రదికియుండు టెవ్వరికిష్టము? ఈసంసారము విషమయ మైనది. విషవృక్ష మెల్లరియింటిముంగిటను మొలచియున్నది, ప్రేమించువా రెవ్వరు? అట్టివారు తమహృత్పిండమును గోసి కాల్చుకొందురుగాక! హా! పరమేశ్వరా! ఈసంసారమునందు సుఖవంతు లైనవారి నెవ్వరిని నీవు సృష్టింపనే లేకపోయితివా? నీవిచ్ఛామయుఁడవు ఇచ్ఛకలిగి నచో సుఖవంతు లగుసంసారులను నీవు సృజియింపఁగలవు. సంసారమునం దింతటిదుఃఖ మెందులకో?

---

## ముప్పదియెనిమిదవ ప్రకరణము

ఇప్పటి కంతయును సంపూర్ణ మైనది. సంధ్యాసమయమున నగేంద్రుఁడు మధుపురమునుండి వెడలిపోవుటకుఁ బల్లకిలోఁ గూరు చుండి తనలో "ఇప్పటికంతయును సంపూర్ణ మైనది?" అని యను కొనియెను.

సంపూర్తి యైన దేది? సుఖమా? సూర్యముఖ అదియేమో యిల్లువిడిచి వెడలిపోయినదినముననే పోయినది. మఱిపూర్తి యైన దేది? ఆశయా?—మనుష్యున కాశయున్నంతవఱకు నేదియును సం పూర్తి కానేరదు. ఆశ వదలినచో నన్నియును పూర్తియగును.

నగేంద్రున కప్పు డాశవదలిపోయినది. అందువలన నాతఁడు గోవిందపురాభిముఖుఁడై బయలుదేరెను. ఆతనికి గోవిందపురమునఁ దనయింట నివసించి యుండుట కిష్టము లేదు. గృహధర్మముల నన్ని

టిని త్యజియించుటకే బయలుదేరి పోయెను. అట్లు చేయవలసి వచ్చి నచోఁ జాలఁగష్టము—అనేకవ్యవస్థలు కావలయును. సర్వస్వమును లెక్కింపవలయును. జమీాందారీ, మందిరములు, మఱియు నితరంబు లగు ననేకస్వార్జితచరస్థిరస్వత్వంబులు, వీని నన్నిటినితన చెల్లెలిబిడ్డ యగు సతీశచంద్రునకు దానపత్రమూలకముగ దానము చేయవలయును— అందుకొఱకొకన్యాయవాదియొద్దకుఁ బోవనిదే యాపని సాగదు. చరస్వత్వమును కమలమణికిఁ జెందింపవలయును. అది కుంతయును చేర్చి కలకత్తాయందలియామె యింటికిఁ బంపవలయును. కొన్ని పత్రము లను తనకొఱకుంచుకొనవలయును. తాను జీవించియున్నంతవఱకు వానిని వెచ్చించుకొనుచుండవలయును. కుందనందినిని కమలమణి యొద్దకుఁ బంపవలయును. ధనము పత్రములు మొదలగువానింగూర్చి విశదముగా శ్రీశచంద్రునకుఁ దెలియఁజేయవలయును. తానొక్కసారి సూర్యముఖిశయనించుశయ్యపైఁ బరుండియొక్కసారి యేడువవలయును సూర్యముఖి యలంకారముల నన్నిటిని భద్రపఱుపవలయును— అవిమాత్రము కమలమణి కీయఁగూడదు. తనయొద్దనే యుండుకొన వలయును. ఎక్కడకుఁ బోయిన నవి తనయొద్దనే యుండవలయును. మరణకాల మాసన్నమైనప్పుడు వానినిఁ గన్నారఁజూచుచుఁ దాను మరణింపవలయును. ఆవశ్యకకార్యంబుల నెల్లఁ జేసికొని యిల్లువిడిచి దేశములఁబట్టిపోవలయును. బ్రదికి యున్నంతవఱకు భూమియందెచ్చ టనో, యొకమూల దాఁగికొని యెవ్వరికిని మొగముచూపకుండఁ గాలక్షేపము చేసికొనవలయును.

నగేంద్రుఁడు పల్లకియందుఁ గూరుచుండి యిట్లు భావించుకొను చుఁ బ్రయాణము చేయుచుండెను. పల్లకితలుపులు తెరచియే యుం డెను. రాత్రికార్తికమాసపువెన్నెల. ఆకాశముననక్షత్రములు మెఱ యుచున్నవి. త్రోవప్రక్కను విద్యుద్వార్తాతంత్రులు గాలివలన "ఝం

ఘుం'' అని ధ్వనిచేయుచుండెను ఆరాత్రి నగేంద్రుని కంటికి నక్షత్ర మొక్కటియు నందముగా నగపడుట లేదు. అవెన్నెల యతికర్కశముగా నగపడుచుండెను. చూచినపదార్థము లెల్లఁ గన్నులకు శూలము లం బోలియుండెను. ప్రపంచమంతయు నతిదారుణముగఁ దోఁచుచుండెను. సుఖదినములయందుఁ దేజోవంతములుగ మనోహరంబులుగ నగపడువస్తు వు లన్నియు నప్పుడు నిస్తేజములై కానవచ్చుట కేమి కారణము ? గుజ్జుగఁబెఱిగియున్న పచ్చిక చంద్రకిరణములచేఁ బ్రతిబింబితమై మనోహరంబుగ నుండఁదగినదయ్యు నప్పుడంతరమణీయముగ నున్నదా ? లేదు. అప్పు డాకాశము మునుపటివలెనే నీలమై యున్నది. మేఘమును మొదటివలెనే తెల్లనై యున్నది. నక్షత్రములును మొదటివలెనే సముజ్జ్వలములై యుండెను. వాయువుకూడ మొదటివలెనే క్రీడాశీలమై యున్నది. పశువులును మొదటివలెనే సంచరించుచున్నవి. మనుష్యుఁడు మొదటివలెనే విలాసలాలసుఁడై యున్నాఁడు. పృథ్వియు మొదటివలెనే యనంతగామియై యున్నది. సంసారప్రవాహము మొదటివలెనే యప్రతిహతమై యున్నది. అయినను నప్పుడు పృథ్వీదేవిదయాశూన్యతం గాంచి యాతఁడు సహింపఁజాలకపోయెను. ఆభూమి వ్రక్కలై యానగేంద్రు నప్పుడు పల్లకి సమేతముగ నేల మ్రింగివేయ లేదు ?

నగేంద్రుఁడు బాగుగ యోచించి చూచెను. తరువాతనది యంతయు స్వయంకృతాపరాధమే యని నిశ్చయించుకొనియెను. అతని కిప్పుడు ముప్పదిమూఁడవసంవత్సరము. అంతలోనే యాతని కన్నియును నిండిపోయెను. జగదీశ్వరుఁ డాతనికొసంగినదానిలో నేదియు నుఁ గొలఁదిపడి యుండలేదు. మనుష్యుఁడు దేనివలన సుఖపడవచ్చునో యదియంతయును పరమేశ్వరానుగ్రహమున నాతనికి లభియించినట్లు మఱియెవ్వరికిని లభియింపలేదు. ధనము, ఐశ్వర్యము,

సంపత్తు, గౌరవము మొదలగున వన్నియును నపరిమితంబులై యాతని ననుసరించియుండెను. బుద్ధిమాత్రము లేకయున్నచో వానివలన సుఖము కలుగఁబోదు. బుద్ధివిషయమునందును పరమేశ్వరుఁ డాతని యెడలఁ గార్పణ్యమును వహించి యుండలేదు ఆతనికి విద్యఁ గఱపుటయందుఁ దల్లిదండ్రులును లోపముచేసి యుండలేదు. ఆతనివలె సుశిక్షితుఁ డైనవాఁ డొరుఁ డెవ్వఁడును లేఁడు. రూపము, బలము, స్వాస్థ్యము, ప్రణయశీలము మొదలగువాని నన్నిటిని ప్రకృతిదేవి యాతనికి రెండుచేతులతోడను నొసంగి యున్నది. ఆయన్నిటికంటె నధికమైనదియు, ధనమువలనఁగూడ దుర్లభమైనదియు, నిహసంసారమున నమూల్యమై సర్వోత్కృష్టమైనదియు నగుపదార్థము!—అది యేది? ప్రణయశాలినియు, సాధ్వియు నగుభార్య—అదియునుపూర్వపుణ్యవిశేషమున నాతనికి లభియించెను. సుఖసామగ్రులన్నియు నొక్కచోఁ జేరి యీప్రపంచమునం దెవ్వరికి లభియించినవి? అయిన నాతనికంటె నీప్రపంచమున నధికముగ నసుఖము ననుభవించుచున్నవాడు మఱియొకఁ డెవ్వఁడున్నాఁడు? ఆతనిసర్వస్వమును ధారవోసి యాతనధనము, సంపత్తు, గౌరవము, రూపము, యౌవనము, విద్య, బుద్ధిమొదలగువాని నన్నిటిని దానముచేసి యందుమూలమున నప్పటి తనయవస్థకుబదులుగఁ దనబోయలలో నొక్కని యవస్థను వినిమయము చేసికొనవచ్చునేని నదియే స్వర్గముకంటె నధిక సుఖకరముగ నుండు నని యాతఁడూహించుకొనియెను. ఆతనియప్పటి యవస్థకంటె బోయయవస్థయు నెంతయో మేలైనదిగా నుండెను. మనుష్యునివధియించి యాయపరాధకారణమునఁ జెఱసాలంబడియున్న పాపాత్ముడగు నృశంసుఁడుకూడ నాతనికంటె సుఖవంతుఁడే కాదా? "ఆతఁడు కూడఁ దనకంటె, బవిత్రుఁడే గదా!" యని నగేంద్రుఁడు భావించుకొనియెను. ఆయోచనాప్రవాహమునం దాతడు

మరలఁ దనహృదయంబున 'నరహత్య చేసి చెఱయందుండునపరాధి తనశత్రువునో మఱియెవ్వరినో యితరుని వధియించి యుండును. నేనో, ప్రాణేశ్వరియగు సూర్యముఖిని నిష్కారణముగఁ జంపుకొంటిని. నేను నాయింద్రియములను వశపఱచుకొనియే యున్నచో నాసూర్యముఖి విదేశమునకుఁ బోయి యొకపర్ణకుటీరమునఁ గాలిపోయి యుండునా? సూర్యముఖిని చేతులారఁ జంపుకొన్నవాఁడను నేనే—ఏపితృఘ్నుఁడు, — ఏమాతృఘ్నుఁడు — ఏపుత్రఘ్నుడు — నాకంటెనధిక పాపి — యగును? సూర్యముఖి కేవల పత్నీమాత్రయే యైయున్నదా? —సూర్యముఖియే నాకు సర్వస్వమునై యుండెను. సంబంధమున భార్య—సౌహార్దమునఁ దోబుట్టువు—ప్రయత్నమున భగిని—గౌరవమునఁ గుటుంబిని—స్నేహమునఁ దల్లి—భక్తిని సంతానము— ప్రమాదమున బంధువు—పరామర్శమున గురువు—ఉపచారమున దాసి—నాసూర్యముఖి! మఱియెవ్వరి కిట్టియదృష్ట మున్నది? సంసారమున సహకారిణి—మందిరమున లక్ష్మి—హృదయమునధర్మము—కంఠమున నలంకారము!—కంటిని గ్రుడ్డు—హృదయమున రక్తము—దేహమునఁ బ్రాణము—జీవితమున సర్వస్వము—నాప్రమాదమున హర్షము—విషాదమున శాంతి—విచారణమున బుద్ధి-కార్యమున నుత్సాహము!—ఈప్రపంచమున నట్టిరమణీమణి మఱియెవ్వరు? నాకన్నులకు వెలుఁగు — శ్రవణములకు సంగీతము— శ్వాసమునకు వాయువు—స్పర్శమునకు సర్వప్రపంచము నైయుండెను. నాకు వర్తమానమున సుఖస్వరూపయు, భూతకాలమున స్మృతిస్వరూపయు, భవిష్యత్కాలమున నాశాస్వరూపయుఁ బరలోకమునకుఁ బుణ్యస్వరూపయు నైయున్నది. నేను కేవలము పశుతుల్యుఁడను, రత్నము నెట్లు తెలిసికొనఁగలను?' అనియీవిధముగ యోచించుకొనుచుండెను.

ఆకస్మికముగ నాతనిహృదయమునఁ దాను సుఖియైపల్లకి యందుఁ గూరుచుండి ప్రయాణము చేయుచున్నట్లును, సూర్యముఖి పాదచారిణియై మిగులగష్టపడుచున్నట్లును స్మృతి కలిగెను. తత్క్షణమే యాతడు పల్లకినుండి దిగి పాదచారి యయ్యెను. బోయలు వట్టిపల్లకి నిమాత్రము వెనుకనుండి మోచికొని వచ్చుచుండిరి, మరునాఁటియుద యమున కాతఁడు వచ్చినస్థలమునఁ దనపల్లకిబోయలకు సెలవిచ్చి పంపించెను. అక్కడనుండి యాతఁడు తన యూరివఱకును కాలినకడకనే బయలుదేరెను.

అప్పు డాతఁడు తనలో "నేను సూర్యముఖిని వధియించిన పాపమునకై నాకు నిలిచియున్న ప్రాయశ్చిత్తమేమున్నది? సూర్యముఖి గృహత్యాగినియై సకలసుఖములచేతను వంచితయై వెడలి పోయెను. నేనును సకలసుఖములనుత్యజియించితిని. ఐశ్వర్యము, సంపత్తు, దాస దాసీజనము, బంధుసముదాయము—ఎట్టిసంబంధమును నాకు వలదు. సూర్యముఖి యిల్లువిడిచిపోయినది మొదలుగ నెట్టికష్టములననుభవించినదో. నేనునట్టికష్టములనే యనుభవించెదను. నేను మరల గోవిందపురము వదలినది మొదలుగఁ బాదచారినై ప్రయాణము చేయుదును. లభించినయన్నమును భుజించెదను, చెట్టునీడనో శయనించెదను. నేను నాకొఱకునిశ్చయించుకొన్న ధనమునుండిప్రాణ ధారణమునకు వలయునంత వెచ్చించి మిగిలినధనము ననహాయలగు కాంతలకొఱకు దానము చేసెదను. సతీశునకు దానము చేసినధనమునందర్ధభాగము నిర్గతికలగు స్త్రీలసంరక్షణమునకై వ్యయపఱుచునట్లు దానపత్రమునందు వ్రాసెదను. ప్రాయశ్చిత్తము! పాపమునకుఁ బ్రాయశ్చిత్తమున్నది. కాని దుఃఖమునకుఁ బ్రాయశ్చిత్త మున్నదా? లేదు. దుఃఖమునకుఁ బ్రాయశ్చిత్తము మరణ మొక్కటియే. చచ్చినచో దుఃఖము వదలిపోఁగలదు. అట్టిప్రాయశ్చిత్తము నేల చేసికొన

గూడదు!'' అని యనుకొని రెండుచేతులతోడను కన్నులను మూసి కొని పరమేశ్వర నామస్మరణము చేయుచు నగేంద్రుఁడు మరణాశను నివర్తింపఁజేసికొనియెను—

---

## ముప్పదితొమ్మిదవ ప్రకరణము

### అన్నియును వదలిపోయినవి—పరితాపమేలవదలలేదు?

రాత్రి యెనిమిదిగంటలవేళ శ్రీశచంద్రుఁడొక్కఁడే బైఠకు ఖానాయందుఁ గూరుచుండి యుండెను, ఆసమయమున నగేంద్రుఁడు పాదచారియై యచ్చటికి వచ్చెను. స్వయముగా నగేంద్రుఁడేలీసికొని వచ్చినతనమూట నొకచోటనుంచి యాతఁడుకుర్చీపైఁగూరుచుండెను.

శ్రీశచంద్రుఁ డాతనిమొగముచూచి భయపడి యాతనితో నేమియు మాటలాడఁజాలకపోయెను. నగేంద్రుఁడు కాశినుండి బ్రహ్మచారియుత్తరము వచ్చెననియు, మధుపురమునకుఁ బోవుచుంటిననియు మాత్రమిదివఱకు శ్రీశచంద్రునకు జాబు వ్రాసి యుండెను శ్రీశచంద్రునకంతవఱకుమాత్రమే తెలియును. ఆవచ్చిన నగేంద్రుఁడేమియును మాటలాడక యూరకుండుటను గాంచి శ్రీశచంద్రుఁడు నగేంద్రుని దగ్గఱకుఁ బోయి కూరుచుండి యాతనిచేయి పట్టుకొని ''నగేంద్రా! నీవు మౌనభావముతో నుండుటను గాంచి నాకుమిగుల మనోవ్యథగా నున్నది. నీవు మధుపురమునకుఁ బోలేదా?'' అని యడిగెను.

నగేంద్రుఁడు ''పోయితిని.'' అనిమాత్రము చెప్పెను శ్రీశచంద్రుఁడు భయపడి ''బ్రహ్మచారిని చూడలేదా?'' అని మరల నడిగెను.

నగేం—లేదు,

శ్రీశ—సూర్యముఖి సమాచార మేమైనఁ దెలిసినదా? ఆమె యెచ్చట నున్నది?

నగేంద్రుఁడు తన చేతివ్రేళ్ళను పైకిఁ జూపుచు 'స్వర్గమునందు' అనియెను.

శ్రీశచంద్రుఁడు మౌనమును వహించెను. నగేంద్రుఁడును మౌనియై తల వంచికొనియెను. కొంతసేపైనతరువాత నగేంద్రుఁడించుక మొగమెత్తి 'నీకు స్వర్గమనినచో నమ్మకము లేదు—స్వర్గమనునది యొకటి కలదని నేను నమ్మెదను' అనియెను.

మొట్టమొదట నగేంద్రుఁడును స్వర్గమునుగూర్చి నమ్మకము లేనివాఁడే యనియును, నిప్పుడాతఁడు నమ్ముచుండుస్వర్గము ప్రీతి విశ్వాసములచే సృష్టింపబడిన దనియును శ్రీశచంద్రుఁడు తలంచెను. సూర్యముఖి యెచ్చటను లేదనుమాట దుస్సహమై యుండెను. కాని సూర్యముఖి స్వర్గముననైన నున్నదనుమాట యెంతో సుఖము కలిగించు చుండెను.

ఇరువురును కొంతసేపటివఱకు మాటలాడకయే కూరుచుండిరి. శ్రీశచంద్రుఁ డది యూఱడించుటకుఁ దగిన సమయము కాదని యోచించెను. ఆ సమయమునం దన్యులవాక్యములు విషమయములై యుండుటయే కాక యితరుల సంసర్గముకూడ నెంతో దుస్సహముగా నుండును. ఈ సంగతిని గ్రహియించి శ్రీశచంద్రునికొఱకొక శయ్యను సిద్ధపఱుచుటకై యటనుండి వెడలిపోయెను. భోజనము మాట యెత్తుట కాతనికి ధైర్యము కలుగలేదు. ఆభారము కమలమణియే వహియింపవలసి యుండునని యెంచి వెడలిపోయెను.

కమలమణియును, సూర్యముఖి దొరకలేదని వినియెను, అప్పుడామె యేభారమును వహియించుకొనలేదు. సతీశు నొక్కనిని విడిచి యామె యారాత్రి వేళ నదృశ్య యయ్యెను.

కమలమణి దుమ్మునఁ దొరలుచుఁ గుంతలములు చెదరిజీరాడ నొక్కచోఁ బడి యేడ్చుచుండెను. అప్పు డొక పరిచారిక సతీశునిఁ దీసికొని వచ్చి యామెయొద్ద విడిచి వెడలిపోయెను. తల్లి యీవిధమున దొరలుచు నేడ్చుచుండుటం గాంచి సతీశుఁడు మొదట నూరక యామెయొద్దఁ గూర్చుండియుండెను. తరువాత శిరీషకుసుమ పేశలంబు లగు తన చిన్ని చేతులతో నాబాలకుఁడు తనతల్లి మొగము నించుక పైకెత్తి చూచుటకుఁ బ్రయత్నించెను. కమలమణియు నించుక మొగ మెత్తెను. కాని ముద్దుబిడ్డను పలుకరింపలేదు. సతీశుడు తల్లిని ప్రసన్నురాలిగఁ జేసికొనుటకై యామె మోము ముద్దుపెట్టుకొనియెను. అప్పుడు కమలమణి తనచేతితో నాతని శరీరమును సవరించి యాదరించెను. కాని మరల ముద్దుపెట్టుకొనలేదు. పలుకరింపనులేదు. అందువలన సతీశుడు తల్లికంఠమును కౌగిలించుకొని యామెతొడపైఁ బరుండి యేడువదొడంగెను. అప్పుడా బిడ్డహృదయమునఁ బ్రవేశించి యాతని రోదనమునకు గారణమును విధాతయగు పరమేశ్వరుఁడు తక్క మఱి యెవ్వ రెఱుంగఁగలరు ?

శ్రీశచంద్రుడు స్వబుద్ధినే యాధారము చేసికొని కొంచెము ఫలాహారమును తీసికొనిపోయి నగేంద్రునిముందుంచెను.

నగేం—దాని యావశ్యకత యంతగా లేదు—కాని నీవు కూరుచుండుము—నీతో జాలనఱకు మాటలాడవలసినపని యున్నది. ఆమాటలు నీతో జెప్పి పోవలయు ననియే యిచ్చటికి వచ్చితిని.

అని చెప్పి నగేంద్రుడు వైద్యుడగు రామకృష్ణరాయుని వలన దాను వినినసంగతుల నన్నిటిని శ్రీశచంద్రునకు సవిస్తరముగ దెలియ జేసెను. తరువాత ముందుజరుగవలసిపను లన్నియును దానూహించు కొన్నవిధమునఁ జెప్పివైచెను.

శ్రీశ—నీవు మార్గమధ్యమున బ్రహ్మచారిని చూడకుండుట మిగుల నాశ్చర్యముగ నున్నది. ఏమనిన—అతఁడు నిన్నటిదినమున

నీకలకత్తా నగరమునుండి నిన్ను వెదకుటకై మధుపురముపోయి యున్నాఁడు.

నగేం—అది యెట్లు ? ఆబ్రహ్మచారి సందర్శనము నీకెట్లయినది ?

శ్రీశ—ఆతఁడు మహామహుఁడు. నీకువ్రాసినయుత్తరమునకుఁ బ్రత్యుత్తరము రాకపోవుటవలన నాతఁడు స్వయముగా నిన్ను వెదకికొనుచు గోవిందపురమునకు వచ్చెను, కాని యప్పుడు నీవచ్చట లేవు. తానువ్రాసినయుత్తరము నీకుఁ గాశియందుఁ జేరినదని యచ్చట తెలిసికొని యప్పు డాతఁడెవ్వరితోడ నేమియును చెప్పకయే పురుషోత్తమమునకుఁ బయలుదేరి పోయెనఁట! అటనుండి తిరిగి నిన్ను వెదకికొనుచు మరల గోవిందపురమునకుఁ బోయెను. అట నీవర్తమాన మేమియుఁ దెలియక పోవుటచే నాతఁడు నాయొద్దకు వచ్చినాఁడు. నేనాతని కెల్ల సంగతులను దెలిపి నీవువ్రాసిన యుత్తరమునుగూడఁ జూపించితిని. ఆతఁడు నిన్ను మధుపురమున నెటులైనఁ జూడఁగల ననుధైర్యముతో నిన్నటిదినమున నింటనుండి బయలుదేరి పోయెను. నిన్నటిరాత్రి నిన్నాతఁడు రాణీగంజిలోఁ జూడవలసినదే.

నగేం—నేను రాణీగంజియందుండ లేదు. సరే. ఆతఁడు సూర్యముఖిసమాచారమునుగూర్చి యేమైనఁ జెప్పియున్నాఁడా ?

శ్రీశ—ఆసమాచార మంతయు నీకు నేను సవిస్తరముగ రేపటి యుదయమునఁ దెలిపెదను.

నగేం—తెలిపినచో నామనోవ్యథ యతిశయించునేమో యని నీవు సందేహించుచుంటివి—ఆసంతాపమిఁక వృద్ధినొందఁజాలదు—చెప్పుము.

శ్రీశచంద్రుఁడు బ్రహ్మచారివలన వినినది వినినట్లుగా మార్గమునఁ బడిపోయిన సూర్యముఖిని చూచుటయు, ఆమెకు జబ్బుగా

నుండుటయు, ఆమె కష్టం డౌషధము నిప్పించుటయు, ఆమెకు మూఁడువంతులారోగ్యము కలుగుటయు మొదలగు సంగతులు నన్నిటిని దెలియఁజేసెను. సూర్యముఖి యెంతదుఃఖితురాలై యున్నదని తాను వినియెనో, ఆసంగతి మాత్రము నగేంద్రునితోఁ జెప్పలేదు.

నగేంద్రుఁడంతయు నాలకించి తత్క్షణమే లేచి యాయింటినుండి వెడలిపోయెను. శ్రీశచంద్రుఁడుకూడ నాతని వెంబడించెను. నగేంద్రుఁడు రావల దని నిషేధించెను. నగేంద్రుఁడు రెండుజాముల వఱకు నందందుఁ బిచ్చివానివలెఁ దిరుగాడెను. జనసమూహమున జేరినచో నాత్మవిస్మృతి కలుగుననునాశ——కాని యది రాత్రిసమయ మగుటచే జనుల సందడియే లేదు. ఆత్మవిస్మృతికలుగుట యెట్లు ? మరల శ్రీశచంద్రునియింటికే పోయెను. శ్రీశచంద్రుఁడు మరల వచ్చి యాతని యొద్దఁ గూరుచుండెను. అప్పుడు నగేంద్రుఁడు "ఇంకను నాకుఁ జెప్పవలసినమాటలు విశేషముగ నుండవచ్చును. ఆమె యెచ్చటికిఁ బోయినది ? ఏమిచేసినది ? అవి యన్నియును బ్రహ్మచారి నీతోఁ జెప్పియుండవచ్చును." అనియెను.

శ్రీశ——అట్టిమాటలవలనఁ బ్రయోజనము లేదు. నీవు చాల శ్రమపడి యుంటివి. కొంచెము విశ్రమింపుము——

ఆమాటలను విని నగేంద్రుఁడు బొమలు ముడివడఁ బరుష స్వరముతో "చెప్పుము" అనియెను.

శ్రీశచంద్రుఁడు నగేంద్రుని మొగమువంకఁ జూచెను అప్పుడాతడు పిచ్చివానివలె నగపడియెను. విద్యుద్గర్భం బగుమేఘమువలె నాతని మొగము నల్లవడి యుండెను. శ్రీశచంద్రుఁ డంతయుం గాంచి భయపడి "చెప్పెదను" అనియెను. నగేంద్రుని ముఖము ప్రసన్నమయ్యెను. శ్రీశచంద్రుఁడు సంక్షేపముగా "సూర్యముఖి కాలుదారిం బట్టి కొంచెము కొంచెముగ నడచుచు నీవంకనే వచ్చుచున్నది" అని చెప్పెను.

నగేం—నిత్యము నెంతదూరము నడచుచున్నది?

శ్రీశ—క్రోశము—క్రోశార్ధము—

నగేం—ఆమె యిల్లువిడిచి పోవునప్పు డొకకాసైనఁ దీసికొని పోలేదు—కాలక్షేప మెట్లు?

శ్రీశ—ఒక్కొకనాఁ డుపవాసము—ఒక్కొక దినము భిక్ష ము—నీ వేమి పిచ్చివాఁడవై పోవుచుంటివి?

అని చెప్పి శ్రీశచంద్రుఁడు నగేంద్రునివెన్నుపైఁ జరచెను— ఏమనిన—నగేంద్రుఁడు చేతులతో గొంతు పిసికికొనుచుండెను. ఆతఁ డట్లు చరచి "నీవు చచ్చినచో సూర్యముఖి దొరకునా!" అని పలికి నగేంద్రునిచేయి భద్రముగాఁ బట్టుకొనియెను. నగేంద్రుఁడు "చెప్పుము!" అనియెను.

శ్రీశచంద్రుఁడు "స్థిరమనస్కుఁడవై వినకున్నచో నేనుచెప్పఁ జాను" అనియెను'

శ్రీశచంద్రునిమాట యాతనిచెవిని బడలేదు. ఆతని కప్పుడు చైతన్యమే లేదు. నగేంద్రుఁడు కన్నులు మూసికొని స్వర్గారూఢయై యున్నసూర్యముఖిరూపమును ధ్యానించుకొనుచు నామె రత్నఖచిత సింహాసనమున మహారాజ్ఞివలెఁ గూరుచుండి యున్నట్లును, నలు దిక్కులనుండి శీతలమందమలయమారుతము వీతెంచుచు నామెయ లక దామమును చలియింపఁ జేయుచున్నట్లును, పుష్పవినిర్మితంబు లగు పక్షులు నలుదెసల సంచరించుచు వీణానినాదమును నిందించు కంఠస్వరముతో గానము చేయుచున్నట్లును, ఆమెచరణతలంబున వేలకొలఁదిపద్మములు వికసించి యున్నట్లును, ఆమెసింహాసనచంద్రా తపంబున వేనవేలుచంద్ర మండలములు ప్రకాశించుచున్నట్లును, నలుదిక్కులను నక్షత్రములు మాలికాకృతులం దాల్చి మెఱయుచు న్నట్లును, తానొకగాఢాంధకార పూరితం బగు తావునఁ బడి యున్న

ట్లును, తనప్రత్యవయవమును ఘాతనాశయంబై యున్నట్లును, తన్ను రాక్షసులు బెత్తములతోఁ గొట్టుచున్నట్లును, సూర్యముఖ వారిని నివారించుచున్నట్లును కన్నారఁజూచినవిధంబుననే భావించు కొనియెను.

శ్రీశచంద్రుఁడు చాలవఱకుఁ బ్రయత్నించి యాతనికి మరల స్మృతి కలుగునట్లు చేసెను. తెలివి వచ్చినతోడనే నగేంద్రుఁ డుచ్చ స్వరంబున "సూర్యముఖీ! ప్రాణేశ్వరీ! నీవెచ్చట నున్నదానవు?" అని బిగ్గరగాఁ గేకవైచెను. ఆ కేక విని శ్రీశచంద్రుఁడు భయముచే స్తంభితుఁడై పోయెను. క్రమముగా స్వాభావికస్థితి నందిన నగేంద్రుఁ డప్పుడు మరల "చెప్పుము!" అనియెను.

శ్రీశచంద్రుఁడు భయభ్రాంతుఁడై "ఇంకేమి చెప్పుదును?" అనియెను.

నగేం—చెప్పుము! చెప్పకుంటివేని నేనిచ్చటనే ప్రాణత్యాగము చేసికొనియెదను.

శ్రీశచంద్రుఁడు భయపడి చెప్పఁ దొడంగెను, ఏమనిన— సూర్యముఖి చాలదినములు కష్టపడలేదు. ధనాఢ్యుఁ డగునొకబ్రాహ్మణుఁడు సపరివారముగఁ గాశికిఁ బోవుచుండెను. ఆతఁడు కలకత్తా వఱకునుపడవయందు బయలుదేరి వచ్చెను. ఒకదినమున నదీతీరము నందు సూర్యముఖి చెట్టుక్రిందఁ బడి యుండెను. బ్రాహ్మణుఁడు వంటచేసికొనుట కాచెట్టుక్రిందికి వచ్చెను. ఆబ్రాహ్మణునిభార్యతోఁ గూడ సూర్యముఖి సంభాషించుచుండఁగా నామెయవస్థం గాంచి సుగుణగణంబులం గాంచి ప్రీతుఁడై సూర్యముఖిని పడవపై గూరు చుండఁ బెట్టుకొని తీసికొనిపోయెను. సూర్యముఖి తానును కాశికిఁ బోయెదనని చెప్పినదఁట!

నగేం—ఆబ్రాహ్మణునిపేరెవ్వరు? ఏయూరు?

నగేంద్రుఁ డప్పుడు తనమనసునం దొకప్రతిజ్ఞ చేసికొనియెను. ఆప్రశ్న చేసినవాఁడు మరల 'తరువాత నేమైనది?' అనియెను.

శ్రీశ—బ్రాహ్మణుని పరివారముతోఁ గూడ సూర్యముఖి బర్హియను స్థలమువఱకును వచ్చెను. కలకత్తావఱకును, పడవమీఁదను, అటనుండి రాణీగంజివఱకును రైలుత్రోవను, రాణీగంజినుండి బండిమీఁదను బయలుదేరి పోయెను. అంతవఱకు నామెకు నడువ వలసినశ్రమ లేదు.

నగే—తరువాత బ్రాహ్మణుఁ డామెను. వదలివైచెనా?

శ్రీశ—లేదు. సూర్యముఖియే సెలవు తీసికొని పోయినదఁట ఆమె కాశికిఁ బోలేదు. ఎన్నిదినములు నిన్ను చూడకుండ నుండఁగ లదు? నిన్నుఁ జూచుటకు బర్హినుండి కాలిబాటనుబట్టి బయలు దేరెను.

ఆమాటలను చెప్పుచు శ్రీశచంద్రుఁడు కన్నీరు విడువనారంభించెను. ఆతఁడు నగేంద్రుని జూచుచుండెను. శ్రీశచంద్రుని కన్నీరు నగేంద్రునకు మహోపకారము చేసెను. ఆతఁడు శ్రీశచంద్రునికంఠమును కౌఁగిలించుకొని యాతనిభుజముపైఁ దలనుంచుకొని యేడ్చెను. శ్రీశచంద్రునియింటికి వచ్చినది మొదలుకొని నగేంద్రుఁడు దుఃఖించుట లేదు. ఆతనిదుఃఖము రోదనమును మీరియుండెను. అప్పుడు నిరుద్ధంబై యున్నశోకప్రవాహ మతివేగముగఁ బ్రవహింపనారంభించెను. నగేంద్రుఁడు శ్రీశచంద్రునిభుజముపై మొగము నుంచుకొని బాలకునివలె నేడ్చెను. అందువలన నాతనియాతనయుఁ జాలవఱకు శాంతించెను. రోదనము లేనిదుఃఖము యమదూతవంటిది.

నగేంద్రుఁడు 'ఇంకను చెప్పవలసిన దేమైన నున్నదా? ముందు జరగినదంతయును తెలసినట్లే—బర్హినుండి మధుపురమున కొక్క తెయు బయలుదేరి వచ్చుచుఁ బథశ్రమమువలనను, నాహారము లేక

పోవుటవలనను, నావర్షమునందు నిరాశ్రయురాలై మనఃక్లేశమున రోగగ్రస్తయై మరణవేదన ననుభవించుచుఁ బడియున్నది—సరే— ఇంతియేనా!' అని యడిగెను.

శ్రీశచంద్రుఁడు మాటలాడలేదు. తుదకు 'నగేంద్రా! ఆవిషయముంగూర్చి వృథావిచారణ మెందులకు? నీదోష మేమియును లేదు. నీవామెయిష్టమునకు విరోధముగ నేమియును చేయలేదు. స్వయంకృతాపరాధమువలనం గలుగనిదోషమునకు బుద్ధిమంతుఁడనుతాపపడఁడు'' అనియెను.

నగేంద్రనాథుఁ డందుల కనుతాపపడలేదు. అతఁడంతయును స్వదోషమనియే నమ్మియుండెను. అతఁడు విషవృక్షబీజము హృదయమునుండి మొట్టమొదటనే యేల పెల్లగించి పారవైవలేదు?

---

## నలువదియవ ప్రకరణము

### హీరాదాసి విషవృక్షఫలము.

హీరాదాసి తనమహారత్నమును గ్రుడ్డిగవ్వకు విక్రయించి వైచెను. ధర్మము చిరకాలకష్టమువలన రక్షితమగును కానియొక్క నాఁటిప్రమాదమువలన నష్టమై పోవును. హీరాదాసి కట్లే యయ్యెను. ఏధనాశకొఱకు హీరాదాసి యామహారత్నమును విక్రయించినదో యాధన మొకగ్రుడ్డిగవ్వ యైయుండెను. ఏమనిన—దేవేంద్రునిప్రేమ యనునది బురదనీటివరదవలె క్షణికమై నీటివెల్లువ యడఁగినవెనుకఁ గేవలము బురదగా బరిణమించును. మూఁడుదినములలో నాతని ప్రణయ ప్రవాహమునందలి నీరుప్రవహించి పోయి యాహీరను బురదలో దించివైచెను, లోభియగుపురుషుఁడు యశోదంభముచేఁ జిర

కాలమునుండి కడుపుఁగట్టుకొని గడించినధనము నంతను కుమారుని పెండ్లికొఱకో మఱి యేయితరశుభకార్యముకొఱకో వెచ్చపెట్టి పోఁగొట్టుకొనిన యట్లే, హీరాదాసి ప్రయత్నపూర్వకముగఁ గాపాడుకొనియున్న స్వధర్మము నొక నాఁటిసుఖముకొఱకు పోఁగొట్టుకొని గడించినధనమును పోఁగొట్టుకొనిన లోభివలెనే చిరవ్యథకు గుఱియయ్యెను. ఆడుకొనుచుండుబాలకులు గాడ్పుదెబ్బచేఁ బడిపోయిన యపక్వం బగుమామిడికాయను పాలవేసినట్లే దేవేంద్రుఁడు హీరను దారుణవ్యథకుఁ బాలు చేసి పరిత్యజించెను—ఆమె పరిత్యజింపఁబడుటయే కాదు. దేవేంద్రునిచే నవమానితయై యామెపొందిన కష్టము స్త్రీలలో నొకయధమాధమురాలుకూడ సహియింపఁజాలదు.

దేవేంద్రుఁడు హీరను త్యజియించినదినమున నామె యాతని పాదములఁ బట్టుకొని "దాసినైన నన్నుఁ బరిత్యజింపవలదు." అని వేడుకొనియెను. అప్పుడు దేవేంద్రుఁడు "నేను నీమూలమునఁ గుందనందినిని బడయుదు ననునాశచే నిన్నింతవఱకును గౌరవించుచుంటిని. కుందనందినిని నాకొకసారి చూపినచో నీతో మాటలాడెదను. అట్లు చూపవేని నీకు నాకు నింతటితో సరి నీవెంతగర్వించుచుంటివో, యందులకుఁ దగినప్రాయశ్చిత్తము జేసితిని. నీవు కళంకావకుంఠనముతోఁ గూడ నీయింటికిఁ బొమ్ము." అనియెను.

హీరాదాసికిఁ గ్రోధాంధకారము క్రమ్ముకొనియెను. ఆమెతల తిరుగుట నిలిచినతరువాత దేవేంద్రునియెదుట నిలువఁబడి కనుబొమలు ముడవైచికొని కన్నులెఱ్ఱజేసి శతముఖముల నాతనిదిరస్కరించెను. ముగ్ధయగుపాపాత్మురా లెట్లు తిరస్కరించునో యట్లే తిరస్కరించెను—అందువలన దేవేంద్రుఁడు సహింపఁజాలక హీరను కాలితోఁదన్ని ప్రమోదోద్యానమునుండి వెడలఁగొట్టెను. హీరపాపాత్మురాలు. దేవేంద్రుఁడును పాపాత్ముఁడే—అంతియకాక పశుతుల్యుఁడు—వారి పరస్పరప్రేమప్రతిశ్రుతి యీవిధముగాఁ బరిణమించినది.

హీర పదాహతయై యింటికిఁ బోలేదు. గోవిందపురమునం దొకచండాలుఁడు వైద్యము చేయుచుండెను. అతఁడు చండాలులకే యౌషధము నిచ్చుచుండెను. ఆతనికేమియును తెలియదు. కేవలవిష ఘుటికల నొసంగి రోగులను చంపివేయుచుండెను. ఆతనియొద్ద ననేక విధంబులగు పాషాణవిషంబు లున్నట్లు హీరాదాసి యెఱుంగును. ఆమె యారాత్రి యాచండాలునియొద్దకుఁ బోయి యాతనికి ధైర్యము చెప్పి యింటియం దెలుకలను చంపవలసియుండె నని యెదురూపా యల నొసంగి యొకబరణినిండ విషమును తీసికొనివచ్చెను.

అట్లు విషము దీసికొని యింటికిఁ బోయియావిసపుబరణిని చేతియం దుంచుకొని యేడ్చెను. కడకుఁ గన్నులు తుడిచికొని 'నేనే మితప్పు చేసితి నని విషము తిని మరణింపవలయును? నన్నేవ్వఁడు పాదములతోఁ దన్నెనో యాతని జంపకుండ నేనెందులకుఁ జావవల యును? నేను ప్రాణత్యాగము చేసికొనను. నాకిట్టిదుర్దశ కలిగించిన యాతఁడే యీవిషమును తినుఁగాక! అతఁడు తినకపోయినచో నాతని ప్రేయసి యగునందనందిని తినుఁగాక! వారిలో నెవ్వరైన నొక్కరు చావకుండ నేను చచ్చుదానఁగాను. తరువాత మరణింతును' అని యోచించు కొనియెను.

---

## నలువదియొకటవ ప్రకరణము

### హీ ర మా తా మ హి

హీరాదాసిమాతామహి చేతఁ గఱ్ఱను బూని మెల్లగఁ బోవు చుండెను. పిల్లవాండ్రామెను వెంబడించి పాటలుపాడుచు నందులకుఁ దగురీతిఁ గరతాళముల వైచుచు గంతులు వైచుచుఁ బోవుచుండిరి.

వారిపాటలలో విశేషనిందనీయాంశము లేమైన నుండెనో, లేవో మాకావిషయమున సందేహముగనే యుండెను—కాని హీర మాతామహి వారిపాటలనువిని మిగులఁ గోపముతో రేఁగెను.

ఆకోపముచే నాపిల్లలను యమసదనమునకుఁ బోవుట కాజ్ఞ యొసంగుచుండెను. అట్లే వారితండ్రులు మొదలుగువారివిషయమైనోటి కిరానిమాటల నాడుచుండెను. ఈవిధముగా నిత్యమును జరగుచుండెను.

ఆముదుసలి నగేంద్రునియింటిముందటి వాకిలియొద్దకుఁ బోయి నిలువఁబడి పిల్లలయల్లరినుండితప్పించుకొనుచుండెను. అటనున్న ద్వార పాలకులను చూచి యాపిల్లలు యుద్ధవిజితులవలెఁ బాటలు పాడుచుఁ బారిపోవుచుండిరి.

ద్వారపాలకు లమరకోశము మఱియు నితరనిఘంటులలో లేని వాక్యములతోఁ గేకలు వేయుటతోడనే భయపడి యాపిల్లలు పాఱి పోవుచుండిరి.

అప్పు డాముసలిది చేతికఱ్ఱతో టపటపశబ్దముచేయుచు నగేంద్రునిమందిరమున నున్నడాక్టరుగారియింటికిఁ బోయెను. ఆమె డాక్టరు చూచి యానవాలు పట్టి 'అయ్యా! డాక్టరుగా రెక్కడనున్నారు?' అనియెను. డాక్టరు 'నేనే'యని చెప్పెను. ముసలిది 'అయ్యా! కన్నులగపడవు. డెబ్బదియెనుబదియేండ్లున్నవి. ఒకటిరెండేండ్లు తక్కువ యున్న నుండవచ్చును. నవాబు పుట్టి శ్రీరంగపట్టణమును కొల్ల గొనిననాఁటికి నాకు ముప్పదియేండ్లవయసు! నాకడుపుబాధ యేమని చెప్పను? ఒక కుమారుఁ డుండెడివాఁడు. అతని జంపుకొంటిని. ఒక మనుమరాలున్నది. ఆమెనుకూడ—'అనిచెప్పి 'అయ్యో! తండ్రీ! అని గట్టిగ నేడువ నారంభించెను.

డాక్ట—ఇప్పుడు నీకేమికష్టము వచ్చినది?

ఆ వృద్ధురాలందులకు ప్రత్యుత్తర మీయక వెనుకటి తన చరిత్రమును దెలుపుచు గోలుగోలున నేడుపుతో ముగియించెను. అప్పుడు డాక్టరు 'నీకేమి కావలయును?' అని యడిగెను.

వృద్ధస్త్రీ మరలఁ దన పూర్వకథను ప్రారంభించెను. కాని డాక్టరు విరక్తుఁడగుటచే నావిషయమును వదలి హీరాదాసి, దాని తల్లిదండ్రులు, దానిమగఁడు మొదలగువారి జీవితచరిత్రమును గూర్చి చెప్పఁదొడఁగెను. డాక్టరు కష్టపడి యెట్లో యందలి మర్మార్థమును గ్రహియించెను, ఆమె చెప్పినదానిలో విశేషముగ స్వచరిత్రమును, రోదనమునే విశేషముగ నుండెను.

డాక్టరు గ్రహియించిన మర్మార్థ మేమనిన—హీరకౌషధము కావలయును. వాతసంబంధమైన రోగము. హీర తల్లిగర్భమునం దున్నప్పుడు తల్లికిఁ బిచ్చియెత్తినది. ఆమె స్వల్పకాలములోనే మృతి నందినది. హీర చిన్నతనమునుండియు బుద్ధిమంతురాలు. ఆమె కెన్నఁడును తల్లి రోగలక్షణము లగపడలేదు. కాని రెండుమూఁడు దినములనుండి యట్టి సందేహము కలిగినది. హీర యొక్కొకసారి నవ్వును. ఒకసారి యేడ్చును. ఒకసారి యింటివాఁకిట దిరుగాడును. ఒకసారి కేకలువైచును. ఒకసారి మూర్ఛిల్లును. ఆమె యిట్టిరీతి నున్నది. అందుల కౌషధము కావలయును.' అని—

డాక్టరు యోచించి 'నీమనుమరాలికి హిస్టీరియా యైయుండును' అనియెను.

వృద్ధ—అయ్యా! ఇష్టరసమున కౌషధమున్నదా?

డాక్ట—ఔషధము లేకయుండునా? ఆమె కించుక కాక చేయవలయును. మఱియు నీక్యాస్టరాయిల్ (ఆముదము) ను తీసికొని పోయి రేపటియుదయమున నామెకిమ్ము. పిమ్మట నౌషధము నిచ్చెదను.

వృద్ధురాలు క్యాస్టరాయిలుసీసాను తీసికొని కఱ్ఱ చేతఁబట్టుకొని బయలుదేరెను. దారియం దొకపొరుగింటి యామెం జూచెను. ఆమె 'అమ్మమ్మా! పనియేమి?' అని యడిగెను.

వృద్ధు—హీరకు—ఇష్టరసమైనదట! అందుకొఱకు డాక్టరు నొద్దకుఁ బోయితిని. అతఁడీ కష్టరసము నిచ్చియున్నాఁడు. కష్టరసము వలన నిష్టరసము బాగుపడునా?

పొరుగింటస్త్రీ—(చాల యోచించి) అయినను కావచ్చును. కష్టపడకుండ నుండవలయునని యందఱకు నిష్టమే. దేవుని దయవలన నిష్టరసము బాగుపడవచ్చును. మంచిది. అమ్మమ్మా! నీమనుమరాల కింతటి హెచ్చురస మెచ్చటనుండి వచ్చినది!

వృద్ధురాలు చాలవఱకు యోచించి 'ఇది వయోదోషమున వచ్చియుండవచ్చును' అనియెను.

పొరు—కొంచెము చిత్రమూలపురస మిచ్చిచూడుము! అందువలన బెద్దపెద్దరసములన్నియును జీర్ణించిపోవునఁట!

వృద్ధురాలింటికిఁ బోయి డాక్టరు కాక చేయవలయు నని చెప్పిన మాటను (జ్ఞప్తికి) దెచ్చుకొని యొకకుంపటిలో నిప్పులను వైచి తెచ్చి హీరముందర నుంచెను. హీర "ఓసినిర్భాగ్యురాలా! ఇదియేమే? నిప్పెందులకే?" అనియెను.

వృద్ధు—డాక్టరు నీకుఁ గాక చేయవలయు నని చెప్పినాఁడు.

---

## నలువదిరెండవ ప్రకరణము.

### అంధకారపురి—అంధకారజీవనము.

గోవిందపురమునందలి నగేంద్రునిమందిర మాఱుమహాళ్ళుగల ది—నగేంద్రుఁడు, సూర్యముఖియు లేకుండుటచే నంతయు నంధ

కారమయమై యుండెను. కొలువుకూటమున సేవకులే కూరు చుండిరి.

అంతఃపురమునఁ గుందనందిని యొక్క తెయ్యే కుటుంబముతోఁ జేరి ప్రతిపాలింపబడుచుండు బంధువులతోఁ గలసి వాసముచేయుచుండెను. అది కేవలము చంద్రుడులేని యాకాశము—మూలమూలల సాలెపురుగులగూండ్లు; ఇంటింటను ధూళిరాసులు; గోడలపైఁ బల్లులనివాసములు; తోటయందు దెండుటాకులతుక్కు; పుష్కరిణియందు నాచు; అక్కడక్కడనక్కలబిలములు; పూవులతోఁటయందు ముండ్ల డొంకలు; భాండారమున నెలుకలు, ధనాగారమునగబ్బిలపుఁబెంటలు; ధాన్యమన్నియును పిండియైపోవుచుండెను. తేలు, జెఱ్ఱి మొదలగు దుష్టకీటకములుసంచరించుచుండెను. సూర్యముఖపెంచినపావురములు, చిలుకలు మొదలగుపక్షులను పిల్లులుతినివైచెను. అందందు పిట్టల రెక్కలు, నెమళ్ళు పారిపోయినవి. పశువులన్నియును శల్యావశిష్టములై యుండెను—అవి పాలిచ్చుట లేదు. నగేంద్రునికుక్కలటన్నిటికిని నుత్సాహము పోయినది. చెలగాటములాడుక లేదు, మొఱుఁగుటయును లేదు. అందుఁ గొన్ని చచ్చిపోయినవి. కొన్ని పాఱిపోయినవి. కొన్ని కట్టినచోటనే పడియున్నవి. గుఱ్ఱము లన్నియును నానావిధంబు లగురోగములచేఁ బీడింపబడుచుండెను— నిరోగమే రోగముగా నయ్యెను. లాయమున గుఱ్ఱపుఁబెంటయు గడ్డితుక్కును నిండియుండెను. మేడలపై నొకొక్కచోఁ బిట్టగోడలు పడిపోయెను. జాలకమున నినుపయూచలు జారిపోయెను. గ్రంథపేటికలందు రామబాణములు మొదలగుపురుగులు చేరియుండెను. మందిరమున మహాలక్ష్మి లేదు. పెద్దమ్మ నాట్యము చేయుచుండెను.

ఉద్యానవనమున వనపాలకుఁడు లేడు. అంతటను పచ్చిక పెరిగి యుండెను. గృహమునందుఁ గుందనందిని నివసించియున్న ట్లేయుద్యా

నమున నందందొకగులాబి, స్థలపద్మముమాత్రము వికసించియుండెను కుందనందిని నెవ్వరైన రాణియని పిలిచినచో నామె వారు తన్ను హాస్యమాడుచుండిరని యనుకొనుచుండెను. దివానువచ్చి యామె కేమైన విన్నవించినచో నప్పుడామెగుండెలు కొట్టుకొనుచుండెను. అందుల కొకకారణము కలదు. నగేంద్రుఁడు కుందనందిని కొకయుత్తరమైన వ్రాయుటలేదు. ఆమె యాతఁడు దివానునకు వ్రాసినయుత్తరములను తీసికొని చదువుకొనుచుండెను. అట్లు చదివి మరల నాతని కిచ్చుటలేదు. ఆమె కాయుత్తరములను చదువుకొనుటయే సంధ్యాగాయత్రిజపమై యుండెను. ఆకాగితములను దివాను మరల నిమ్మనునేమో యనుభయముచే నామెదిగులొందుచుండెను. ఆభయము చేతనే దివాను పేరు విన్న నామె మొగము వెల్లవోవును. దివానా సంగతిని హీరకుఁ జెప్పి యుండెను. ఆతఁడు మరలఁ దనకాగితముల నడుగుట లేదు. ఆకాగితములకుఁ బ్రతి వ్రాసికొని యుత్తరములను కుందనందినికిఁ బంపివైచెను.

వాస్తవముగ సూర్యముఖి విశేషపరితాపమునొందుచున్నది. కుందనందినిమాత్రము పరితాపపడుట లేదా? సూర్యముఖి తనప్రాణేశ్వరునిఁ బ్రేమించుచున్నది. కుందమాత్రము ప్రేమించుటలేదా? కుందనందినిముగ్ధహృదయమున నపరిమితప్రేమము కలదు—ప్రకాశపఱచుట కామెకు శక్తి చాలకపోవుటచే నిరుద్ధం బగువాయువుం బోలి యాప్రేమము నిరంతరమామెహృదయమును బ్రద్దలుసేయఁ బ్రయత్నించుచుండెను. వివాహమునకు ముందుగనే బాల్యమునుండియు నామె నగేంద్రుని బ్రేమించుచుండెను. ఆసంగతి యెవ్వరికిని తెలుపలేదు. ఎవ్వరికిని తెలియుటయు లేదు. తననిరాశను తానే సహించుకొనుచుండెను. ఇట్లుండ నామెకాకాశచంద్రుఁడు చేతికి దొరకెను. ఇప్పుడా చంద్రుఁ డెచ్చటనున్నాఁడు? నగేంద్రుఁ డేయుప

రాధమువలన నన్నుఁ గాలితోఁ దన్ని వైచినాఁడు'' అని కుందనందిని చేయుంబవలు యోచించుకొనుచు నేడ్చుచుండెను. కుందనందిని యాతని నేల చూడఁబోలేదు? నగేంద్రుఁడు కుందయే యీవిపత్తున కంతకును మూలకారణురాలని యూహించి యుండవచ్చును. అంద ఱును కుందయే యీయనర్థమునకుఁ గారణురా లని యనుకొనుచుం డిరి. కాని కుందనందిని ''ఈయనర్థమునుగూర్చి నేనేమియపరాధము చేసితిని?'' అని యనుకొనుచుండెను.

చెడ్డముహూర్తమున నగేంద్రుఁడు కుందను పెండ్లియాడెను. ఉపవాస మనుచెట్టుక్రిందఁ గూరుచుండువారందఱకును మరణమే గతియైన ట్లీవివాహచ్ఛాయసోకిన వారందఱికిని మరణమే ప్రతిఫలము.

కుందనందిని మరలఁ దనవలననే సూర్యముఖి కట్టికష్టముకలిగి నదనియు, నామె తన్ను సోదరివలెఁ జూచికొని కాపాడినదనియుఁ నట్టియామెను భిక్షుకురాలిగాఁ జేసివైచిన తనవంటిమందభాగ్యురా లుండునా! యనియు, నేనేల చావకపోయితి ననియు, నిప్పుడైన నేల చావఁగూడదనియు, యోచించి మఱియు ''నేను మరణింపను ఆమె వచ్చుఁగాక! ఆమెనొక్కసారి చూచెదను. ఆమెను రానిమ్ము'' అని యనుకొనియెను. కుందకు సూర్యముఖిమరణ సమాచారము తెలియదు. ఆమె మరల ''ఊరక యేల చావవలయును? సూర్య ముఖి వచ్చినతరువాత నామెసుఖమునకుఁ గంటకముగ నుండకుండ నప్పుడు మరణించెదను.'' అని నిశ్చయించుకొనియెను.

---

## నలువదిమూఁడవ ప్రకరణము.



కలకత్తానగరమునఁ జేయవలసినపను లన్నియు ముగిసినవి. దానపత్రము వ్రాయుట యైనది. అందు బ్రహ్మచారికిని పేరు తెలి

యని బ్రాహ్మణునకును, విశేషపురస్కార మిచ్చుట కేర్పాటు కాఁబడియెను. అది హరిపురజిల్లాలో రిజస్టరు కావలసి యుండుటచే నగేంద్రుఁడు దానపత్రమును కూడఁదీసికొని గోవిఁదపురమునకుఁ బయలుదేరెను. శ్రీశచంద్రుని వెనుక బడవపై నెక్కి రావలసినదని చెప్పి యాతఁడుముందుగ బయలుదేరెను. శ్రీశచంద్రుఁడు దానపత్రము వ్రాయవలదనియు, కాలినడకను ప్రయాణము చేయుట యుచితము కాదనియు, చెప్పి యభ్యంతర పఱచెను, కాని యాతనిప్రయత్నము విఫలమయ్యెను. అందువలన నాతఁడు నదీమార్గమున బయలుదేరెను. నాథునివిడిచి యుండుట కమలమణికిఁ గష్టము. కావున నామెయు సతీశునెత్తికొని పడవ నెక్కెను.

కమలమణి గోవిందపురమునకు వచ్చుటను చూచి కుందనందినిమరల నాకాశమున నొకనక్షత్ర ముదయించిన దని భావించుకొనియెను. సూర్యముఖి వెడలిపోయినది మొదలుగఁ గమలమణికి గుందనందినిపై ననివార్యక్రోధము కలదు. ఆమె మొగముచూచుటమానుకొనియెను. ఇప్పుడు వాడిపోయినకుంద మొగమును చూచుటతోడనే యామెకోపము దూరమయ్యెను. ఆమెకుదుఃఖము కూడఁగలిగెను. కమలమణి యిప్పుడు కుందనందినిని సంతోషపఱచుటకుఁ బ్రయత్నించెను. నగేంద్రుడువచ్చుననుసమాచారము వినినతోడనేకుంద మొగము హాసవిలసితమయ్యెను. సూర్యముఖి మరణసమాచార మామెకుఁ దెలిసెను. విని కుందనందిని మిగుల దుఃఖించెను. ఈసంగతినివిని యీ గ్రంథమును చదువు సుందరీమణులు తమలోదాము నవ్వుకొనుచు బాము చచ్చినచో గప్ప నవ్వునని చెప్పుదురు. కాని కుంద కేవలము బుద్ధిహీనురాలు. సవతి చచ్చినచో నవ్వవలయునని యామెకు దోఁచలేదు. వెఱ్ఱిపిల్ల! సవతికొఱ కేడ్చినది! ఓకాంతలారా! మీరు పాము చచ్చినచో గప్ప నవ్వునని యందురు. మీసవతులు మరణించినప్పుడు మీరు నవ్వినచో మేము విని సంతోషపడియెదము.

కమలమణి కుందనందిని నూఱడించెను. ఆమె యించుక శాంతిని వహించెను. మొట్టమొదట గమల చాలసే పేడ్చెను. తరువాత నామె తనలో 'ఏడ్చిన నేమిలాభము ? నేను మరణించినచో నానాథుఁ డసుఖి యగును. సతీశుడు చాల దుఃఖించును. ఎంత యేడ్చినను సూర్యముఖి తిరుగ రానేరదుగదా! నేను క్షేమముగ నున్నచో సతీశుఁ డాడుకొనుచుండును. కాని—ఎట్లున్నను సూర్యముఖి మఱపు రాకయున్నది'అని యీవిధముగా యోచించుకొని యెను.

శ్రీశ—నడువుము. అన్నియును సరిగనే యుండును.

శ్రీశచంద్రుఁడు తోఁటవాండ్రు మొదలగువారి నాయా స్థలముల బాగుచేయుటకు నియమించెను. ఈవంక కమలమణి నిర్దయ వలన నెలుకలు గబ్బిలములు మొదలగునవి తమతమ తావులను విడిచిపోయెను. పరిచారికలందఱును చీపురుగట్టలను బట్టుకొని దిగ్విజయార్థ మెల్లదిక్కులకును బయలుదేరిరి. కొంచెసేపటిలోనే యిల్లంతయును పరిశుభ్రమై నగుమొగమును దాల్చెను.

తుదకు నగేంద్రుఁడు నచ్చుటకు వచ్చెను. అప్పుడు సంధ్యా సమయము. నది మొట్టమొదటఁ బ్రవాహముచే వేగవతి యైన తరువాత నందలి గభీర జలము శాంతభావమును దాల్చినట్లే నగేంద్రుని సంపూర్ణమైన శోకప్రవాహము క్రమముగ గభీర శాంతభావమును దాల్చెను. దుఃఖమేమో కొంచెపడలేదు. కాని యించుక తాలిమి కలిగెను. స్థిరభావమున నాతఁడు పురజనులతో మాటలాడెను. అందఱను పిలిచి క్షేమలాభములను విచారించెను. సూర్యముఖి సమాచార మాతఁ డెవ్వరితోడను దెలుపలేదు. ఆతనిహృదయభావము నెఱింగి యెల్లరు నాతని దుఃఖమునకు దుఃఖించిరి. పరిచారకు లందఱును వచ్చి యాతనికి నమస్కరించి చాటున నిలువఁబడియుండి దుఃఖించిరి. నగేంద్రుఁ డొకవ్యక్తికిమాత్రము మనస్సంకటము కలిగించెను. ఆతఁడు చిరదుఃఖినియై యున్న కుందనందినిని చూడఁబోలేదు.

## నలువదినాలుగవ ప్రకరణము.

### సుస్తిమితప్రదీపము.

నరేంద్రనాథదత్తునియాజ్ఞ ననుసరించి పరిచారకులు సూర్యముఖీశయనగృహము నలంకరించి యామెశయ్యను సవరించి సిద్ధము చేసిరి. ఆసంగతి యంతయును విని కమలమణి తలయూచెను.

అర్ధరాత్రియందు నింటివా రందఱును నిదురించినవెనుక నగేంద్రుఁడు సూర్యముఖీశయన మందిరమున శయనించుటకుఁ బోయెను. కాని పరుండలేక పోయెను. రోదనము చేయనారంభించెను. సూర్యముఖీశయ్యాగృహమతిప్రశస్తమై మనోహరముగనుండెను. నరేంద్రునిమెల్ల సంగతులకు నదియే మందిరమై యుండెను. చాలధనము వెచ్చించి యామందిరము నాతఁడు కట్టించెను. గోడలుమిగులఁబరిష్కృతములై మెత్తగ నుండెను. క్రిందనానావర్ణంబు లగుశిలలచే రంజితములై యుండెను. గోడలయందు నీలపింగళ లోహిత వర్ణంబు లగులతలు, పల్లవములు, పుష్పములుమొదలగునవి చిత్రింపబడి యుండెను. వానిపై నానావిధంబు లగుచిన్నచిన్న పక్షులు కూరుచుండి ఫలంబుల నారగించుచున్నట్లు చిత్రింపఁబడి యుండెను. ఒకవంక నమూల్యంబగు గజదంతముచేఁ బ్రకాశమానంబగు నగానుపని చేసిన మంచముకలదు. మఱియొకవంక విచిత్రవస్త్రాలంకృతంబు లగు కురిచీలు, సోఫాలు మొదలగునవికలవు. పెద్దపెద్ద నిలువుటద్దములు మొదలగునవి యనేకము లుండెను. కొన్ని చిత్రపటములు గోడను వ్రేలాడుచుండెను—అవి విదేశచిత్రములు కావు. సూర్యముఖియు నగేంద్రుఁడును చేరి యోచించి వారియభిరుచి ప్రకారము దేశీయ చిత్రకారునిచే వ్రాయించిరి. ఆచిత్రకారుఁడు ప్రసిద్ధుడగునొక యాంగ్లేయచిత్రలేఖకునివద్ద నావిద్యను నేర్చుకొనియెను. అతఁడు మిగుల

జిత్రముగ లిఖయించి యుండెను. నగేంద్రుఁ డాచిత్రపటముల కమూల్యంబులగు చట్రముల నిర్మించియుంచెను. ఒక చిత్రము కాళిదాసుని కుమారసంభవమున వర్ణింపఁబడి యున్నది—అందు మహాదేవుఁడు పర్వతశిఖరమునం దొక వేదికపైఁ గూరుచుండి తపస్సు చేయుచుండెను. లతాగృహద్వారమున నందీశ్వరుఁ డెడమచేత బంగరు బెత్తమునూని సందడి నివారించుచుండెను. కాననము సుస్థిరమై భ్రమరము లాకులచాటున దాఁగికొని యుండెను. మృగములు శయనించి యుండెను. అప్పుడు పరమేశ్వరునిధ్యానభంగము చేయుటకు మన్మథుఁడుద్యోగించియుండెను. అతనిప్రక్కను వసంతుఁడు ఎదుట వసంత పుష్పాలంకృత యగు పార్వతీదేవి మహాదేవునకుఁ బ్రణామము చేయుటకు వచ్చియుండెను. ఆమె నమస్కరించుట కించుక వంగియున్నప్పుడా దేవి జాను నొకటి భూతలస్పర్శము చేయుచుండెను. స్కంధసహితంబగునా దేవియుత్తమాంగము వంగియుండెను. మస్తకము వంగుటచే నామెయలకబంధమునుండి కర్ణవిలంబితంబు లగునొకటిరెండు కురవకుసుమములు జారిపడుచుండెను. వక్షమునందలి పయ్యెద యించుక యొరగా జరిగియుండెను అప్పుడు మన్మథుఁడు దూరమున నుండి వసంతప్రఫుల్ల వనమధ్యమునఁ దశశరీరము నరచాటుగఁ జేసికొని యొకమోకాలుభూమిపై నూని మనోహరంబగు నలరువిల్లును చక్రాకృతిగఁ జేసి యాపుష్పధనస్సునందుఁ బుష్పశరమును దొడుగుచుండెను—మఱియొక చిత్రమునందు—శ్రీరామచంద్రుఁడు సీతామహాదేవిని లంకనుండి తీసికొని వచ్చుచుండెను. వారిరువురును రత్నదీపితం బగువిమానమున గూరుచుండి యాకాశమార్గమున వచ్చుచుండిరి. శ్రీరామచంద్రుఁడు జానకిభుజముపైఁ జేయుంచి మఱియొక చేతివ్రేళ్ళతో భూలోకసౌందర్యము నామెకుఁ జూపుచుండెను. ఆవిమానమునకు నలువంకలను నీలలోహితశ్వేతవర్ణంబు లగు మేఘములు ఘూర్ణమతరంగముల నుబికించుచుఁ దిరుగుచుండెను. క్రింది

విశాలనీల సముద్రమునందుఁ దరంగము లుప్పొంగుచు సూర్యకిరణప్రసారమున వజ్రాలరాసులవలె నగపడుచుండెను. ఒకతీరమున దూరమునందు సౌధకిరీటాలంకృతం బగులంకాపట్టణము. అందలిసౌధముల నున్న స్వర్ణగోపురము లన్నియును సూర్యకిరణములచేఁ బ్రజ్వరిల్లుచుండెను. మఱియొకతీరమున శ్యామలశోభాయమానం బగు తాళతమాలవననీల సముద్రము. మధ్యభాగమున హంసపఙ్క్తిశ్రేణులు. మఱియొక చిత్రమునందు—అర్జునుఁడు సుభద్రను దీసికొని రథమునఁ గూరుచుండఁజేసి కొనియెను. రథమాకాశమార్గమున మేఘముల నడుమఁ ద్రోవ చేసికొనుచుఁ బోవుచుండెను. వెనుక నసంఖ్యమగు యాదవసైన్యము పఱుగెత్తుకొని వచ్చుచుండెను. దూరమున వారల పతాకశ్రేణియు, మేఘాకృతిం దాల్చినధూళియు నగపడుచుండెను. సుభద్రయే స్వయముగ సారథ్యము చేయుచుండెను.—గుఱ్ఱములు పదక్షేపములచే మేఘములను పొడిపొడిగఁ జేయుచుండెను. సుభద్ర తన సారథ్యనైపుణ్యమునకుఁ దానే సంతోషించుచు మొగముత్రిప్పియర్జును నోరచూపులతో జూచుచుండెను. కుందనసదృశంబు లగుదంతములచే నధరదంశనము చేయునుఁ జిఱునవ్వు నవ్వుచుండెను. రథవేగమునం గలిగినవాయువుచే నామెయలకదామము చలియించుచుండెను ఒకటరెండలక గుచ్ఛములు చెమ్మటందోఁగి చక్రాకృతిగ మొగమ్మున నంటియుండెను. మఱియొక చిత్రమున—సాగరికావేషయగురత్నావళి పరిష్కృతంబగునక్షత్రకాంతిలోఁ దమాలవృక్షము నల్లికొనియున్నలతచే నురివోసికొని ప్రాణత్యాగము చేసికొనుటకుఁ బోవుచుండెను. ఆమెయా చెట్టుకొమ్మనుండి తూగియాడుచున్న పుష్పమయంబగులతాగ్రము నందుకొని కంఠమునకుఁ జుట్టుకొనుచున్నది. మఱియొక చేతితోఁ గన్నీరు తుడిచికొనుచున్నది. లతాపుష్పము లామె కేశదామముపైఁ బడి యపూర్వశోభ నొసంగుచుండెను, మఱియొక చిత్రమునందు-శకుం

తల దుష్యంతునిం జూచునభిలాషముతోఁ గాలినుండి కాల్వనికకుశాం కురమును దీసికొనుచుండెను. అనసూయాప్రియంవద లిరువురును నవ్వుచుండిరి. శకుంతలక్రోధలజ్జావిహ్వలయై మొగమెత్తఁ జాలకుండెను. దుష్యంతునిఁగూడఁ జూచుటకిష్టపడుట లేదు. వెడలి పోవుటయును లేదు. మఱియొక చిత్రమునందు—రణసజ్జితుఁడై సింగపుఁబిల్లవలెప్రతాపశాలియగునభిమన్యుకుమారుఁడు యుద్ధమునకు బోవుటకై యుత్తరయొద్దకుఁ బోయి యామెయనుమతిని వేఁడుకొనుచుండెను. ఉత్తర యాతనిని యుద్ధమునకుఁ బోవలదని నిషేధించుచు గదితలుపులను మూసి యడ్డముగ నిలువఁబడి యుండెను. అభిమన్యుఁడామెభయమును గాంచి నవ్వుటయేకాక నటకునివలె యుద్ధమునందు వ్యూహమును భేదించువిధమును కత్తిమొనతోఁ గ్రిందవ్రాసి యామెకుఁ జూపుచుండెను. ఉత్తరయావంకఁ జూచుటయే లేదు. తనరెండుచేతులతోడను కన్నులను మూసికొని దుఃఖించుచుండెను. మఱియొకచిత్రపటమునందు—సత్యభామచేయుతులావ్రతము చిత్రింపఁబడియుండెను—అందు-చంద్రశిలానిర్మితం బగువిశాలప్రాంగణమును, దానిప్రక్కను సమున్నతసౌధపరిశోభితంబగు రాజమందిరమును. బంగారుగోపురములచే విరాజిల్లుచుండెను. ఆప్రాంగణమధ్యంబున రజతవినిర్మితం బగుత్రాసు కలదు. అందొకవంకఁ దటిత్ప్రదీప్తంబగునీలమేఘఖండమువలె నానాలంకారవిభూషితుండును. ప్రౌఢవయస్కుండును, ద్వారకానాయకుండు నునగుశ్రీకృష్ణుఁడు కూరుచుండి యుండెను. ఆవంకత్రాసు క్రిందఁ గూరుచుండి యుండెను. మఱియొకవంక బంగరుపళ్లెరము నుంచి నానారత్నసమన్వితంబు లగు సువర్ణాలంకారములు రాశిగఁ బోయ బడి యుండెను. అయినను శ్రీకృష్ణునితోఁ దులతూగుట లేదు. ఆయలంకారములున్నవైపున సత్యభామ మిగులప్రోడ; సుందరీమణి, సమున్నతశరీర ; లావణ్యవిశిష్ట ; నానాభరణవిభూషిత; పంకజలోచన—

అట్టిస్థితినున్న తులాయంత్రమును గాంచి యామె ముఖకమలము వాఁడిపోయెను. తన యాభరణముల నన్నిటినిదీసి త్రాసునఁ బడ వేయుచుండెను. చంపక కుసుమసన్నిభంబులగు కరాంగుళులతో గర్ణాలంకృతంబులగు రత్నాభరణములను తీయుచుండెను. లజ్జచే మోమునఁ జెమ్మటబిందువులు క్రమ్మియుండెను. దుఃఖమునఁ గన్నీరు వెడలుచుండెను. క్రోధమున నాసారంధ్రములు విస్ఫారితము లగుచుండెను. అధరదంశనము చేయుచుండెను. ఆయవస్థయంతయుఁ బ్రత్యక్షముగఁ గానవచ్చుచుండెను. రుక్మిణీదేవి బంగరుబొమ్మవలె నటనిలువఁబడి యుండెను. ఆమె మొగమును చింతాక్రాంతమైయున్నట్లుండెను. ఆమెయుఁ దనయలంకారములను దీసి సత్యభామ కిచ్చుచుండెను. కాని యామెకన్నులు శ్రీకృష్ణునిమీఁద నున్నవి. ఆమె స్వామిపై నపాంగదృష్టులఁ బ్రసరింపఁజేయుచుండెను. ఆమెయధరసమీపమునఁ జిఱునగవు మొలకలెత్తుచుండెను. శ్రీకృష్ణుఁడామందహాసమునందు సపత్నీప్రమోదమును సంపూర్ణముగఁ గాంచెను. శ్రీకృష్ణుఁ డేమియు నెఱుంగని వానివలె స్థిరగంభీరుఁడై యుండెను. కాని యాతఁ డోరకంటితో రుక్మిణినిచూచుచు కటాక్షములందే చిఱునగవు తోపఁజేయుచుండెను. వారినడుమ శుభ్రవసనధారియు, శుభ్రకాంతివిరాజితుఁడు నగు నారదుఁడు అతఁ డానందముతో నంతయును చూచుచుండెను. గాలిచే నాతనియుత్తరీయమును శ్మశ్రువులును చలియించుచుండెను. నలుదిక్కులనుండియు వేలకొలదిపౌరులు నానాలంకారభూషితులై యుండి అసంఖ్యాకులగు బ్రాహ్మణులు చేరియుండిరి. పురరక్షకులు సందడి నడఁచుచుండిరి—ఆచిత్రపటముక్రింద సూర్యముఖి స్వహస్తాక్షరములతో "ఎంతకర్మమో యంతఫలము. స్వామినితూచుటకు వెండిబంగారములా ?" అని వ్రాసి యుంచెను.

నగేంద్రుఁడు శయనమందిరమునకుఁ బోవునప్పటికి రాత్రి రెండు జాములు మీరివుండెను. ఆరాత్రి యతిభయంకరముగ నుండెను.

సాయంకాలమునుండియుఁ గొంచెముగొంచెముగ వానయు గాలియు నుండెను. గాలి హెచ్చుగుచుండెను. అప్పుడు వాన కురియుచునే యుండెను. గాలిప్రచండవేగము వహించియుండెను. తెరచినతలుపులు తెరచినట్లేయుండెను. తలుపులు గాలికిఁగదలి చప్పుడగుచుండెను. కిటికీతలుపులును చప్పుడగుచుండెను. నగేంద్రుఁడు పడకటింటికిఁ బోయి తలుపు మూసికొనియెను. వాయువేగము తగ్గెను. మంచమున కవ్వలనున్న తలుపుమాత్రము తెరవఁబడియుండెను. ఆద్వారమునుండి గాలి వీచుట లేదు. అది యట్లే తెరవఁబడియుండెను.

నగేంద్రుఁడు నిట్టూర్పువిడిచి యొకసోఫాపైఁ గూరుచుండెను. దానిపైఁ గూరుచుండి యాతఁడెంతగా నేడ్చెనో యెవ్వరు నెఱుంగరు ఎన్నిసారులో సూర్యముఖియు నాతఁడు నాసోఫాపై నెదురునెదురుగఁ గూర్చుండి సుఖసంభాషణములఁ జేసికొని యుండిరి.

నగేంద్రుఁడు కేవలజడస్వరూపంబగునాసోఫా నెన్నిసారులో ముద్దు పెట్టుకొని కౌఁగిలించుకొనియెను. మఱియు నిదివఱకు సూర్యముఖి విశ్వాసముతోఁ జూచుకొనుచున్న చిత్రపటములను గాంచుచుండెను. దీపముజ్జ్వలముగ వెలుఁగుచుండెను. చంచలంబగుదీపకాంతివలనఁజిత్రములన్నియు, సజీవములై యున్నట్లగపడుచుండెను. ఒకనాఁడు సూర్యముఖి పుష్పాలంకారభూషిత యగుమహాదేవింగాంచి తాను నట్లుండఁ గోరెను. అప్పుడు నగేంద్రుఁడు స్వయముగ నుద్యానమునకుఁ బోయి పూవులను గోసి తెచ్చి యామెనలంకరించెను. అందువలన సూర్యముఖి యప్పుడానందించినట్లు రత్నాలంకారవిభూషితయై రత్నమయిమైయున్న యేరమణీమణియు నానందింపఁజాలదు. ఆసంగతి నగేంద్రునకప్పుడు జ్ఞప్తికి వచ్చెను. మఱియొకనాడు సుభద్రసారథ్యమును చూచి సూర్యముఖి నగేంద్రునిగుఱ్ఱపుబండిని నడపింపవలయు నని యాశపడియెను. పత్నీవత్సలుఁ డగునగేంద్రుఁ డొక చిన్న బండికి బర్మాదేశజంబు లగునుత్తమాశ్వముల రెండిటింబూన్చి సూర్యముఖియుఁ దాను నందుఁ గూర్చుండి యాబండి నుద్యానమునకు మరలించెను. సూర్యముఖి యట నొగపైఁగూరుచుండి గుఱ్ఱపు

గళ్యములం బట్టుకొని తోలుచు సుభద్రవలెనే తానును మొగము ద్రిప్పి యోరకంటితో నగేంద్రునిజూచి చిఱునవ్వు నవ్వుచు నధరదంశనము చేసికొనియెను. ఆయవకాశమునందు గుఱ్ఱములుద్యానమార్గమును విడిచి రాజవీథింబట్టి రాజభవనము నొద్దకు వచ్చెను. అప్పుడు సూర్యముఖిలజ్జాభిభూతయై మేలిముసుఁగు సవరించుకొనియెను. అప్పటియామె యవస్థంగాంచి నగేంద్రుఁడు తానాగుఱ్ఱములను దోలి బండిని లోపలకుఁ దీసికొనిపోయెను. బండినుండి దిగినతరువాత వారిరువురు నెంతవఱకు నవ్వుకొనిరో యాసంగతింగూర్చి మేము వ్రాయఁజాలము——అదియు నాతనికి స్మృతికలుగుటచే నాతఁడు చాలదుఃఖించెను. ఇఁక సహింపఁజాలక యాతఁడటనుండి లేచి యటు నిటు తిరుగ నారంభించెను. ఇఁక సహింపఁ జాలక యాతఁడటనుండి లేచి యటు నిటు తిరుగ నారంభించెను. ఏవంకఁజూచిన నావంక నాతనికి సూర్యముఖిస్మృతికిఁ దెచ్చుచిహ్నములే యగపడుచుండెను. గోడలపై వ్రాసినతలంగాచి యట సూర్యముఖియు నొకతలను చిత్రించియుండెను. అది యిప్పటికి నట్లేయుండెను. ఒకదినమున సూర్యముఖి తనప్రాణేశ్వరునిపైఁ బడవలయునని కుంకుమను విసరెను. అది యాతనిపైఁ బడక గోడపై బడియెను. ఆచిహ్నమిప్పటివఱకు నాగోడపై నుండెను. ఆమందిరము కట్టిసిద్ధమైన తరువాత సూర్యముఖి స్వహస్తలిఖితములగు స్పష్టాక్షరముల నీక్రిందివిధముగ నాయింటిగోడపై వ్రాసియుంచెను. ఎట్లన——

1910 సంవత్సరమునందు

నాయిష్టదేవతాస్వరూపుఁడగు

నాప్రాణేశ్వరునికొఱకు

మనోహరంబగు నీశయనమందిరము

దాసియగుసూర్యముఖిచేఁ

బ్రతిష్ఠింపఁబడియెను. అని

నగేంద్రుఁడు దానిని చదివెను. ఆతఁ డెన్నిసారులు చదివె నో?—ఎంతచదివినను తృప్తికలుగలేదు—కన్నీటివలన మాటిమాటి కి దృష్టి లోపించుచుండెను—కన్నీరు తుడిచికొని చదివెను. చదువు చుండఁగనే దీపకాంతి తగ్గిపోవుచుండెను. అప్పుడు చమురు తగ్గిపోవుట చే దీపము మూడువంతులు కాంతిహీన మయ్యెను. మెరుగుడుపురువు వలె మినుకుమినుకుమనుచుండెను. అంధకారమువలె నున్నయావెలు తురునం దొకయద్భుత మాతనికన్నులకుగోచరించెను. చండమారుత వేగమునం జకితుఁడై నట్లే యాతఁడామంచముప్రక్కను తెరచియున్న ద్వారమువంకఁ జూచెను. ఆద్వారముకొద్ద నాకొలఁది వెలుతురునం దొక ఛాయాస్వరూప మాతనికన్నులఁ బడియెను. అది స్త్రీరూపము వలె నుండెను. ఆతఁడు మరలఁ జూచెను. చూచినతోడనే యాతని మేనంతయును పులకరింపఁ గాలుసేతులు వడఁకనారంభించెను. ఆ ఛాయ సూర్యముఖి యాకారమువలె నున్నట్లాతఁడు భావించెను— నగేంద్రుఁడు దానిని సూర్యముఖి ఛాయయేయని గుర్తించెను. అప్పు డాతఁడు మంచముపైనుండి క్రిందఁబడి మరల లేచి యాఛాయ యున్నచోటికిఁ బోయెను. ఛాయ యదృశ్యయయ్యెను. ఆసమయము ననే దీపముకూడ నారిపోయెను. అప్పుడు నగేంద్రుఁడు బిగ్గఱగఁ గేకవైచి మూర్ఛితుఁడై క్రిందఁబడిపోయెను.

---

## నలువదియొదవ ప్రకరణము

నగేంద్రునకుఁ దెలివి వచ్చునప్పటికి శయ్యాగృహద్వారము నిబిడాంధకారబంధురమై యుండెను. క్రమముగా నాతనికి స్మృతి కలిగెను. మూర్ఛపోవుట జ్ఞప్తికి దోఁచినపుడెల్ల నాతని కాశ్చర్య

ముపై నాశ్చర్యము కలుగఁజొచ్చెను. ఆతఁడు మూర్ఛితుఁడై పడిపోయెను. అట్టి వానికిఁ దలదిండెట్లువచ్చినది ? ఇది యెవ్వరిదిండు ? అను సంశయ మాతనికిఁ గలిగెను. ముట్టి చూచెను. అది దిండు కాదు. ఒక మనుష్యుని తొడపైఁ బరుండియున్నట్లు తోఁచెను. అది కోమలమై యుండుటవలన నొక రమణీమణిదై యుండవలయునని బోధపడియెను. ఆతఁడు మూర్ఛిల్లుచున్నప్పు డాతని తలనెత్తి తొడలపైఁ బెట్టుకొన్న దా రెవ్వరై యుందురు ? కుందనందినియై యుండవచ్చును. ఆతఁడప్పుడు సందేహనివారణార్థమై 'నీవెవ్వరు' అని ప్రశ్నించెను. తలను తొడపై నిడికొనిన యామె ప్రత్యుత్తరమీయలేదు. కాని యాతనిపై నప్పు డొకటిరెండు వేడి కన్నీటిబిందువులు పడియెను. అప్పుడు నగేంద్రుఁ డామె యెవ్వరైననేమి ? ఏడ్చుచున్నదని యూహించుకొనియెను. ప్రత్యుత్తరము రాకుండుటచే నగేంద్రుఁ డామె శరీరమును స్పృశించెను. నగేంద్రున కాకస్మికముగ బుద్ధిభ్రంశ మయ్యెను. ఆతని యొడలంతయు రోమాంచిత మయ్యెను. నగేంద్రుఁడు నిశ్చలుఁడై, జడప్రాయుఁడై కొంతసేపు పడియుండెను. పిమ్మట మెల్లమెల్లగ నామె తొడపైనుండి తలయెత్తి లేచి కూరుచుండెను.

అప్పుడు వానయు గాలియుఁ జల్లారినవి. ఆకాశమున మేఘములు లేవు. పూర్వదిక్కునఁ బ్రభాతకాంతు లగపడుచుండెను. వెలుతురు కూడ వచ్చెను. తలుపుసందులనుండి వెలుతురు లోపలఁ బ్రవేశించుచుండెను. నగేంద్రుఁడు లేచి కూరుచుండి చూచెను. రమణియు లేచెను. ఆమె లేచి ద్వారమునొద్దకుఁ బోయెను. నగేంద్రున కామె కుందనందినిగాఁ దోఁచలేదు. అప్పుడింకనుకొంచెము చీఁకటిగా నుండుటవలన మొగము నానవాలు పట్టుటకు వలనుపడలేదు. కాని యానడక మొదలగు వానినిబట్టికొంచెము బోధపడియెను. ఆతఁడు

బాగుగఁ బరీక్షించెను, చూచుచుండగనే యాస్త్రీమూర్తి యాతని పాదములపైఁ బడియెను. అట్లుపడి కన్నీరు విడుచుచుఁ గాతరస్వరముతో 'మీరు దేవతలైనను, మానవులైనను నేను మీచరణకమలములపై బడియుంటిని. నాతో మాటాడవలయును. అట్లుమాటలాడకపోయినచోఁ బ్రాణత్యాగముచేసికొనియెదను' అనియెను.

ఆరమణిమాటలను నగేంద్రుఁడు తెలిసికొనలేదు. ఆమాటలాతని చెవిని పడినతోడనే నగేంద్రుఁడు బాణమువలె లేచి నిలువఁబడియెను. నిలువబడియున్న కాంతను పట్టుకొనఁబోయెను. కాని మనసును, శరీరమును, మోహాచ్ఛన్నంబు లగుటచే నాతఁడు చెట్టుమీఁదినుండి పడుబల్లివలె నామెపాదసాన్నిధ్యమునఁ బడిపోయెను. మఱిమాటాడలేదు.

కొంతసేపటి కక్కాంత మరల నాతనితలను తొడపై బెట్టుకొనియెను. నగేంద్రుఁడు మోహనిద్రనుండి మేలుకనకుండఁగనే దినోదయమయ్యెను. శయ్యాగృహపార్శ్వమునను్న పుష్పోద్యానమునందలి చెట్టుచెట్టునను పక్షులు కలకల కూయుచుండెను. గవాక్షమునుండి సూర్యకిరణములు గృహంబునఁ బ్రవేశించుచుండెను. అప్పుడును తనతల యొకరమణీమణి తొడపైనున్నట్లు నగేంద్రుఁడు తెలిసికొనియెను, కన్నులు విప్పకయే యాతఁడు 'కుందా! నీవెప్పుడు వచ్చితివి? నేను రాత్రి యంతయును సూర్యముఖినే స్వప్నమునఁ గాచుచుంటిని. ఆస్వప్నమునందు నేను సూర్యముఖితొడపైఁ దల నుంచుకొంటిని. నీవు సూర్యముఖివే యైనచో నెంతయానందముగా నుండునోగదా!' అనియెను.

'మీరానిర్భాగ్యురాలిమొగముఁ జూచి యంతగా నానందింతురేని మందభాగ్యురాలగునాసూర్యముఖిని నేనే'

నగేంద్రుఁడు పరీక్షించి చూచి పులకితుఁడై లేచి కూరుచుండెను. మరలఁ జూచెను. విచారావిష్టుఁడై మరలఁ గూలఁబడియెను

మరలఁ గన్నీరు తుడిచికొని చూచెను. మరలఁ దలవంచికొని తనలో దానే 'నేనుపిచ్చివాఁడనై పోయితినా? కాదు—సూర్యముఖి జీవించియేయున్నదా? లేదు—నేనే పిచ్చివాఁడను.' అనియనుకొని భూతలశాయియై కన్నులు మూసికొని మరల నేడువనారంభించెను.

అప్పుడారమణి యాతనిచరణకమలములఁ బట్టుకొనియెను. ఆతనితలపైఁ దలనుంచుకొని యాచరణములను తనకన్నీటిచే నభిషేకించెను. తరువాత నామె 'లెండు! నాజీవనసర్వస్వమా! లెమ్ము! లేచి కూరుచుండుము! నాదుఃఖము లన్నియును తీరిపోయినవి. లెండు! నేను మరణింపలేదు. మరల మీపాదసేవ సేయుటకై వచ్చియుంటిని.' అనియెను.

ఇంకను భ్రాంతియా? నగేంద్రుఁడు లేచి సూర్యముఖిని కౌగిలించుకొనియెను. ఆమెవక్షముపైఁ దలనుంచుకొని మౌనియై యవిశ్రాంతముగ రోదనము చేయఁదొడఁగెను. ఇరువురు నెంతయో సేపేడ్చిరి. వారిలో నెవ్వరును మాటాడలేకపోయిరి. ఎంతయో సేపేడ్చిరి. రోదనమునఁగూడ సుఖమున్నదా?—

---

## నలువదియాఱవ ప్రకరణము

యథాసమయమున సూర్యముఖి నగేంద్రుని కుతూహలమును నివారించెను. ఆమె యాతనితోఁ దన వృత్తాంతమును చెప్పఁదొడంగెను. ఏమనిన—నేను చావలేదు—వైద్యునిమాట యసత్యము. ఆతనికిఁ దెలియదు. నేనాతని చికిత్సలవలన నారోగ్యవతినై మిమ్ములను జూచుటకు గోవిందపురము రావలయునని మిగుల నాత్రపడితిని. ఈ సంగతి బ్రహ్మచారితో మనవిచేసితిని. తుదకాతఁడు గోవింద

పురమునకు నాతోఁగూడ వచ్చుటకు సమ్మతించెను. ఒకనాఁడు సాయం కాల మైనతరువాత భోజనానంతరమున నాతనితోఁ గలసి గోవిందపురమునకు బయలుదేరితిని. ఇక్కడకు వచ్చి చూడఁగా మీరిట లేరు. అప్పుడా బ్రహ్మచారి యూయూరికి మూఁడుక్రోశముల దూరమున నున్న యొకయూరిలో నొక బ్రాహ్మణునియింట సన్నాతని కుమార్తెతో జతచేసి యుంచి మిమ్ము వెదకుటకు బయలుదేరెను. ఆతఁడు మొదట గలకత్తాయందు శ్రీశచంద్రునితో మాటలాడి యాతనివలన మీరు మధుపురమునకుఁ బోయినట్లు తెలిసికొనియెను. తరువాత నాతఁడు మధుపురమునకు బోయెను. అక్కడ మేము హారమణి యిల్లు వదలిన దినముననే యామె యిల్లు కాలిపోయినదనియు, హారమణికూడఁ గాలిపోయినదనియు, నింటియందున్న యిరువురి కాంతలలో నొక్కతె వెడలిపోయినదనియు, మఱియొకతె కాలిపోయినదనియు, జబ్బులేని యామెయే పారిపోయియుండుననియు, రోగగ్రస్తయగు కాంత మరణించియుండుననియు, నుదయమున నాయూరివారు సిద్ధాంతము చేసికొనిరి. మొట్టమొదట ననుమానముగా నుండినను క్రమముగా జనప్రవాదమువలన నాసంగతి నిశ్చయమయ్యెను. ఆ సంగతివినియున్న రామకృష్ణుఁడు మీతో నట్లే చెప్పియుండెను. బ్రహ్మచారి యాసంగతి తెలిసికొని తరువాత మీరు నా మరణవృత్తాంతము విని యీవంకకువచ్చి రని విని వికలహృదయుఁడై మిమ్ములను వెదకనారంభించెను. ఆతఁడు మొన్నటికిఁ బ్రతాపపురము చేరెను. మీ రొకటిరెండు దినములలో నూరికిఁ జేరెదరని నాకుఁ దెలిసినది. నేను నాయాశచేతనే నిన్న నిచ్చటకు వచ్చితిని. ఇప్పుడు నేను మూఁడుక్రోశములవఱకును నడువఁ గలను. నడచుట నా కభ్యాసమైనది. నిన్న మీరు రాలేదని తెలిసి వెడలిపోయితిని. నిన్న బ్రహ్మచారిని చూచి మరల నిచ్చటికి వచ్చితిని. నేనిచ్చటికి వచ్చునప్పటికి

జాము రాత్రియైనది. చూడగా నప్పటికి గవాక్షములు తెరచి యుండెను. అప్పుడీయింటఁ బ్రవేశించితిని. నన్నెవ్వరును చూడలేదు. మెట్లక్రింద దాఁగికొనియుంటిని. మీరు శయనించుటకు వచ్చిరని యనుకొంటిని. తుదకుఁ బైకెక్కివచ్చి చూచితిని. ఆ ద్వారము తెరవ బడియుండెను. ద్వారమునుండి తొంగి చూచితిని. మీరు తలపైఁ జేయుంచుకొని కూరుచుండియుంటిరి. మీయొద్దకు వచ్చి పాదములపైఁ బడవలయునని యూసించితిని. కాని భయమయ్యెను. మీయెడల నేనపరాధము చేసితిని. మీరు క్షమియింపకపోయినచో నప్పుడేమిచేయుదును? మిమ్ముఁ జూచుట తోడనే తృప్తి వహియించియుంటిని. ద్వారమున కడ్డముగా నిలువఁబడి చూచుచుంటిని. అప్పుడే వచ్చి చూతమని యోచించితిని. చూచుటకు వచ్చుచుంటిని—కాని నన్నుఁ జూచినతోడనే మీరచేతను లైతిరి. అప్పుడు వేగముగవచ్చి మీశిరంబును తొడపైఁ జేర్చికొని కూరుచుంటిని. అంతటియదృష్టము నాకు మరల లభియించునని నేననుకొనలేదు. కాని—అయ్యో! మీరు నన్నుఁ బ్రేమించుట లేదు. నాపైఁ జేయివైచినను మీకు గుర్తు తెలియలేదు—నాకు మీగాలి సోఁకినతోడనే బోధయైనది.

---

## నలువదియేడవ ప్రకరణము

### సరళ—సర్పి

శయ్యామందిరమున సుఖసాగరమునందు మునిగి తేలుచు నగేంద్రుఁడును, సూర్యముఖియుఁ బ్రాణప్రియకరంబు లగువాక్యములతో సంభాషించుకొనుచున్నప్పుడు మందిరము వెలుపల ప్రాణాంతకంబు

లగు వాక్యములు వినవచ్చుచుండెను. కాని యామాటలసంగతి తెలుపుటకు ముందుగనే యారాత్రిజరగిన సమాచారము తెలుపుట యావశ్యకము.

నగేంద్రుఁడు కుందనందినిని చూడలేదు. కుంద తనశయనాగారమునఁ దలదిండుపై మొగ ముంచుకొని రాత్రియంతయు రోదనము చేయుచుండెను. బాల్యమునందే నిష్కపటముగ నాత్మసమర్పణము చేసి తమయమూల్య హృదయమును వేఱొకని కర్పించి యందులకుఁ బ్రతిగఁ బరాభవము నందినవారుమాత్రమే యారోదనముయొక్క మర్మచ్ఛేదకత్వము ననుభవమునకుఁ దెచ్చికొనఁజాలుదురు.

స్వామిసందర్శనమునకై తానింక నేలప్రాణములతో నుంటినని పరితాపపడుచున్న కుందనందిని "ఇప్పుడేసుఖమునకై ప్రాణములతో నుండవలయును!" అని యోచించుకొనుచుండెను.

రాత్రియంతయును రోదనముతో జాగరముచేసిన కుందనందినికి ప్రభాతకాలమున నించుక కన్నులు మూతవడియెను. ఆనిద్రలో రెండవసారి భయంకరమైన యొకస్వప్నముం గాంచెను.

నాలుగువంత్సరముల ముందు తండ్రి మృత్యుశయ్యాపార్శ్వమునఁ బరుండియున్నప్పుడు జ్యోతిర్మయమూర్తిందాల్చి కలలోనికి వచ్చిన తల్లివలెనే యిప్పుడును శాంతభావముం దాల్చిన జ్యోతిర్మయమూర్తియొంకు కుందనందినికలలో నామె శిరోభాగమునకువచ్చి నిలువఁబడియెను. ఈసారియామూర్తి విశుద్ధచంద్రమండల మధ్యమునం దుండలేదు. వక్షోన్ముఖం బగునిబిడనీలమేఘమధ్యంబునుండి వచ్చినట్లుండెను. ఆజననీమూర్తి చుట్టును నంధకారమయంబు లగు నల్లని జలతరంగములు బయలుదేరుచుండెను. దానిమధ్యప్రదేశమున క్షణక్షణమునకును మెఱపు మెఱయుచుండెను. కుందనందిని భయముతోఁ జూచెను. హా! సనిరతంబగు నాముఖమండలము హీర

మొగము బోలి యుండెను. కరుణామయంబగు తల్లి తేజము మొదటి వలె లేదు. గంభీరముగ నుండెను. తల్లియు "కుందా! అప్పుడు నా మాట చెవిని బెట్టవైతివి. నాతోఁగూడ రావైతివి—ఇప్పుడు దుఃఖ పడవలసిన వచ్చినదికదా!" అనియెను.

కుందనందిని యేడ్చెను. అప్పుడు తల్లి "నేను మరల వచ్చెద నని మొదట నీతోఁ జెప్పియుంటిని. కావున నిప్పుడు వచ్చితిని. సంసార సుఖమున నీకుఁ బరితృప్తి కలిగినయెడల నాతోఁగూడ రమ్ము!" అనియెను.

కుంద యేడ్చుచు "అమ్మా! నన్ను నీవెంటఁ బెట్టుకొనిపొమ్ము నేనిట నుండఁజాలను" అనియెను. ఆమాట విని తల్లి ప్రసన్నయై "అట్లయినచో బయలుదేరుము. అనిచెప్పి యంతర్హిత యయ్యెను. తరువాత కుందకు మెలకువ కలిగెను. ఆమె తన స్వప్నమును స్మృతికిఁ దెచ్చుకొని భగవంతునింగూర్చి "నాస్వప్నము సఫలము చేయుము" అని ప్రార్థించెను. ప్రాతఃకాలమున హీరయు కుందనందిని యుపచారములకై యామె మందిరమునకు వచ్చెను. కుంద యేడ్చుచుండెను.

కమలమణి వచ్చినదిమొదలు హీర కుందకు విధేయురాలై యుండెను. నగేంద్రుఁడు వచ్చునను వర్తమానమే యావిధేయతకుఁ గారణము పూర్వపారుష్యమునకుఁ బ్రాయశ్చిత్తరూపముగా నామె కుంద నందినిని మొదటికంటె నతి ప్రేమమునఁజూచుచు నామెయా నతి నెఱవేర్చుచుండెను. కాని కుందనందిని యసామాన్యసరళహృదయ. అంతియకాక స్వల్పవిషయములకే సంతుష్టినందుచుండును. కావున కుందనందిని హీరాదాసినూతన ప్రీతినటనమునకుఁ బ్రీతియయ్యెను. ఆమె యెడల నెంతమాత్రము ననుమానించుటలేదు

హీర—అమ్మా! ఏడ్చెద వెందులకు?

కుంద మాటలాడలేదు. హీర మొగమువంక జూచుచుండెను. కన్నులు తుడిచికొనుచున్నను కన్నీరు వెడలుచునేయుండెను. తల దిండు తడిసిపోయెను. హీర "ఇదియేమి? రాత్రియంతయు నేడ్చు చున్నట్లు కనబడుచున్నది? బాబుగారేమైన ననిరాయేమి?" అని యడిగెను.

కుందనందిని "లేదు" అని చెప్పి మఱింతయధికముగా రోద నము చేసెను. హీర యేదోవిషముండునని యనుకొనియెను. కుంద నందినిదుఃఖమును చూచి యామెహృదయ మానందమున మునింగి పోయెను. హీర మొగమింతచేసికొని "బాబుగారింటికి వచ్చిన తరు వాత నిన్నేమైన నన్నారా? నేను నీదాసిని. నాతోఁ దెలుపఁ గూడదా?" అనియెను.

కుంద—ఏమియు ననలేదు.

హీర—అదేమితల్లీ! ఇన్నిదినములై వచ్చియు నీతోమాట లాడనేలేదా?

కుంద—నన్నుఁజూడలేదు.

ఇట్లుచెప్పునప్పుడు కుందనందిని తనదుఃఖము నాపికొనిలేక పోయెను.

హీర తనహృదయమున సంతసించి నవ్వుచు "అయ్యో! అందుకొరకేడువలవలయునా? నీకంటెను. విశేషదుఃఖముగల మరెంద ఱు లేదు? వచ్చిచూచుట యాలస్యమైనంత మాత్రమున నేడ్చెదవెందు లకు? అనియెను. విశేషదుఃఖమునవేమో కుంద యెఱుంగదు. అప్పుడు హీర "నావంటిదుఃఖమే నీకున్నచో నీవింతకుముందేయాత్మ హత్య చేసికొనియుందువు" అనియెను.

"ఆత్మహత్య" అనునమంగళశబ్దము కుందనందినిచెవికి దారు ణముగఁ దోఁచెను. ఆమాటవిని యామె వడఁకనారంభించెను. రాత్రి

యామె యెన్నియోసారులాత్మహత్యనుగూర్చి యూహించుకొనియుం డెను. హీరనోటినుండి యామాటవచ్చుటంగాంచి కుంద దానినేత్రస్థిరప అచుకొనియెను.

హీర—నాదుఃఖమునుగూర్చి తెలిపెదను. వినుము. నేనొక్కని నాప్రాణముకంటె హెచ్చుగ ప్రేమించుచుంటిని. ఆతఁడు నాస్వామి కాలేదు. నేనుచేసిన పాపము నధికారిణివగు నీయొద్ద దాచుటెందులకు? చేసిన పాపము నంగీకరించుటయే మంచిది.

లజ్జావిహీనంబు లగువాక్యములు కుందచెవినిఁ బడలేదు. ఆమె చెవియందు ఆత్మహత్యయనుమాటయే ప్రతిధ్వనించుచుండెను. ఏదేనొకభూతమువచ్చి యామెశ్రవణమునందు "నీవాత్మహత్య చేసికొనఁగలవు. ఈపరితాపము సహించుటయే మంచిదో చచ్చుటయే మంచిదో?" అని చెప్పుచున్నట్లుండెను.

హీర—ఆతఁడు నాస్వామి కాలేదు. కాని నేనాతనిని కోటిస్వాములకంటె నెక్కుడుగ ప్రేమించి యుంటిని. ఆతఁడు నన్ను ప్రేమింపుటలేదు, ఆసంగతి నేనెఱుఁగుదును. ఆతఁడు నాకంటెను శతగుణములు పాపాత్మురాలును, గుణహీనురాలును నగునామెను ప్రేమించుచుండెను—ఇట్లు చెప్పుచు హీరమొగము వాఁడువార కుందనందినిని ! క్రోధముతోఁజూచుచు మరలఁ జెప్పదొడఁగెను. నేనంతయు నెఱింగి యాతని జూచుటకుఁబోలేదు. కాని యొకదినమున మాయిరువురకు నొకదుర్బుద్ధి పుట్టినది" అనియీవిధముగా నారంభించి వివరముగాఁ బేరులనుమాత్రము చెప్పక తనకును దేవేంద్రులకును జరగిన సంగతు లన్నియును చెప్పెను. ఆతఁడు తన్నుఁ గాలితోఁ దన్నుటనుకూడఁ దెలిపి "నేనేమి చేయవలసినది? చెప్పుముచూతము!" అనియెను.

కుంద "ఏమిచేసితివి?" అని యడిగెను. హీరతలయుఁజేతులు నల్లాడించుచు "నేనిప్పుడేమి ఛండాలనైదుర్యనింటికిఁ బోయి విషమును

కొని తెచ్చితిని. కాని యితరులకొఱకు నేనేల చావవలయునని యోచించి యావిషమును బరిణయం దుంచి పెట్టెలోఁదాచికొంటిని' అనియెను. ఇట్లు చెప్పిహీర మఱియొకగదిలోనికిఁ బోయి తన పెట్టెను తీసికొని వచ్చెను. ఆమె యాపెట్టెను, బహుమాన పూర్వకముగను నపహారణపూర్వకముగను లభియించిన వస్తువులను దాఁచికొనుటకై నగేంద్రునియింటనే యుంచెను. హీర దానియందే విషముకూడ నుంచెను. అప్పుడాపెట్టెమూత తెరచి విషపుబరిణె నామెకు జూపెను. కుందనూంసలోలుపంబగు పక్షివలె హీరవంకఁ జూడసాగెను. హీర పరాకుగనున్నట్లభినయించి యాపెట్టెకుఁ దాళము వేయక కుందనందిని కుపదేశము చేయుచుండెను. ఆసమయమునం దాకస్మికముగఁ బ్రాతః కాలమున మంగళవాద్యములు వినఁబడియెను. హీర యవియేమో తెలిసికొనుటకై యాశ్చర్యముతో వెడలిపోయెను. ఆయవకాశమున మందభాగ్యురాలగు కుందనందిని యాపెట్టెనుండి విషపుబరణినితీసి దాచి యుంచుకొనియెను.

---

## నలువదియెనిమిదవ ప్రకరణము

హీర వచ్చి చూచునప్పటికి మంగళవాద్యకారణము తెలియ లేదు. ఒకగొప్పమందిరమున రమణు లెల్లరును గుంపుగూడి కోలాహలము చేయుచుండిరి. వారందఱు నొకకాంతను చుట్టుకొనియుండిరి. హీరకాసుందరిశిరోజములుమాత్ర మగపడియెను. కౌసల్యాదిపరిచారకలామెకురులకు సుగంధతైలమును రాచుచుండిరి. అటగొందఱు నవ్వుచు, కొందఱు మాటలాడుచు, కొందఱు కేకలువైచుచు, కొందఱు పాటలుపాడుచు నుండిరి. కమలమణి శంఖము నూదుచుండెను.

పన్నీటి నందఱిపై జల్లుచుండెను. ఏడ్చుచు నేడ్చుచు నవ్వుచుండెను. హీరకు మిగుల నాశ్చర్యము కలిగెను. ఆమె బొట్టనవ్రేళ్ళపై నిలిచి తలయెత్తి చూచి యాశ్చర్యవిహ్వలయయ్యెను. సూర్యముఖి కూరుచుండి యమృతమయస్నేహభావమున నవ్వుచుండెను. పరిచారికలు సుగంధతైలములతో నామెకురులను సంస్కరించుచుండిరి. కొందఱు నెమ్మేని కలంకృతి యొనరించుచుండిరి. అందఱు నామెసేవ చేయుచుండిరి.

సూర్యముఖి మరణించె నని వినుటవలన నిప్పుడామె యటఁ గూరుచుండి నవ్వుచుండుటనుగూర్చి హీరకు నమ్మకము కలుగలేదు. ఆమె యింకొకతెం జూచి "ఆమెయెవ్వరే?" అనియెను.

ఆప్రశ్న కౌసల్య చెవులఁబడియెను. అప్పుడామె హీరంజూచి "కనఁబడుటలేదా? గృహలక్ష్మి! మీకు మృత్యువు!" అనియెను. అదివఱకు కౌసల్య హీరకు భయపడుచుండెను. ఇప్పుడామెకు సమయము దొరకుటచేఁ దలయెత్తి కన్నులు త్రిప్పుకొనసాగెను. తలదువ్వుటయైనది. అలంకరించుటయు నైనది. అందఱును పరామర్శించుట యైనది. పిమ్మట సూర్యముఖి కమలచెవిలో 'కుందను చూచివత్తము. ఆమె యేపాపము నెఱింగినది కాదు. ఆమెపై నాకుఁ గోపము లేదు. ఆమె యిప్పుడు నాకు సోదరికూడనైనది' అనియెను.

సూర్యముఖియుఁ గమలయుఁ గుందను చూడఁబోయిరి— వారు పోయి చాలసేపైనది. తుదకు గమలమణి భయక్లిష్టవదనయై కుందమందిరమునుండి వెలుపలకువచ్చెను. వ్యస్తహృదయయై నగేంద్రుని బిలుచుటకుఁ బరిచారకునంపెను. నగేంద్రుఁడు పరచారకునితోఁ గూడ మందిరములోనికిఁ బోయెను. వాకిట సూర్యముఖినిచూచెను. ఆమె యేడ్చుచుండెను. అప్పుడాతఁడు "ఏమిజరగినది?" అని యడిగెను.

సూర్యముఖి 'సర్వనాశనమైనది' ఇదివఱ కొకదినమునం దైన నాకు సుఖపడునదృష్టము లేదని యనుకొంటిని. అట్టి యదృష్టమే నాకున్న యెడల నీసారి తప్పకసుఖియింతునని తలంచుకొనుచుండఁగా మరలనిట్లేల యగును?' అనియెను.

నగేంద్రుఁడు భయముతో 'ఏమి?' అనియెను.

సూర్యముఖి మరల నేడ్చుచు 'కుందను చిన్నతనమునందే పెద్దలలోనికిఁ జేర్చితిని! ఇప్పుడు నాకామె సోదరియైనది. సోదరి వలెనేయామె నాదరింపవలయు నని నేనాశపడితిని. నాయాశయంతయు మండి బూడిదయైపోయినది! కుంద యిప్పుడు విషము త్రాగి వేసినది' అనియెను.

నగేం—అది యెక్కడ నున్నది?

సూర్య—మీరామెయొద్దఁ గూరుచుండుఁడు. నేను డాక్టరును పిలిపించెదను — అనిచెప్పి యామె వెడలిపోయెను. నగేంద్రుఁ డొక్కఁడే కుందనందినియొద్దఁ గూరుచుండెను.

నగేంద్రుఁడు బాగుగఁ జూచెను. కుందమొగము నల్లవడిపోయినది. కన్నులు నిస్తేజములై పోయినవి. శరీరమవసన్నమై వికలమైపోవుచున్నది.

---

## నలువదితొమ్మిదవ ప్రకరణము

### ఇన్నాళ్లతరువాత నోరు తెరచినదా ?

కుంద క్రిందఁ గూరుచుండి మంచపుఁగోటి కొరఁగియుండెను. నగేంద్రుఁడు సమీపించినతోడనే యామె కన్నులనీరు కాలువలు కట్టెను. నగేంద్రుఁడు దగ్గరకుఁ జేరనతోడనే పడిపోయినబల్లివలె నామె యాతని పాదములపైఁ బడియెను. నగేంద్రుఁడు గద్గద

స్వరముతో "ఇది యేమికుందా! ఏమి తప్పుచేసితి నని నన్ను విడిచి పోవుచుంటివి?" అనియెను.

కుంద యెన్నఁడును స్వామివాక్యమునకుఁ బ్రత్యుత్తర మిచ్చి యెఱుంగదు. ఇప్పు డంత్యకాలమున నోరెత్తి నాథునితో మాటాడెను. నేనేమి తప్పు చేసితినని మీరు నన్నుఁ ద్యజించితిరి?" అనియెను. నగేంద్రుఁడు నిరుత్తరుఁడై తలవంచికొని కుందయొద్దఁ గూరుచుండెను. కుందయు "ఈరాక నిన్ననే మీరువచ్చి యొకసారి 'కుందా!'యని పిలిచి నాయొద్దఁ గూరుచుంటిరేని నేను చచ్చుదానఁగాను. నేను మీయనుగ్రహము వడసి కొలదిదినములే యైనది—మిమ్ములఁ గన్నారఁ జూడవలయు నను నాశ తీరనేలేదు కావున నేను మరణించి యుండను"అనియెను. ప్రీతిపూర్ణంబయ్యు శూలసమంబగు నామాటను విని నగేంద్రుఁడు మోకాళ్ళపైఁ దలనుంచుకొని మౌనియై కూరుచుండెను.

కుంద మరలఁ జెప్పఁ దొడంగెను. కుందనందిని ముగ్ధ—ఇఁక నీజన్మమున స్వామితో సంభాషించు భాగ్యము లభియింపదని యెంచి మాటలాడెను. 'మీరూరకయుండుట బాగుగలేదు. మీనగుమొగము చూచుచుఁ జావకున్నచో నాకీ మరణమునందును సుఖములేదు'అనియెను. సూర్యముఖి కూడ నొకసారి యట్టిమాటనే యనియుండెను. అంత్యకాలమునం దందఱు నొక్కటియే. నగేంద్రుఁడు మర్మపీడితుఁడై కాతరస్వరముతో 'నీవేల యింతసాహసము చేసితివి? నీవు నన్నొకసారి రమ్మని పిలువఁగూడదా?' అనియెను.

కుంద కరఁగి, భూమిపైఁ బడు మేఘముయొక్క గర్భము నందలి మెఱపుంబోలిన చిఱునవ్వు నవ్వి 'మీరిట్లు యోచింపవలదు. అది కేవలము మనోవేగముచేఁ జెప్పినమాట. మీరు వచ్చుటకు ముందే నేను మిమ్మొకసారి చూచి చావవలయు ననియు, అక్కగారు వచ్చినచో మిమ్మామె కొప్పగించి మరణింపవలయుననియు స్థిరసంకల్పము చేసికొంటిని—మరల నామె సుఖమునకుఁ గంటకమువలె నుండఁగూడదని నిశ్చయించుకొంటిని. అట్లు మరణింపవలయు నని

నిశ్చయించుకొన్న నాకు మిమ్ముఁ జూచినతోడనే చచ్చుట కిష్టము లేకపోవుచున్నది' అనియెను. నగేంద్రుఁ డేమియుఁ బ్రత్యుత్తరము చెప్పలేకపోయెను. ఇప్పు డాతఁ డాబాలిక—వాక్చాతుర్యములేని యీ కుందనందిని సముఖమున నిరుత్తరుఁడై పోయెను. కుందనందిని క్షణకాల మూరకుండెను. ఆమెకు మాటలాడుశక్తి తగ్గిపోవుచుండెను. మృత్యుదేవత యామెను నావరించుకొను చుండెను. నగేంద్రుఁడు మృత్యుచ్ఛాయాంధకారమున మ్లానమైపోవుచున్న కుందనందిని ముఖమునందలి స్నేహప్రఫుల్లతను గాంచుచుండెను. మందంబగు మెఱపును నిందించుచు నాధిక్లిష్టం బగు నామె వదన మండలమున నుదయించు చిఱునగవును గాంచుచుండెను. ఆతని వార్థక్యావస్థవఱకు నాతనిహృదయఫలకమున నాచిఱునగవు చిహ్నితమై యుండెను. కుందనందిని యించుక విశ్రాంతి నందియపరితృప్తయైనట్లే మరలఁ గ్లిష్టంబగు నిశ్వాసముతో 'నాకు మాటలాడవలయు ననునాశ తీరలేదు. నేను మిమ్ము పరమేశ్వరునిగ భావించుకొంటిని. సాహసించి మీతో మాటాడలేదు. నాశరీర మవసన్నమగుచున్నది. నాస్వరము కంపించుచున్నది. నాలుక యెండిపోవుచున్నది. నాకిఁక నెంతో కాలము లేదు'' అని చెప్పి మంచమును వదలి నేలపైఁ బరుండి నగేంద్రునిపదంబులపైఁ దలనుంచుకొని కన్నులు మూసికొన నీరవయయ్యెను.

డాక్టరు వచ్చెను. చూచి సంగతి తెలిసికొని యౌషధమీయ లేదు. ఆశలేదని తెలిసికొని మ్లానవదనుఁడై వెడలిపోయెను. మరణకాల మాసన్న మయ్యెనని తెలిసికొని కుంద కమలమణిని సూర్యముఖిని చూడవలయునని కోరెను. వారువచ్చినతోడనే యామెవారి పాదధూళిని శిరంబునఁ దాల్చెను. వారిరువురును నేడువనారంభించిరి. తరువాత కుందనందిని స్వామిపాదములపై శిరముంచుకొనియెను. ఆమె నిశ్శబ్దముగ నుండుటం గాంచి వారిరువురు నేడువదొడంగిరి. కుంద మఱిమాటాడలేదు. క్రమక్రమముగ స్మృతి యెడలుచుండ స్వామిచరణములపైఁ దలనుంచి యామె నవయౌవనముననే ప్రాణ

ములను విడిచెను. బాగుగ వికసించకుండఁగనే కుందకుసుమము రాలిపోయెను. మొట్టమొదట దుఃఖము నడంచుకొని సూర్యముఖి మృతురాలైనకుందనందినిం జూచుచు "భాగ్యవతీ! నీకుఁగల యదృష్టము నాకు లభియించుఁగాక! నేనును నీవలె స్వామిచరణతలంబునఁ దలయుంచుకొని మరణించునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక!" అని యనుకొనియెను.

ఇట్లనుకొని యేడ్చుచున్న స్వామిచేతులను పట్టుకొని మఱియొక చోటికిఁ దీసికొనిపోయెను. తుదకు నగేంద్రుఁడు ధైర్యము తెచ్చుకొని కుందను నదీతీరమునకుఁ దీసికొనిపోయి యథావిధిగ సంస్కరించి యతులంబగు నాసువర్ణప్రతిమను విసర్జించి వచ్చెను.

---

## ఏబదియవ ప్రకరణము

## సమాప్తి

కుందనందిని మరణించిన తరువాత నామెకు విషము తెచ్చియిచ్చిన వారెవ్వరని విచారింపఁగా హీరయే యాపని చేసియుండునని యందఱకు ననుమానము కలిగెను. నగేంద్రుఁడు హీరను కానక యామెకొఱకు వర్తమాన మంపెను. హీర దొరకలేదు. కుందమరణకాలముననే హీర యదృశ్యయయ్యెను. అదిమొదలుగ హీరనాదేశమునం దెవ్వరును చూడలేదు. గోవిందపురమున హీరపేరు లేకుండఁ బోయెను. ఒకసంవత్సరమైనతరువాత నామె దేవేంద్రునొకసారి చూచెను. దేవేంద్రుఁడు బీజము నాఁటి పెంచిన విషవృక్షమునందు ఫలము ఫలించెను. అతఁడు కఠినంబు లగు చెడురోగములచేఁ బీడింపఁబడియెను. అంతియకాక మద్యపాననిరతుం డగుటచే రోగము కుదురనట్లుండెను. దేవేంద్రుఁడు మరణశయ్యపై నుండెను. కుందనందిని మరణించిన సంవత్సరముననే దేవేంద్రునకుఁ గూడ నంత్యకాల మాసన్నమయ్యెను. చచ్చుటకు మూఁడునాలుగు దినములు ముందుగనే శయ్యనుండి లేచుటకుఁ గూడ నాతనికిశక్తి

లేకపోయెను. అప్పుడాతనియింటివాకిట నేదియో గద్దలమయ్యెను. అప్పుడు దేవేంద్రుఁడు "ఎవరువారు?" అనియెను. సేవకులు వచ్చి "పిచ్చిదొకతెవచ్చి మిమ్ముఁ జూడఁగోరుచున్నది. ఏమి చేసినను పోవుటలేదు" అనిరి. దేవేంద్రుఁ డామెను లోనికిఁ దీసికొని రం డనియెను.

ఉన్మత్తయు నింటిలోనికి వచ్చెను. దేవేంద్రుఁ డామెను చూచెను ఆమె దరిద్రస్త్రీవలెనుండెను. ఆమెయొద్దనున్మత్తలక్షణము లేవియు నగపడుట లేదు. కేవలము దీనురాలగు భిక్షుకివలెనుండెను. ఆమెవయసు చెదరియుండుటయే కాక పూర్వలావణ్యాచిహ్నములుకూడ నగపడుచుండెను. కాని మిగులదుర్దశయం దుండెను. ఆమెవస్త్రము మలినమై చినిఁగియుండెను—మోకాలుదిగుటలేదు—వెన్నును తల యునుగూడమూయుటకుఁ దగియుండ లేదు. ఆమెకురులు చెదరియుం డెను. జడగట్టికొనిపోయినవి. దేహమంతయు నసహ్యముగనుండెను. భిక్షుకురాలు వచ్చి దేవేంద్రుని తీవ్రదృష్టితోఁ జూచుటయు సేవకులు చెప్పినమాటలు దేవేంద్రునకు నిజముగఁ దోచెను.

ఆయున్మాదిని చాలసేపాతనింజూచి "నన్నానవాలు పట్టితివా?" అనియడిగి "నేనుహీరను" అనియెను. దేవేంద్రుఁడు చమత్కృతుఁడై "నీకిట్టిదశ నెవ్వరు కలిగించిరి?" అని యడిగెను. హీర తీవ్రక్రోధప్రదీప్తకటాక్షములతో నధరదంశనము చేసికొనుచు పిడికిలితో దేవేంద్రుని గ్రుద్దుటకు వచ్చెను. కాని యట్లు చేయక "నాకిట్టిదశ కలిగించినవా రెవ్వరని నీవడిగెదవా ? నీవే కాదా ? నీకిప్పుడు స్మృతి లేదు. కాని యొకదినమున నేను నీకానందముం గూర్చితిని. ఈయింటియం దీస్థలముననే కూరుచుండి నీవు నాపాదములఁ బట్టుకొని" అనిచెప్పి హీర మంచముపై గాలుంచి యిట్లు గానముచేయ నారంభించెను.

"స్మరగరళఖండనం మమశిరసిమండనం
దేహిపదపల్లవముదారం"

ఇట్లు మనసునకు వచ్చినట్లు పాడి "ఏదినమున నీవు నన్ను తిర

స్కరించి తన్ని వెడలఁగొట్టితివో యాదినమునుండియు నేను పిచ్చిదాననైపోయితిని. విషపానము చేయఁదలంచితిని. కాని నాకొకయానందకరంబగుయోచనకలిగెను. అప్పుడు విషపానముచేయకనీకై నను, కుందనందినికైననునీయవలయునని యనుకొంటిని ఆధైర్యమువలననే నాయున్మాదమునడంచుకొని యుంటిని. పిచ్చికలిగినప్పు డింటఁ బడియుండుచుంటిని తరువాతఁ బనికిఁ బోవుచుంటిని. తుదకు నీకుందనందినికి విషమిచ్చి మనోదుఃఖమును పోఁగొట్టుకొంటిని. ఆమెమరణించినతరువాత నాయున్మాద మతిశయించినది. ఇఁక నారోగము నడంచుకొనఁజాలక దేశమును విడిచిపోయితిని—అన్నమునకాధారము లేదు. పిచ్చిదానికి భోజనముపెట్టువా రెవ్వరు ? అప్పటినుండి బిచ్చమెత్తఁదొడంగితిని. పిచ్చికుదిరినప్పుడు బిచ్చమెత్తుచుంటిని. పిచ్చిముదిరినప్పుడు చెట్టుక్రిందఁ బడియుందును. నీకిప్పుడు మరణమాసన్నమయ్యెనని విని సంతోషముతో నిన్నుఁ జూడవచ్చితిని. నీకు నరకమునందుఁగూడఁ దావు దొరకకుండుఁగాక యని యాశీర్వదించుచుంటిని'' అనియెను. అంతవఱకు మాటలాడి యాయున్మత్తురాలుచ్చస్వరంబుతో నవ్వెను. దేవేంద్రుఁడు భయపడి మఱియొకవంకకుఁ దిరిగెను. హీరగునగున నాయింటనుండి వెలుపలకుఁబోయి ''స్మరగరళఖండనం మమశిరసిమండనం దేహిపదపల్లవముదారం'' అని పాడెను. అది మొదలుగ దేవేంద్రుని మరణశయ్య కంటకమయమయ్యెను. మరణమునకుముందాతఁడుజ్వరప్రలాపములలో''పదపల్లవముదారం'' ప్రలాపించుచుండెను. దేవేంద్రునిమరణానంతరమునఁ జాలదినములవఱకు నాయుద్యానవనపాలకు లర్ధరాత్రమునందు స్త్రీ కంఠస్వరమున—

స్మరగరళఖండనంమమశిరసిమండనం
దేహిపదపల్లవముదారం''

అని పాడుచున్న పాటను వినుచుండిరి.

మేము విషవృక్షమును సమాప్తి చేసితిమి. దీనిమూలమున నింటింటను నమృతము ఫలియింపగలదని ధృడముగ నమ్మియుంటిమి